సాహిత్య

# ప్రస్థానం

ఫిబ్రవరి 2013

వెల రూ. 10



సాహితీ స్రవంతి

PRSVM02A146

సాహిత్య ప్రస్థానం
ఫిబ్రవరి 2013
సంపుటి : 12 సంచిక : 2

# కల్లోల కాలంలో కలాలు

గడిచిన ఏడాది డిసెంబర్ 28న రెండు పరిణామాలు జరిగాయి. ఒకటి తెలుగు మహాసభ, మరొకటి తెలుగు రాష్ట్ర భవితవ్యంపై దేశ రాజధానిలో అఖిలపక్ష సమావేశం. నెల ముగిసిన తర్వాత జనవరి 28న చూసుకుంటే ఏముంది? రెండు విషయాల్లోనూ ఆశాభంగమే.

తెలుగు భాషా వికాసానికి తీసుకోవలసిన చర్యలపై గత సంచికలో సమగ్ర ప్రణాళికే సూచించాము. తిరుపతిలోనూ పెద్దలు చాలా మాటలు చెప్పారు. వాటిలో కొన్నిటినైనా అమలు చేయడానికి నెల రోజులు కూడా అక్కర్లేదు. కాని ఈ నెలలోనూ జరిగిందేమిటి? ఒరిగిందేమిటి? ముఖ్యమంత్రి కార్యాలయంలో తెలుగులోనే ఉత్తర ప్రత్యుత్తరాలు జరగాలని హడావుడి తప్ప చెప్పుకోదగిన మార్పు నాస్తి.

ఢిల్లీ సమావేశంలో నెల రోజుల గడువులో నిర్ణయం చెబుతానన్న కేంద్ర ప్రభుత్వమైతే ఆ మేరకు ఎలాటి ప్రకటనా చేయకపోవడం మరో ఆశాభంగం. అయితే అనిశ్చితికి అలవాటు పడిపోయిన ఆంధ్ర ప్రదేశ్ ప్రజానీకానికి ఆశ్చర్యకరం మాత్రం కాదు. ఈ ఆనిశ్చితి అవాంఛనీయ పరిణామాలకు దారి తీయకుండా జాగ్రత్తపడుతూ అందుకు కారకులైన వారిని నిలదీయవలసింది ప్రజలే.

............

గతంలో విద్యుచ్ఛక్తి వుద్యమానికి కవులు రచయితలు గొప్పగా సంఘీభావం పలికారు. కొత్త సాహితీ చైతన్యానికి అది నాంది అయింది. దాదాపు పుష్కరకాలం తర్వాత అంతకు అనేక రెట్లు ఎక్కువగా 33 వేల కోట్ల రూపాయల మేర విద్యుచ్ఛక్తి భారాలు మోపేందుకు పాలకులు సిద్ధమైపోయారు. ఇలాటి తరుణంలో మరోసారి వికసించిన విద్యుత్తేజంతో కలాలకు పదునెక్కించాలి. గళాలు మార్మోగాలి. కల్లోల ఘట్టంలో కర్తవ్యోన్ముఖం చేయాలి.

............

గురజాడ 150వ జయంతి సందర్భంగా ప్రస్థానానికి కొద్ది మాసాలుగా ఆయన సాహిత్యంపై చాలా వ్యాసాలు అందాయి. అధ్యయనానికి ఉపయోగపడతాయనే ఉద్దేశ్యంతో ఈ సంచికలో ప్రచురించాం.

............

ఈ సంచిక ప్రచురణకు వెళ్తున్న సమయంలో 1 నుండి 10వ తరగతి వరకు విధిగా తెలుగులో చదవాలని ఉత్తర్వు వెలువడినట్టు వార్త వచ్చింది. సంతోషం.

బొమ్మలు : తుంబలి శివాజి, వెంకటేష్

## ఈ సంచికలో...





చిరునామా
సాహిత్య ప్రస్థానం
ఎం.హెచ్.భవన్, ప్లాట్ నెం. 21/1, అజామాబాద్, ఆర్టిసి కళ్యాణమండపం దగ్గర, హైదరాబాద్-500 020,
ఫోన్ : 27660013, 9490099059
ఫ్యాక్స్, 040-27635136,
ఇ.మెయిల్ : ssprasthanam@gmail.com
www.prasthanam.com

కథ




ఎస్. భూ నగమోహనరావు
9441754855


# గృహావైద్యం

"ఏవండీ మనమేమయినా శాపగ్రస్థులమయ్యామా?" అని.

తను నిరుత్తరుడవుతాడు. తనకు మట్టుక్కు ఏం తెలుసు? తనకు తెలియకుండానే ఎవరి తపస్సునైనా తాను భంగపరిచాడా? మనుష్య సంచారమే లేని ఈ అడవిలో తమను శపించిన ఆ తాపసి ఎవరై వుంటారు ? అయినా తపోభంగం కలిగించడం తన వంటి వారి వలన ఎలా సాధ్యమవుతుంది ? అందుకు రంభ, ఊర్వశి, మేనక, తిలోత్తమల వంటి దేవ కాంతలు కావలెగదా ! లేకుంటే ఈ తాపసులు సామాన్యులు కావించే తపోభంగానికి లొంగుతారా ? ఆ తాపసి ఎవరో ఒకమాటు కనబడితే బావుణ్ణు. అందితే పిలక, అందకుంటే గడ్డం వూడపెరికయినా సరే సంగతేవిఁటో తేల్చేసేవాడు. తన పేరు నరసింహమా మజాకా !

అది అనగనగా ఒక కాకులు దూరని కారడవి, చీమలు దూరని చిట్టడవి లాగనే ఉంటుంది. చీకటి పడడానికి మరెంతో సమయం ఉన్నట్లు లేదు. తను ఆ అడవిలో యథావిధిగా ఒక సన్నని కాలిబాట వెంట నడుచుకుపోతున్నాడు. అలా పోగాపోగా అడవి మధ్యలో, చుట్టూ చాలా భాగం పడిపోయిన మట్టి ప్రాకారంతో వున్న ఓ శిథిల గృహాన్ని చేరుకుంటాడు. ఆ శిథిల గృహంలో కొంత కాలంగా తన భార్య, యిద్దరు పిల్లలతో నివాసం ఉంటున్నాడు. అందులో తామెందుకు నివాసం ఉండవలసి వస్తూందో, అసలది ఏ ప్రాంతమో అంతా అయోమయంగా ఉంది. ఎవరినైనా అడుగుదామని ప్రతిదినం ప్రయత్నిస్తునే ఉన్నాడు. కాని మానవ మాత్రుడనే వాడెవడూ కానరావడం లేదు. మనుష్య గణాలకు తామెంత దూరంలో ఉన్నారో మరి !

'ఈ చుట్టుపక్కల ఎవరైనా ఉన్నారా?' అని అరచి, కేకలు వేసి మరీ కనుక్కుందామంటే నోరు పెగలదేం? ఎవరు తన గొంతు నొక్కుతున్నారు? ఏదో మంత్ర బద్ధుడైనట్లుగా, ప్రతిదినం సూర్యోదయానికి ముందు, తిరిగి సూర్యాస్తమయ సమయానికి యిదే కాలిబాటలో తను ఎక్కడికి వెళ్ళి వస్తున్నట్లు ?

భార్య అడుగుతుంది :

అడవిలో అసంఖ్యాకంగా చెట్లు వున్నాయి. మర్రిచెట్లు, రావిచెట్లు, టేకు చెట్లు, మద్దిచెట్లు, గుగ్గిలం చెట్లు, కుంకుడు చెట్లు, బూరుగచెట్లు, చింతచెట్లు, కానుగ చెట్లు, వేపచెట్లు, దేవదారు వృక్షాలు... యివే తనకు తెలిసినవి. తెలియనివి ఎన్నో ! ఇంకా పరిమళాలను సుగంధాలను విరజిమ్ముతూ అనేక రకాల ఫలవృక్షాలు, పూలచెట్లు, చెట్లను అల్లుకొని వున్న ఏవేవో లతలు... వీటి మధ్య నుండి కాలిబాట మెలికలు తిరుగుతూ ఒక మహాసర్పం సాగిపోతున్నట్లుగా వుంటుంది.

చెట్ల చిటారు కొమ్మలు పైన ఆకాశం అగపడకుండా, వెలుతురు కూడా చొరరానంత దట్టంగా అల్లుకుపోయి, ఆ ప్రాంతం ఒక సువిశాల ఛత్రఛాయలో వున్నట్లుగా అనిపిస్తూ వుంటుంది. చెట్లతో పాటు బాటకిరువైపులా పెద్దపెద్ద పాములపుట్టలు, ఏవేవో ముళ్ళపొదలు, దుబ్బులు, దొంకలు, కాళ్ళకడ్డంబడుతూ తీగలు, కొంచెం దూరంలో కాలిబాట అంతమైపోయిందా అన్న భ్రమను కలిగిస్తూ వుంటాయి. కాని కాలిబాటలకు అంతమే లేనట్లుగా వుంటుంది. ఈ నడకకూ అంతం వున్నట్లు కనబడదు. పైన అల్లుకుపోయి వున్న చిటారు కొమ్మల ఆకుల సందుల్లోంచి అప్పుడే విరుస్తూన్న వెన్నెల చిట్టిచిట్టి చినుకులుగా రాలుతూ వుంటే వేళ మీరిందన్న వైనం తన నడక వేగాన్ని పెంచుతూ వుంది. ఆ లేత వెన్నెల చినుకుల వెల్తురులో దారికడ్డంబడి 'జుర్రు జుర్రు' మని, 'సర్రు సర్రు' మని పాములు పరుగెడుతూ కనబడుతున్నాయి. కొన్ని కాళ్ళకడ్డం పడుతూవున్నాయి. కొన్ని కాళ్ళకింద మెత్తగా నలుగుతూ వున్నాయి. శరీరం 'ఝుల్లు ఝుల్లు' మంటూ వుంటే తను తటాలున గంతుతూ, దుముకుతూ వడివడిగా అడుగులు వేస్తూ ముందుకు సాగిపోతున్నాడు. ప్రతిరోజూ యిలాగే వుంటుంది. కొన్ని సర్పాలు కొన్ని అడుగుల దూరంలో తనను చూసి పడగలు విప్పి ఆడుతూ వున్నాయి. వెన్నెల చినుకులు పడడం వలన వాటి పడగలు తళ తళ లాడుతున్నాయి. కొన్ని పాములు 'మిల మిల' లాడుతూన్న కన్నులతో తనకేసి తీక్షణంగా చూస్తూ వున్నాయి. మొగలి పొదల మాటు నుండి కాబోలు విషనాగులు కొన్ని వేగంగా తనను సమీపించి కాటువేయబోయి, వింతగా ఎందుకనో తృటిలో తప్పుకుంటున్నాయి. ఎందుకని అవి కాటు వేయడం లేదో కారణం తెలియదు కాని, తను ఆ కారణంగానే రోజూ క్షేమంగా ఇల్లు చేరుతూ వుంటాడు. విశాలమైన కైవారాలుగల మహావృక్షాల బోదెలను కొన్నింటిని చుట్టి విభ్రాంతికరమైన శరీరాలు గల మహాసర్పాలు ఏవేవో కదలాడుతూ వున్నాయి. అనకొండలా? నీళ్లల్లో కదా ఉండాలి.... ఇంగ్లీషు సినిమాల్లో చూపిస్తుంటారు... పైన చెట్ల కొమ్మల్లోంచి కూడా వుండీ వుండీ పాములు రాలి పడుతూ వున్నాయి. కొన్ని సర్పాలు వింతగా ఒక విధమైన ధ్వనిని చేస్తున్నాయి. దినదినం ఈ నరకాన్ని ఎదుర్కొవడం తనకు నిత్యకృత్యంగా మారింది. దారిలో ఒక పక్క ఊడలు భూమిలోకి దిగిపోయి, బ్రహ్మరాక్షసుల తెగిపడిన తలల్లా వటవృక్షాలు, మరొక పక్క ఆకులు 'గల గల' మని శబ్దం చేస్తూంటే భయంకరమైన ఆకృతులుగా కనబడుతూ వున్న రావి చెట్లు - కొన్ని వేపచెట్లతో పెనవేసుకు మరీ ! ఒళ్ళు చల్లబడిపోయేలా చేస్తున్నాయి. కొంతమేర అంతా చింతచెట్ల మయం. వాటి మీద దయ్యాలుంటాయంటారు... తను పరుగెడుతున్నాడు. ఎవరో 'హ్హహ్హ'! అని నవ్వుతున్నారు. గుండెలవిసి పోతున్నాయి. ఒళ్ళంతా స్వేదంతో తడిసిపోయింది. అంతలో పరిచితమైన కాంతి రేఖ గోచరమయ్యింది. శిథిల గృహం చేరువ అయ్యింది. ప్రాకారం లోపల ఇంటి ముఖ ద్వారంపై మెట్టు మీద, చేతిలో నూనె దీపంతో, అటూ యిటూ తమ యిద్దరు పిల్లలతో, తన భార్య నిలబడి వుంది. మట్టి ప్రాకారం మీద నుండి లోపలికీ, బయటకూ పాకుతూన్న పాములు వెన్నెట్లో గోచరమవుతున్నాయి.



ప్రాకారం దాటి లోపలికి వస్తూన్న తనను చూడగానే భార్య "వచ్చారా!" అంది ఏడుస్తూ.

"ఇల్లంతా పాములు నాన్నగారూ ! మనం ఈ ఇంట్లో ఉండొద్దు. ఎక్కడికైనా తీసుకుపొండి." అంటూ భళ్ళున ఏడ్చింది ఎనిమిదేళ్ళ కూతురు.

"మేమింకా అన్నం కూడ తిన్లే." అంటూ వెక్కి వెక్కి పడ్డాడు అయిదేళ్ళ కొడుకు.

తనకు కళ్ళు నిండుకు వచ్చాయి. ఏం అనగలడు ? తన దుస్థితి తన కర్థమయితే కదా !

"పనయ్యిందా?" అనడిగింది ఇల్లాలు కళ్ళు తుడుచుకుంటూ ఏం పని ? ఏ మహా కార్యం మీద తాను రోజూ తన కుటుంబాన్ని ఈ దుర్గమారణ్యంలో నిర్దాక్షిణ్యంగా వదిలిపోయి వస్తున్నాడు ? మనసు 'ఇది అన్యాయం ! అన్యాయం !' అంటూ ఆక్రోసిస్తూ వుంది.

"రండి. ముందు స్నానం చెయ్యండి. అన్నం తిందురుగాని." అంది భార్య.

"నాన్నగారూ ! దొడ్లో అరుగు దిగకండి దొడ్డంతా పాములు తిరుగుతున్నాయి." కూతురు హెచ్చరించిది, తను కూడా కళ్ళు తుడుచుకుంటూ.

స్నానం ఎలా చేశాడో తెలియదు. తామందరూ భోజనాలు ఎలా చేశారో తెలియదు. గృహంలో ఎన్నో గదులు... ఏ గదిలో చూసినా పాములే, ఒక్క గదిలో తప్ప ! ఆ గదిలోనే తామందరూ పడుకోవాలి. కాని ఆ గదిలో మరో 'నరకం' తన కోసం సిద్ధంగా వుంటుంది. గదిలో ఒకే ఒక పూర్వకాలపు మంచం వుంది దాని మీద తను అయిదారేళ్ళ క్రితం కొన్న 'కర్లాన్' పరుపు అవసాన దశలో వుంటుంది. దాని గుడ్డపైనా కిందా, పక్కలలోనూ చిరిగిపోయి, లోపలి నుండి స్పాంజి, పీచు బయటకు వస్తూ వుంటాయి. పరుపు చాలా చోట్ల కన్నాలు పడిపోయింది. ఆ పరుపు మీదే తాను పడుకొని తీరాలి. శాపంలో బహుశా యిది ఒక క్లాజు అయి వుంటుంది.

తను పక్క మీద పడుకున్నాడు. మంచం పక్కనే నేలమీద భార్య, ఆమెకు అవతలి పక్క పిల్లలు పడుకున్నారు. రోజూ ఎదురయ్యే చిత్రమైన అనుభవం తను పూర్తిగా నిద్రలోకి జారుకోకుండా అడ్డుకుంటూ వుంటుంది. అది కలత నిద్ర.... తనకు తెలుస్తూనే వుంది. తను చేతనా చేతనావస్థలో వుంటాడు. పరుపు చాలా మెత్తగా అనిపిస్తూ వుంది. పరుపు లోపల ఏవో బరువుగా కదులుతూ వుంటాయి. అవి కదులుతూ వుంటే తను పైకీ కిందికీ మెల్లగా ఊగుతూ వున్నాడు. పరుపులో కదులుతూ వున్నవి ఏవిటి? పాములు.... పాములు పరుపు లోకి దూరి వున్నాయి. క్వాయిర్‌లోకి పాములు ఎలా దూరుతాయి ? మెదడు తర్కిస్తూ వుంటుంది. కాని తను ఊగుతూనే వున్నాడు. లోపలి ఉన్నవి పాములే. కాళ్ళ మీద పాకుతున్నాయి. కాని కాటు వేయడం జరగదు. కాటు వేయవు కాబట్టి, పూర్తిగా నిద్రలోకి జారుకోవాలంటూ వుంటుంది అలసిన శరీరం. అయినా నిద్ర పట్టీ పట్టనట్లుగా వుంటుంది. పాముల పరుపు మీద పడుకోవడం ఎంత కష్టం ! పాపం ! శేషశయనుడి

పరిస్థితి ఏవిఁటి ?! శేషుడు కదలకుండా వుంటాడా ? మరి విష్ణుభగవానుడు ఎలా నిద్రిస్తున్నట్లు ! శేష తల్పం మీద శయనించడం తప్ప ఆయనకు మరో గత్యంతరం లేదా !... లేదు ! లేదు ! ఆయనకు తను ఎలాగొలా ఒక 'కర్లాన్' పరుపును, తన దాని కంటే మంచిదాన్ని ఇన్‌స్టాల్‌మెంట్లలోనైనా సరే కొనివ్వాలి. కన్నులు తెరవాలని వుంది. కాని అవి తెరచుకోవడం లేదు. అరవాలనుంది నోరు పెగలడం లేదు. పై నుండి ఏదో పడింది, నిశ్శబ్దంగా. 'జర జర' మంటూ వుంది. ఇంటి దూలాల మీద తిరుగుతూ కొండ చిలువ లాంటి పామొకటి కనిపిస్తుందేది అదా !....

"పాం ! పాం!" అంటూ అరుస్తూ మంచం మీద నుండి 'దబ్బు' మని కింద పడ్డాడు నరసింహం.

"బాబోయ్ ! చచ్చాను !" అని అరిచింది ఇల్లాలు నిద్దట్లోంచి మేలుకొని. లేచి లైటు వేసింది. చేతి గాజులు చిట్లిపోయి ఆమె ముంజేయి రక్తాన్ని చిమ్ముతూంది.

నరసింహానికి మెలకువ వచ్చింది. లేచి కూర్చుని కొన్ని క్షణాలు అయోమయంగా చూశాడు. తరువాత, "పరుపులో పాములున్నాయి. పై నుండి కూడా ఒక పాం పడింది." అన్నాడు.

భార్య 'కంయ్' మంటూ అతడి మీదకు లేచింది.



"ఏవీ పాములు? చూపించండి ఏవీ?"

"అది కాదు శాంతా. నాకు నిద్దట్లో అన్నీ పాములే కనబడుతున్నాయి."

"పరుపుకు కన్నాలుంటే లోపలికి పాములు దూరిపోతాయా ? మీకు మతి పోతోందండి. అయినా ఈ పరుపు పాడయిపోయింది, కొత్తది కొనండి అని ఎన్నాళ్ళుగా చెప్తున్నాను !"

"అదీ.... నాకు మళ్ళీ అదే కల వచ్చింది. మనమేదో అడవిలో ఒక పాడయిపోయిన ఇంట్లో వుంటున్నామట. అడివంతా పాములే ! ఇంట్లోనూ పాములే ! నువ్వు, పిల్లలు ఏడుస్తున్నారు...."

ఈ లోగా పిల్లాడు లేచి ఏడుపు లంకించుకున్నాడు.

"ఏడుపుకేం తక్కువ ! యిప్పుడు కూడా ఏడుస్తోనే వున్నాం. దేవుడా ! మీకు నిజంగానే మతిపోతోందండి. ఊరి చివర్న ఇల్లు అద్దెకు తీసుకున్నారు. నేను వొద్దని చెప్తునే వున్నాను. అద్దె తక్కువని నానోరు మూయించారు. మరిక్కడ పాములు తిరుగుతుంటాయి. ఒక పక్క పొలాలు. యిటు వైపన్నీ చెట్లు. అడవిలా వుంటే పాములు తిరక్కేంచేస్తాయి ! అయినా ఏదో ఒక పాము ఇంటి గుమ్మందాకా వచ్చిందని, మీరిలా పిచ్చి కలలు కని ఇల్లంతా పాములు, పరుపంతా పాములు అంటారేవిఁటీ? 'కర్లాన్' కంపెనీ వాళ్ళు పరుపుల యింకా మెత్తగా వుండాలని లోపల పాముల్ని పెట్టి కుట్టేస్తున్నారంటారా, సెల్సు పెంచుకుందుకు ? రోజూ మీ అరుపులకి పిల్లలూ, నేనూ హడిలి ఛస్తున్నాం. రాత్రుళ్ళు అరుస్తున్నారని మీకు కాపలా కాస్తూ, మీ మంచం దగ్గరే కింద పడుకుంటున్నాను. దబ్బుమని కిందపడ్డం నా వొళ్ళు విరగ్గొట్టడం. బాబోయ్ ! మీతో వేగలేకపోతున్నాను. మీకో దండం. నన్ను నిద్రపోనివ్వరు. కంటి నిండా నిద్రపోయి ఎన్నాళ్ళయిందో. ఈ ఇంట్లో వుంటే మీరిలాగే వుంటారు. దిగి రెణ్ణెల్లన్నా కాలేదు. ఏం చెయ్యడం ? పొద్దునే మా ఇంటికి పోయి మా నాన్నకు చెప్పి అర్జంటుగా ఊళ్ళోనే ఏదయినా ఇల్లు వెతకమంటాను. కాదు.... మీరే వెతుక్కోండి. నేను పిల్లల్ని తీసుకుని మా ఇంటికి పోతాను."

ఈ లోగా పిల్ల నిద్ర లేచింది. తల్లి అరుపులు విని,

"అమ్మా ! ఏవిఁటే?" అంది.

"ఏవుందమ్మా ! నా శ్రాద్ధం, నా పిండాకూడూను !

నోర్మూసుకు పడుకో" అని ఇంటి కప్పెగిరిపోయేలా అరిచేసరికి పిల్ల కిక్కురుమనకుండా దుప్పటిలోకి దూరిపోయింది.

శాంతకు శాంతం లేదు. నరసింహంలో సింహం లేదు. పొద్దున్నే ఇల్లాలు పుట్టింటికి పోతుందేమోనని అప్పుడే బెంగ పెట్టుకొని, చిన్న పిల్లాడిలా ముడుచుకు పడుకున్నాడతడు.

• • •

తెల్లవారి కాఫీలు గట్రా అయింతరువాత, మొగుడి చేత శలవు కాగితం రాయించి, కూతురుతో దాన్ని మొగుడి ఆఫీసులోనే పనిచేస్తున్న పక్క వీధిలోని అయ్యన్న పంతులికిచ్చి రమ్మని చెప్పి పంపింది.

ఇంటర్మీడియెట్ దాకా వెలగబెట్టింది కావున ఆలోచించగా, ఆలోచించగా తన మొగుడిది 'సైకియాట్రి ప్రాబ్లెమ్'గా ఆమెకు తోచింది. సైకియాట్రిస్టుకు చూపించాలని రాత్రే నిర్ణయించుకుంది.

ఆ విషయం వినగానే, నరసింహం

"నాకు పిచ్చి పట్టిందనుకుంటున్నావా?" అన్నాడు బిక్కమొహం వేసి.

"అనుమానవెందుకు ? ముదరకుండా చూసుకోవాలిగా." అని పెళుసుగానే జవాబిచ్చిందామె.

అయినా అతడికి సంతోషంగానే వుంది. పెళ్ళాం పుట్టింటికి పోవడం లేదు. వెళ్తేమట్టుకు నెలరోజుల దాకా రాదు !

• • •

సైకియాట్రి హాస్పిటల్‌కు వాళ్ళు వెళ్ళేసరికి, వెయిటింగుహాలు పేషెంట్లతో, వాళ్ళతో కూడా వచ్చిన వాళ్ళతో నిండిపోయి వుంది. ఒక ఖాళీ కుర్చీ కనబడేసరికి నరసింహాన్ని అందులో కూర్చోబెట్టి వివరాలు చెప్పడానికి రిసెప్షను దగ్గరకు వెళ్ళింది శాంత.

తనకేసి కొంతమంది తదేకంగా చూడడం గమనించాడు నరసింహం. అతడికీసారి నిజంగానే అనుమానం కలిగింది, తనకు నిజంగానే పిచ్చిపట్టిందేమోనని. చూపులు తిప్పుకొని గోడలకు వేళ్ళాడుతూ వున్న మందుల కంపెనీల 'యాడ్స్'ను పరిశీలిస్తూ వాటిని తనలో తాను చదవడం ఆరంభించాడు.

'వరల్డ్ అల్జీమర్స్ డే'

'ఫర్‌గెట్టింగ్ థింగ్స్ ఈజ్ నాట్ ఆల్‌వేజ్ ఓల్డేజ్. ఇట్ కెన్ బి డిమెన్షియా.'

'లెట్ ది లైట్స్ బ్రైటెన్ యువర్ లైఫ్ – సిస్టర్ డి'

అతడు నిట్టూర్చాడు. "జీవితంలో ఇక వెలుగెక్కడిది ? అన్నీ పాములే." అని గొణుక్కున్నాడు.

"అవన్నీ చదువుతున్నారా ?" అనడిగింది భార్య రిసెప్షన్ నుండి తిరిగి వచ్చి.

"ఏం, చదివితే ఏమవుతుంది ?"

"పిచ్చి ముదురుతుందేమో !" శాంతంగా సమాధానమిచ్చింది శాంత.

నరసింహం టక్కున నోరు మూశాడు.

ఎవరో ఒకమ్మాయి నరసింహాన్ని చూసి బాహాటంగా 'హ్హి! హ్హి' అని నవ్వింది. వెంట ఉన్నామె, ఆమె తల్లి కాబోలు 'ష్' అంది. అడక్కుండానే చెప్పిందామె నరసింహం భార్యతో, అతని పక్కనే నిలబడి వుండడం చూసి.

"ఇంకా తగ్గలేదు. రెండుసార్లు కరంటు పెట్టారండి. ఇది మూడోసారి."

నరసింహానికి చెమటలు పట్టడం మొదలయ్యింది.

"కరంటు పెట్టిస్తావా?" అన్నాడు భార్యతో ఆందోళనగా.

"ఏ మాత్రం వీలున్నా !" అందామె మృదువుగా.

నరసింహం భార్యను కోపంగా చూడసాగాడు.

కాస్సేపటికి లోపలికి పిలుపు వచ్చింది.



డాక్టరు గారి గదిలో ఎసి వలన చల్లగా వున్నా, నరసింహానికి చెమటలు పట్టడం ఆగలేదు. డాక్టరు మరీ వయసు మళ్ళిన వాడేమీ కాదు. నలభై ఏళ్ళుండవచ్చు. తెల్లగా, ఎత్తుగా, అందంగా వున్నాడు. అంతవరకూ అతడి పక్కనే సిగ్గులు ఒలకబోస్తూ నిలబడి వున్న 'విద్యుల్లత' లాంటి నర్సు, లోపలికి వచ్చిన వీళ్ళను చూసి చటుక్కున సర్దుకుంది.

డాక్టరు కేస్ షీట్ లోని పేషెంటు వివరాలను పరిశీలించాడు. ఆ తరువాత, "చెప్పండి" అన్నాడు శాంతతో, నరసింహాన్ని ఓరగాచూస్తూ.

ఆమె చెప్పిన అన్ని వివరాలను విన్నమీదట,

డాక్టరు, బిపి పరికరంతో నరసింహం రక్తపోటును చూస్తూ, "ఎన్నాళ్ళ నుండి యిలాంటి కలలొస్తున్నాయి?" అనడిగాడు. "ఇరవై అయిదు రోజులుగా." అన్నాడు నరసింహం లోపల లెక్కలేసుకుంటూ

"అడవి. అడవిలో పాములు. బాగుంది" అన్నాడు డాక్టరు నవ్వుతూ. మళ్ళా,

"ఆ అడవిలో పాములు తప్ప మరే జంతువులూ లేవా?'

"లేవండి"

"పాములు మిమ్మల్ని ఎందుకు కరవడం లేదు ?" అనడిగాడు డాక్టరు, లోపల 'ఓ పనైపోయేదిగా! అనుకుంటూ

నరసింహం మాట్లాడలేదు.

"మరి పరుపులో పాములంటారేమిటి ? పాములు క్వాయిర్లోకి ఎలా దూరిపోతాయి ?!

నరసింహం కొన్ని క్షణాలు ఆలోచించాడు.

"దూరలేవండి. కాని నిద్దట్లో నాకు పరుపులో పాములు కదుల్తోన్నట్లు, నేను పైకీ కిందికీ ఊగుతోన్నట్లుగా వుంటోందండి."

"ఏం పరుపది?"

"కర్లానండి."

"పరుపు పాడయిపోయింది కనుక ఈసారి 'సెంచురీ' కొనుక్కోండి" అని నవ్వాడు డాక్టరు, నర్సు కేసి చూస్తూ.

నరసింహం 'హమ్మయ్య' అని లోపల అనుకొని 'ఇక వెళ్దామా' అన్నట్టు చూశాడు భార్య కేసి.

డాక్టరు ప్రిస్క్రిప్షన్ రాయడానికన్నట్లు కొంచెం ముందుకు వంగాడు.

'పరుపు మార్చివేయుము' అని రాస్తాడేమో అనుకుంది శాంత.

"పరుపు మార్చినా పాములున్నాయంటారేమోనండి" అని సందేహం వెలిబుచ్చింది.

"నిజమే ! పరుపు మార్చినా.... పాములాగునా..." రాగయుక్తంగా సాగదీస్తూ నర్సుకేసి చూశాడు డాక్టరు.

"ఊరి చివర్న ఇల్లు తీసుకున్నారు. పొలాలూ, చుట్టూ చెట్లూ... మీ ఇల్లే శిథిల గృహం లాగా, ఆ ప్రాంతం అడవిలాగా కలలో కనబడుతున్నాయన్న మాట. గుమ్మం వరకూ పామొచ్చిందంటున్నారు. పాములు తిరిగే ప్రాంతం. సహజం కదా!" అన్నాడు డాక్టరు.

ప్రిస్క్రిప్షన్‌లో రెండో అయిటము 'ఇల్లు మార్చుము' అని రాస్తాడేమో అనుకుంది శాంత.

"రాత్రులు సరిగ్గా నిద్రపోతారా ?" అడిగాడు డాక్టరు ఆమెను. "సరిగ్గా నిద్రపోరండి. పక్కమీద అస్తమానూ అటు యిటూ మెదుల్తోనే వుంటారండి. ఇప్పుడు, కొత్తగా దిగిన అద్దింట్లోనైతే నిద్దట్లో 'పాములు పాములు' అంటూ అరుపులూ, కేకలూనండి."

"ప్రతి చిన్న విషయం గురించీ తీవ్రంగా ఆలోచిస్తూ బాగా యాంగ్జైటీ ఫీలవుతున్నారా?" ఈ సారి నరసింహాన్ని ప్రశ్నించాడు.

"పాములు...." అని ఆగి నిస్పృహగా తల కిందికి వాల్చాడు నరసింహం.

డాక్టరు నర్సుకేసి చూసి నవ్వాడు. నర్సు ముసి ముసిగా నవ్వింది.

'పాముల వాణ్ణి పిలిపించమనండి' సలహా యిస్తుందేమో అనుకుంది శాంత.

"పాములు కల్లోకి రాకుండా నేను మందిస్తానుగా" అన్నాడు డాక్టరు పైకి, లోపల 'డిప్రెషన్' అని గొణుక్కుంటూ.

ప్రిస్క్రిప్షన్ రాసి, శాంతకిచ్చి,

"పై వాటిని రోజూ టిఫిను తరువాత ఒకటి, కింది వాటిని

# జనవరి నెల పురస్కారాలు





## మాయల మరాఠీ

కథకు........రూ.700/-

రచయిత : డా. ఎం. హరికిషన్

## నల్లబల్ల

కవితకు.......రూ.500/-

రచయిత : సుప్పని సత్యనారాయణ

**సినీ రచయిత జనార్దన మహర్షి అందిస్తున్న పురస్కార చెక్కులు ఈ రచయితలకు అందుతాయి.**

మీరు చదివిన కవితలు, కథలలో నచ్చినవి కారణాలతో సూచించవచ్చు. ఒక రచయిత ఈ ఎంపిక నుంచి తనను మినహాయించాలని కోరాడు. అలాంటి అభిప్రాయాలున్న రచయితలు కూడా మాకు రాయవచ్చు.

- ఎడిటర్

---

రాత్రి భోజనం తరువాత ఒకటి వేయండి. వారం తరువాత రండి." అని ముగించాడు డాక్టరు.

• • •

**ఒ**క వారం తరువాత నరసింహాన్ని హాస్పిటల్‌కు తీసుకు వెళ్ళింది అతడి భార్య.

లోపల నర్సుతో మాట్లాడుతూ వున్న డాక్టరు, వీళ్ళను, చూసి కులాసాగా నవ్వాడు. కేస్ షీట్‌లోని వివరాలను ఒకసారి పరిశీలించి,

"ఎలా వుంది ?" అడిగాడు శాంతను.

"బాగానే వుందండి"

"నిద్ర బాగా పడుతూందా? కొత్త పరుపు కొన్నారా?" నవ్వుతూ అడిగాడు డాక్టరు నరసింహాన్ని.



"కొత్త పరుపు యింకా కొనలేదండి. కాని నిద్ర పడుతోందండి." వెలిగిపోతూన్న ముఖంతో అన్నాడు నరసింహం, కరెంటు పెట్టించుకునే అవసరం ఇక రాదులే అని లోలోపల సంబరపడుతూ.

"మరి పాములు కల్లోకి వస్తున్నాయా"

"అస్సలావడం లేదండి."

"గుడ్ ! నేను మందిస్తే అంతే మరి !" అన్నాడు డాక్టరు హుషారుగా, నర్సుకేసి చిలిపిగా చూస్తూ.

శాంత మెల్లగా ఏమో నసిగింది.

డాక్టరు, "ఏవిటి ? చెప్పండి." అన్నాడు.

"అంటేనండీ..... మీరిచ్చిన మందుల్ని పూర్తిగా వాడలేదండి. పొద్దున్న టిఫిను తర్వాత వెయ్యాల్సిన టాబ్లెట్లల్లో ఒక్కటి వేసిన కాస్సేపటికి ఆయన కళ్ళు తిరిగి పడిపోయారండి. దాంతో మిగిలిన వాటిని వెయ్యకుండా ఆపేశానండి..." ఆమె ఆగింది.

"అదేవింటి ! వెంటనే వచ్చి చెప్పకుండా యిన్ని రోజులూ ఏం చేశారు ? మరి రాత్రి వేయాల్సినవి ?"

"వాటిని కూడా వెయ్యలేదండి"

డాక్టరు సీరియస్‌గా ముఖం పెట్టి,

"మరెలా తగ్గింది ?" అన్నాడు.

"ఆయన గదిని బూజులు దులిపి శుభ్రం చేశానండి. ఆయన మంచాన్ని కూడా శుభ్రం చేశానండి. పరుపు కింద ప్లైవుడ్ బోర్డు అడుగున పెద్దవీ, చిన్నవీ బోలెడు బల్లులు తిరుగుతున్నాయండి. రాత్రుళ్ళు దోమల్నీ, పురుగుల్నీ తినడానికి కామోసండి. వాటన్నింటినీ తరిమేసి మంచం పట్టెల గాడుల్లో చీమల మందు చల్లానండి...." అని భయం భయంగా డాక్టరు కేసి చూసిందామె.

"బల్లులు గోడల మీద కదా పాకుతాయి ?"

"గోడల మీదా పాకుతున్నాయండి. మంచం అడుగున కూడా పాకుతున్నాయండి. ఇంట్లో బల్లులూ, బొద్దింకలూ ఎక్కువగా ఉన్నాయండి. పగలైతే బల్లులు మంచం మీదికే వస్తున్నాయండి ఈగల్ని తినడానికి."

"అంటే, పరుపు కింద ప్లైవుడ్ బోర్డు అడుగున బల్లులు పాకుతూ వుంటే పరుపులో పాములు మెదుల్తూన్నట్లు, ఇల్లంతా పాములు తిరుగుతూన్నట్లు వుందా !"

"మరి ఆయనకు అలాగే ఉందండి. మంచం శుభ్రం చేసిన రోజు రాత్రి ఆయన హాయిగా నిద్రపోయారండి. అరుపులూ, కేకలూ లేవండి."

నర్సు కిసుక్కుమంది. డాక్టరు నోరు వెళ్ళబెట్టాడు.



# గురజాడ వ్యక్తిత్వం - సాహిత్యం



**విజయనగర రాజా ఆనందగజపతిరాజు కొలువులో అప్పారావు గారు మాక్స్‌ముల్లర్ రుగ్వేద ప్రచురణకి, లఘుకౌముది ప్రచురణకి అర్థిక సహకారం రాజావారి నుంచి అందేలా చూశారు. కానీ తాము వందరూపాయల జీతంతో వున్నప్పడే 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రచురించాల్సి వచ్చినప్పడు ఎలాగోలా తామే ప్రచురించుకొన్నారు కానీ రాజావారిని ఎటువంటి ఆర్థిక సహాయం అడగలేదు. అందుకు కారణం ఆ నాటకాన్ని రాజావారికి అంకితమిస్తుండటమే.**

**డా॥ వేదగిరి రాంబాబు**

9391343916

బహుశా తల్లికడుపులో వున్నప్పుడే గురజాడకి, తాను జన్మించి ఎన్నో పనులు చేయాలని అనిపించిందేమోనన్నట్టు గురజాడ ఏడవ నెలలోనే జన్మించారు. అందుకే ఆయన ఆరోగ్యం చిన్నప్పటి నుంచే అంతంతమాత్రంగా ఉండేది. సాధారణంగా అనారోగ్యాలతో బాధపడేవాళ్ళకి మనస్సూ, అనారోగ్యంగా ఉంటుంది. కానీ గురజాడ చిన్నప్పటి నుంచి ఎంతో మనోధైర్యంతో వుండేవారు. ఎంతో తెలివిగా ఉండేవారు.

చిన్నప్పుడు పాఠశాలకి సెలవులిచ్చినప్పుడు ఆయన ఎస్. రాయవరంలోని మాతామహుల ఇంటికి వెళ్ళేవారు. ఇంటిపక్కనే మున్సిఫ్ మ్యాజిస్ట్రేట్ కోర్టు ఉండేది. అక్కడ పిల్లలందరూ కలిసి ఆడుకుంటుండేవాళ్ళు.

ఆరోజు ఆదివారం – పిల్లలు ఆడుకుంటూ ఒక్కొక్కళ్ళు తాము భవిష్యత్తులో ఏమి కావాలనుకుంటున్నారో చెప్పసాగారు. ఒకళ్ళు జడ్జ్ అవ్వాలనుకుంటే, మరొకళ్ళు లెక్చరర్ అవ్వాలని... ఇలా తలకోవిధంగా చెప్పసాగారు. గురజాడ వేంకట అప్పారావు మాత్రం తాను ఏమికావాలనుకుంటున్నాడో చెప్పలేదు. పిల్లలందరూ బ్రతిమాలారు, బామాలారు. అయినా తను నోరు విప్పలేదు.

అందరూ వెళ్ళిపోయాక అతనొక చాక్‌పీస్‌ను తీసుకొని, మూసివున్న తలుపుల మీద జీ.వి. అప్పారావు బి.ఎ, బి.ఎల్. అని రాసి, ఇంటికి పారిపోయాడు.

మర్నాడు కోర్టుకు వచ్చిన మున్సిఫ్ మ్యాజిస్ట్రేట్, తలుపుల మీద ఆ రాతల్ని చూసి "ఎవరిదీ పేరు" అని అడిగాడు. ఎవ్వరు నోరు విప్పలేదు.

"గొడవర్తి వేంకట క్రిష్ణయ్యగారి మనవడు అలా రాశాడు అని తరువాత తెలిసింది. వెంటనే అతన్ని పిలిపించమన్నారు. వేంకటకృష్ణయ్య గారు భయపడిపోయి 'తన మనవడు తప్పుచేశాడు క్షమించమ'ని కోరాడు. అయినా మ్యాజిస్ట్రేట్ అబాలున్ని రప్పించమన్నాడు.

అప్పారావు రాగానే "నువ్వేనా ఇలా రాసింది?" అని అడిగారు మ్యాజిస్ట్రేట్

"అవును నేనే" నిర్భయంగా జవాబిచ్చాడు అప్పారావు

ముచ్చటేసింది మున్సిఫ్ మ్యాజిస్ట్రేట్‌కు. "గోడమీద రాయక తలుపుల మీద ఎందుకు రాశావు" అని అడిగారు అప్పారావుని.

"సున్నం వేసిన గోడమీద తెల్లచాక్‌పీస్‌తో రాస్తే ఏమి కనిపిస్తుంది? అందుకని తలుపుల మీద రాశాను" అన్నాడు అప్పారావు.

అతడి నిర్భీతికి, నిజాయితీకి మెచ్చుకున్న మున్సిఫ్ మ్యాజిస్ట్రేట్ "నువ్వు మాజిస్ట్రేట్‌వే కాదు జిల్లా జడ్జ్‌వి అవుతావు" అని ఆశీర్వదించారు.

ఆ తరువాత 'లా' చదవాలని ఎంత కోరిక వున్నా అప్పారావు తమ్ముడి చదువు కోసం తన చదువును మధ్యలో ఆపేయాల్సి వచ్చింది. 'లా' మీద అతనికి వున్న ప్రేమతోనే విజయనగర సంస్థానంలో పెద్ద దావా జరుగుతున్న కాలంలో కలకత్తా, చెన్నై, విశాఖపట్నం లాంటి ప్రాంతాల్లో సీనియర్ న్యాయవాదులతో ముచ్చటించి దావాకు సంబంధించిన విశేషాల్ని సరిగ్గా సేకరించి, ఆఖరికి విజయనగర రాజవంశానికి సంబంధించిన వాళ్ళే దావా గెలిచేటట్లు చేసింది.

విజయనగర రాజా ఆనందగజపతిరాజు కొలువులో అప్పారావు గారు మాక్స్‌ముల్లర్ రుగ్వేద ప్రచురణకి, లఘుకౌముది ప్రచురణకి అర్థిక సహకారం రాజావారి నుంచి అందేలా చూశారు. కానీ తాము వందరూపాయల జీతంతో వున్నప్పుడే 'కన్యాశుల్కం' నాటకాన్ని ప్రచురించాల్సి వచ్చినప్పుడు ఎలాగోలా తామే ప్రచురించుకొన్నారు కానీ రాజావారిని ఎటువంటి ఆర్థిక సహాయం అడగలేదు. అందుకు

కారణం ఆ నాటకాన్ని రాజావారికి అంకితమిస్తుండటమే. ఆ రోజుల్లో అయితే చాలామంది అంకితం ఇస్తున్న వాళ్ళదగ్గరి నుంచే గ్రంథ ప్రచురణకు కావాల్సిన పూర్తి ఆర్థిక సాయాన్ని పొందుతున్నారు !

పరిచయమైన నాటి నుంచి ఆనందగజపతి మహారాజావారు గొప్ప సహకారాన్ని అందించడంతో కృతజ్ఞతాభావంతోనే అప్పారావుగారు ఆ తరువాత కూడా ఆ కుటుంబంలోని వ్యక్తులకే అండగా నిలిచారు. ఈ కృతజ్ఞతాభావమే కానీ ఎవ్వరికీ దాస్యం కాదు.

అప్పారావుగారు రాసిన కన్యాశుల్కం నాటకం బహుళజనాదరణ పొందడంతో రెచ్చిపోయిన గ్రాంధికవాదులు "ఇది సాంఘిక నాటకం కాబట్టి మాట్లాడుకునే భాషలో రాయగలిగావు. కానీ ఇది ఏ చారిత్రక నాటకమో అయితే మాట్లాడుకునే భాషతో రాయగలవా?" అనే సవాలుని విసిరారు. దానికి జవాబుగా అప్పారావుగారు 'బిల్హణీయం' అనే నాటకాన్ని మాట్లాడుకునే భాషలో రాశారు.

"చందోబద్ధమైన కవిత్వం రాయలేకే నువ్వు ఇలాంటి రచనలు చేస్తున్నావు" అని గ్రాంధికవాదులు విసిరిన మరో సవాలుకి జవాబుగా అప్పారావుగారు! సుభద్ర, అనే కావ్యాన్ని, సత్యవ్రతశతకాన్ని రాసి చూపించారు. "ఇలాంటి సాహిత్యాన్నెంతటినో సృష్టిటించగలను కాని అందరికీ అర్థమయ్యే విధంగా ఏది రాసినా బాగుంటుంది కొందరికోసమే సాహిత్యం కాదు" అని వాళ్ళకి జవాబిచ్చాడు.

జి.వి. అప్పారావు అంటే గ్రామ్యవాది అప్పారావు అని ఎగతాళి చేసినా తనతో పాటు తనకు సహకరిస్తున్న గిడుగు, ఏట్స్, శ్రీనివాస్ అయ్యంగార్లను దుష్టచతుష్టయం అన్నా ఉడుక్కోక మాట్లాడుకునే భాషలోనే రచనలు చేయాలి అనే తమ దృక్పధాన్ని రచనల ద్వారానే తెలియజేశారు అప్పారావుగారు.

అటు కన్యాశుల్కంలో తెలుగులో మాట్లాడటం కన్నా ఆంగ్లభాషలో మాట్లాడటం మిన్న అనుకునే వాళ్లని ఎద్దేవ చేస్తూ గిరీశం పాత్రను ప్రవేశపెట్టినట్లు, గ్రాంధిక వాదుల్ని ఎద్దేవ చేస్తూ సంస్కృతాన్ని ఎక్కువగా వాడే పండితుల్ని ఎగతాళి చేశారు అప్పారావుగారు తమ 'కొండుభట్టీయం' నాటకంలో.

పెద్ద దావా జరుగుతున్నప్పుడు రాజావారి కుటుంబానికి వ్యతిరేకంగా పనిచేస్తున్న జ్ఞాతులు ఒకరోజు ఆయనకు నలభైవేలు తెచ్చిచ్చారు లంచంగా, రాజా కుటుంబం తరపున అండగా నిలవొద్దు అని. అప్పారావుగారు అక్షరాలలో అయితే గట్టిగా చెప్పగలను కానీ వ్యక్తిగతంగా సున్నిత మనస్కులు కావడంతో "గుప్పెడు మెతుకులు అరిగించుకోలేని నేను ఈ నలభైవేలని ఎలా అరిగించుకోగలను' అంటూ సున్నితంగానే ఆ లంచాన్ని తిరస్కరించారు. అప్పట్లో ఆయన జీతం కేవలం వంద రూపాయలు మాత్రమే! అయినా నలభైవేలని ఆయన పట్టించుకోలేదు.

**"చందోబద్ధమైన కవిత్వం రాయలేకే నువ్వు ఇలాంటి రచనలు చేస్తున్నావు" అని గ్రాంధికవాదులు విసిరిన మరో సవాలుకి జవాబుగా అప్పారావుగారు! సుభద్ర, అనే కావ్యాన్ని, సత్యవ్రతశతకాన్ని రాసి చూపించారు.**

అప్పారావుగారికి ప్రకృతిపట్ల కూడా విపరీతమైన ఆకర్షణ ఉండేది. అందుకని రాణిగారితో పాటు నీలగిరి వెళ్ళినప్పుడు నీలగిరి పాటల్ని ఆ ప్రకృతిని చూసి పరవశిస్తూ రాశారు.సంగీతంతో కూడా ఆయనకి పరిచయం ఉండటంతో ఆ పాటలకి బాణీలు కట్టి రాణిగారికి వినిపించేవారు. ఆ పాటలకి ఆనందించిన రాణీగారు నీలగిరి పాటలన్ని పుస్తకంగా ముద్రించారు కూడా !

1897లో కన్యాశుల్కం మొదటి ముద్రణప్రతులు తక్కువ కాలంలోనే పూర్తిగా అమ్ముడైపోయాయి. ఆ తరువాత దాన్ని అంకితం అందుకున్న ఆనందగజపతి రాజా మరణించడం, పెద్దదావా లాంటి విషయాలతో అప్పారావు గారు కన్యాశుల్కం వైపు దృష్టి సారించలేదు. రాణి అలకానందాదేవి పెంపుడు కుమారుడి కోరిక మీద కొన్ని మార్పులతో తిరిగి ముద్రించాలనుకున్నాడు. కానీ కొద్దిపాటి మార్పులు చేయదల్చుకున్న ఆయనకి నాటకాన్ని పూర్తిగా తిరిగి రాయాలనిపించింది దాంతో నాటకాన్ని తిరిగి రాసి ద్వితీయ కూర్పుని 1909లో ప్రచురించారు. అక్కడి నుంచి ఆయన దృష్టి మాట్లాడే భాషలో గ్రంథ రచనకి ఓ ఉద్యమ స్ఫూర్తినివ్వాలనే విషయం వైపు మళ్ళింది. అందుకే కేవలం 1910 సంవత్సరంలోనే ఆయన మాట్లాడుకునే భాషలో కథ, కవిత్వం, దేశభక్తి గేయం లాంటివి రాశారు.

"ఉపన్యాసాలు చర్చలతో కాకుండా కేవలం మాట్లాడుకునే భాషలో గ్రంథరచన చేయడంతోనే భాషలో మార్పు వస్తుంది" అన్నది ఆయన దృఢ నమ్మకం అందుకే ఆ దారిలోనే కొనసాగారు.

అప్పారావుగారు ఆనందగజపతి మహారాజావారితో పాటు వెలుగోడు ప్రాంతానికి గుర్రం మీద వెళ్ళినప్పుడు జారి పడటంతో స్వరపేటికకి దెబ్బతగిలి బిగ్గరగా మాట్లాడటం సమస్య అయింది. అప్పటి నుంచే ఆయన లెక్చరర్ ఉద్యోగాన్ని విరమించుకొని రాజావారి కొలువులో ఎపిగ్రఫిస్ట్‌గా చేరారు. అందుకనే కన్యాశుల్కం నాటకం మీద జి.వి. అప్పారావు ఎపిగ్రఫిస్ట్ అని ప్రచురించుకున్నారు. ఆ తరువాత ఆంతరంగిక కార్యదర్శి అయ్యారు. అందుకని ఆయన భాషను మార్చటానికి గ్రంథరచనని ఆయుధంగా స్వీకరించారు. గ్రాంధిక వాదుల్ని ఎదుర్కోవాలన్నా, వాళ్ళకి కొన్ని విషయాల్లో స్పష్టతనివ్వాలన్నా గిడిగు రామ్మూర్తి పంతులుగారు ఉద్యమించేవారు. రచనలతో అప్పారావుగారు, ఉపన్యాసాలతో, చర్చల్లో ధీటైన జవాబిస్తూ గిడుగురామ్మూర్తి పంతులు వ్యావహారిక భాషోద్యమానికి పూనుకున్నారు.

అప్పారావుగార్ని, గవర్నర్ మద్రాసు విశ్వవిద్యాలయ సెనేట్ సభ్యులుగా నియమించినప్పటి నుంచి ఆయన బోధనాభాషని సంస్కరించటానికి పూనుకున్నారు. అక్కడా ఆయనకి గ్రాంధిక వాదుల పోరు తప్పలేదు. చనిపోయే ముందు వాళ్ళకి ధీటైన జవాబిస్తూ 'మినిట్

## లోనా ! బయట ! జాతరే !

కొండ్రెడ్డి వెంకటేశ్వరరెడ్డి
9948774243



రాత్రంతా ఒకటే వాన
లోన !
బయట !
వాసుకిలా
హృదిని చుట్టినవో కన్నీటి కడలి !
ప్రాణాధారపు ఆశలతో
మేధో మథనం మొదలెట్టినా...
ఏమిటో ! ఈ రాక్షస శ్రమలో
ఆకలి తీర్చే అమృతం కంటే
ఆత్మ విశ్వాసాన్ని హరించే
హాలాహలమే పుడుతూంది !
చుట్టూజనం
ఎవరూ ఎవరికీ అర్థం కారు !
తడిలేని ఓదార్పులు
అప్పుడప్పుడూ తట్టి పలుకరిస్తూ...
సమాజానికి రోగాన్నిచ్చే త్యాగాలు, భోగాలు
పరస్పరాను రాగాలు –
చలువరాతి మేడల్లోని విలాసాలు
పాదయాత్రలై పావులు కదుపుతూ
తీయ తీయని పలుకులై
జనం కోసం వాదాలై, వివాదాలై
ఆశాజనక నినాదాలై
మందు టెండల్లో వాడడం చూసి
ఆకాశం కన్నీరు మున్నీరవుతూంది !

తెర చాపా చిరిగింది
తెడ్డూ విరిగింది
ఈ తెప్పదరి జేర్చుతుందంటారా !
మొక్కుబడి నడకలతో
రేపు నడినెత్తిన పెట్టబోయే పాదాన్ని
జనం గుర్తించరంటారా!
అనంత గమ్యం !
ఒడ్డూ కనపడదు !
కేకా వినపడదు !
తోడుగా తెచ్చుకున్న
పదాల గువ్వలకు ఊహల రెక్కలు తొడిగి
ఎగరేసినంత మాత్రాన
అస్తవ్యస్తమైన ఈ వ్యవస్థ ఘోషలో
నాటకీయంగా
వ్యక్తీకరించబడే నినాదాలు
జనం హృదిలో ఊరడి, ఊడలెత్తిస్తాయంటారా !
అందరిలో ఆవిర్భవిస్తూన్న
ఏవేవో సవ్వడులు
నేరారోపణలను వింటూ... కంటూ...
చేతగాని పాలనా చరమ గీతాన్ని పాడేందుకు
అంతః సూత్రాలను పసిగట్టే
అంతరాత్మను తట్టిలేపుతూ
రాత్రింబవళ్లు ఒకటే జాతర
లోన ! బయట !

---

ఆఫ్ డిసెంట్'.... అసమ్మతి పత్రాన్ని తీవ్ర అనారోగ్యంతో బాధపడుతూ కూడా పూర్తిచేసి, సమర్పించారు. ఆ రోజుల్లో ఆయనకి ఉన్న ఆస్థమా, అజీర్ణం లాంటి అనారోగ్యాలతో పాటు రోగనిరోధక శక్తి తగ్గి, రక్తవిరోచనాలు ప్రారంభమై బాధపడుతున్నారు. తమ అసమ్మతిని సబ్‌కమిటీకి తెలపటానికి ఎక్కువ సమయం లేదు. దాంతో అతికష్టం మీద రాయటం ప్రారంభిస్తే చిన్నా పెద్దా అక్షరాలు రాసాగాయి. అయినా అతి ప్రయత్నంతో వాటిని రాస్తూ, ఆకాగితాల్ని అలాగే కిందకు వదిలేస్తుంటే కింద కూర్చున్న గిడుగు వాటిని సేకరించి సాపు ప్రతి రాసి సకాలంలో విశ్వవిద్యాలయానికి సమర్పించారు. వ్యావహారిక భాషలో విద్యాబోధనకి ప్రథమ ప్రధానబీజం.

"విశ్రాంతి అనేది నా జీవితంలో కల్ల. ఒక వేళ ఏ పనీ చేయజాలని స్థితి వస్తే ఇంత కాన్న మరణం మేలు" అంటూ కృషి చేసిన అప్పారావుగారు "నాది ప్రజల ఉద్యమం దానిని ఒకరిని సంతోషపెట్టడానికి వదులుకోను" అంటూ చిత్తశుద్ధితో చివరి వరకు మాట్లాడుకునే తెలుగు భాషకే పట్టం కట్టడానికే అంకితమైపోయారు. అక్షరం ఎంతటి క్షయం లేనిదో అప్పారావుగారి కృషి అంతటి శాశ్వతమైనదే. ఆయనని తెలుగువారు ఏ నాటికి మరచిపోలేరు. తెలుగు భాష వున్నంతకాలం ఆయనని స్మరించుకుంటూనే ఉంటారు.

"అప్పారావుగారు మరణించిన తరువాత మన మనస్సుల్లో జీవించటం ప్రారంభించారు" అన్న దేవులపల్లి కృష్ణశాస్త్రిగారి మాటలు అక్షర సత్యాలు. కాకపోతే బతికున్నప్పుడు గ్రాంధిక వాదులురకరకాలుగా ఆయన్ని పొడుచుకుతింటే మరణించిన తరువాత కొందరు కన్యాశుల్కం ఆయన రాయలేదని, ఆధునిక యుగకర్త అప్పారావుగారే అయినా ఆయన మొదటి ఆధునికా కథారచయిత ఆయన కాదని.... ఇలా రకరకాల వింత వింత చర్చల్ని ప్రజల్లోకి తీసుకురావటానికి ప్రయత్నిస్తూ పొడుచుకు తినటానికి ప్రయత్నించడం హేయం.



## నివ్వెరపోయిన నిజాలు

కెంగార మోహన్
9493375447



రాయాలని సంసిద్ధుడవుతున్న కొద్దీ
దుఃఖం గుండె వాకిట్లో
కల్లాపిజల్లి ముగ్గేస్తుంది.
రాస్తున్నదంతా, రాసినదంతా
ఎందుకో ఏమిటో
ఇప్పుడిప్పుడే అర్థమవుతుంది.
నివ్వెరపోయిన నిజాల్ని
చరిత్రపుటల్లోంచి త్రవ్వికాదు.
వర్తమాన ప్రపంచంలోంచే
పురావస్తు శాస్త్ర నిపుణుడిలా
వెల్లడిస్తున్నా.
చిత్రమైన సమాజానికి
సప్తవర్ణాలతో మెరుగులు దిద్దుతున్నా.
మనస్సనే అమ్మల పొదిలోంచి
దృక్పథాల కుంచెలు తీసి
బొమ్మలు గీస్తున్న కొద్దీ
అతివల ఆర్తనాదాలు కర్ణభేరిని
చిద్రం చేస్తున్నాయి.
ఇప్పుడు మిగిలిన ఆ కొన్ని
సంగతులే మాట్లాడాలనిపిస్తోంది.

ఆక్రోశిస్తున్న గొంతుకతోనో
జలపాతంలో పరుగుతీస్తున్న
నేత్రధారల్లోంచి వీక్షిస్తూ కాదు.
ఎంతమూగబోయింది.
ఎంతఘోర ఆకృత్యం చూసింది
ఎందుకిలా మారిపోయింది.
దారుణానికి దుర్మార్గమే
సాక్ష్యంగా నిలుస్తుందేమిటి?

మది మాట్లాడొచ్చు.
భావాలు పంచుకోవచ్చు.
అనుభూతులూ నెమరు వేసుకోవచ్చు.
అదంతా లేదిక్కడ,
మృత్యువుతో పోరాడుతూ
ఏడ్వడం తప్ప.
తనువుతో మృగం చేసిన
వికృత విన్యాసం
వనిత భవితకు మరణశాసనమైంది.
పోయిందేదైనా తిరిగి రావచ్చు.
అర్జించనూవచ్చు.
మనిషి నుండి దూరమైంది,
నిర్దాక్షిణ్యంగా మానప్రాణం.
పంజా విసిరే ముందు
పులైనా హెచ్చరిస్తుందేమో !
అవన్నిక్కడ నిషిద్ధాలు.
ఇంకెన్నాళ్ళీ బతుకు సమరం
ఆటవిక మానవ మృగాలు లేని
సమాజాన్నెలా చిత్రించి
మాట్లాడి రాయాలి ?

## "ఎఫ్.డి.ఐ"లు...

చైతన్య ప్రసాద్
9849651451

'ఫారిన్ డైరెక్ట్ ఇన్వెస్ట్‌మెంట్స్'కు
మన దేశం తలుపులు బార్లా తెరిచారు !
చిల్లర వర్తకం, బీమా, పెన్షన్
పౌర విమానయానం, ప్రసార రంగం...
ఏదడిగినా – రెడీ ! 'కాదేదీ కవిత కనర్హం' – అన్నట్టు
శాస్త్ర – సాంకేతిక, రక్షణ రంగాల్లో
పాలకుల కుళ్ళిన మెదళ్ళలో...
తల్లి గర్భంలో, చెల్లి శీలహరణంలో – అన్నింటా
నలభై తొమ్మిది – కాదు – తొంభై నాలుగు శాతం – ఎఫ్.డి.ఐ.లే !!
లంచం ఎరవేస్తే – అమ్మనీ, ఆలినీ అమ్మేసే
'నయా హరిశ్చంద్రు'లున్న ఈ స్వతంత్ర భారతంలో...
మానవ జాతినే వ్యాపారీకరించే ఈ పెట్టుబడిదారీ ప్రపంచంలో...
ఎఫ్.డి.ఐ. లేం ఖర్మ? – అన్నీ 'ఐ.హెచ్.ఐ' లే –
అదే – 'ఇండియన్ హ్యూమన్ ఇన్వెస్ట్‌మెంట్ 'లే !



# శాస్త్రీయ పద్ధతిలో జాషువా విశ్లేషణ
## ఎండ్లూరి అధ్యయనం



రాచపాళెం చంద్రశేఖర రెడ్డి
9440222117

**గుర్రం జాషువ కవిత్వం మీద ఇప్పటికే ఎందరో పరిశోధనలు చేశారు. విమర్శలు రాశారు. దళిత సాహిత్యోద్యమం మొదలైన తర్వాత జాషువ అధ్యయనం మరింత వేగవంతమూ, తీవ్రతరమూ అయ్యింది. ఈ వరుసలో ఆచార్య ఎండ్లూరి సుధాకర్ "జాషువ మీద చక్కని పరిశోధనలు చేశారు. 'నాకథ' మీద ఎం.ఫిల్ చేసి, జాషువా సాహిత్యం దృక్పథం పరిణామం" అనే అంశం మీద పి.హెచ్.డి చేశారు. ఈ గ్రంథం జాషువ మీద జరిగిన పూర్వ పరిశోధనల కన్నా శాస్త్రీయమైన పద్ధతిలో జాషువ సాహిత్యాన్ని విశ్లేషించింది.**

ఆధునిక తెలుగు కవులలో గుర్రం జాషువాది. విశిష్టమైన స్థానం. ఆయన గొప్ప దేశ భక్తుడైన కవి. ఇరవయ్యవ శతాబ్దం మొదటి ఏడు దశకాలలో ఆయన సాహిత్యం పరుచుకుంది. జాషువాది అనుభవసాహిత్యం. దేశారాధన సాహిత్యం. తనను అవమానించిన సంఘం తీరుమీద కోపమే గాని, సంఘం మీద ద్వేషం లేదు. అభివృద్ధి కన్నా ఆవేదనకు ప్రాముఖ్యమిచ్చిన కవి. భావ కవిత్వ కాలం నుండి విప్లవ సాహిత్యారంభ కాలందాకా తనదైన మార్గంలో సమకాలీన సామాజిక రుగ్మతల్ని ఎండగట్టిన ప్రతిఘటన కవి జాషువ. విశ్వనరుడనని ధైర్యంగా చాటుకొని ఆ భావనకు అడ్డంకులుగా నిలిచిన సకల అంశాలను చీల్చి చెండాడిన కవిజాషువ. భారతదేశమన్నా, దేశ చరిత్ర సంస్కృతులన్నా అపారమైన గౌరవం గల కవి. ప్రగతిశీల కవులు వచన కవితలో కోరుకున్న దానిని జాషువపద్యంలో కోరుకున్నారు. పద్యాన్ని తన సామాజిక విమర్శకో ఆయుధంగా చేసుకున్న విశిష్టకవి జాషువ.

గుర్రం జాషువ కవిత్వం మీద ఇప్పటికే ఎందరో పరిశోధనలు చేశారు. విమర్శలు రాశారు. దళిత సాహిత్యోద్యమం మొదలైన తర్వాత జాషువ అధ్యయనం మరింత వేగవంతమూ, తీవ్రతరమూ అయ్యింది. ఈ వరుసలో ఆచార్య ఎండ్లూరి సుధాకర్ "జాషువ మీద చక్కని పరిశోధనలు చేశారు. 'నాకథ' మీద ఎం.ఫిల్ చేసి, జాషువా సాహిత్యం దృక్పథం పరిణామం" అనే అంశం మీద పి. హెచ్.డి చేశారు. ఈ గ్రంథం జాషువ మీద జరిగిన పూర్వ పరిశోధనల కన్నా శాస్త్రీయమైన పద్ధతిలో జాషువ సాహిత్యాన్ని విశ్లేషించింది.

జాషువ సాహిత్యాన్నేగాక, జాషువ సాహిత్యం మీద ఇప్పటికే వచ్చిన విమర్శలను, జరిగిన పరిశోధనలను క్షుణ్ణంగా అధ్యయనం చేసి సరికొత్త మెథడాలజీతో జాషువ సాహిత్యాన్ని విశ్లేషించారు ఎండ్లూరి. జాషువ జీవితాన్ని ఆయన సాహిత్యాన్ని పరిచయం చేయడం కాకుండా, ఆయన సాహిత్యంలో పది రకాల దృక్పథాలను గుర్తించి వివరించడం ఎండ్లూరి మాత్రమే చేయగలిగారు. జాషువ సాహిత్యంలో ఆయనకు గల మతం, హేతువాద కుల, గాంధీయ, దళిత, మానవతావాద, సామాజిక రాజకీయ, ఆర్థిక, జీవిత దృక్పథాలు ఎలాంటివో ఎండ్లూరి సరళమూ, సుందరమూ అయిన భాషలో వివరించారు.

ఎండ్లూరి పరిశోధకుడుగా జాషువ సాహిత్యాన్ని అధ్యయనం చేసి కొన్ని ప్రతిపాదనలు చేశారు. అవి ఇవి.

1. భావ కవిత్వ యుగంలో జాషువ భావ కవుల కన్నాభిన్నంగా నిలబడ్డారు. భావ కవిత్వం ద్వారా పుట్టుకొచ్చిన ఖండకావ్య ప్రక్రియను స్వీకరించిన జాషువ అగ్రకుల భావ కవులలాగా సలీలిజాన్ని విస్మరించి ఊహలలో విహరించకుండా సామాజిక కవిత్వాన్నే రాశారని ఎండ్లూరి ఎత్తి చూపారు. "ఎవతె. కోసమో కుమిలి ఏడ్చెదు" అని జాషువ అన్నది కృష్ణశాస్త్రినే అని, అందుకే కృష్ణశాస్త్రి పాత్ర ఉన్న 'వైతాళికుడు'లో జాషువ కవితకు స్థానం దక్కలేదని ఎండ్లూరి అభిప్రాయపడ్డారు. భావ కవులలో లేని వస్తు వైవిధ్యాన్ని జాషువ ప్రదర్శించారని పేర్కొన్నారు. "భావ కవిత్వపు కాలంలో వున్న జాషువా మాత్రం ఆ ఉద్యమ ప్రభావానికి లోను గాక తనదైన పద్ధతిలో కవిత్వం రాశాడు" (పు. 140) అంతేగాక కవిగా జాషువది సొంత మార్గమని

నిర్వచించారు. అయితే "జాషువా భావ కవిత్వం నుంచి అనుభూతిని, అభ్యుదయ - కవిత్వం నుంచి ఆర్ద్రతను, సామాజిక స్పృహను స్వీకరించాడ"నడం ఆలోచనాత్మక ప్రతిపాదన.

ఎండ్లూరి జాషువ కవిత్వంలో మునక వేసి మురిసిపోయే విమర్శకుడు. ఆయన జాషువ జీవితం నుండి, ఆయన సాహిత్యం నుండి ఎన్నో రకాలుగా ప్రభావితమయ్యారు. కాని ఆయన విమర్శకుడుగా ఎంతో నిగ్రహం ప్రదర్శించారు. జాషువ పీడితుల కష్టాలను ఆర్ద్రంగా మానవీయంగా కవిత్వీకరించారు గాని, వాటి పునాదిని మార్చే రాజకీయం ఆయన దగ్గర లేదు అని చెప్పడంలో ఎండ్లూరి నిర్మమత కనిపిస్తుంది. అలాగే జాషువ కుల వ్యవస్థను ఎంత విమర్శించినా, కుల సమత్వాన్నీ మాత్రమే కోరుకున్నారని, అంబేద్కర్‌లాగా కుల నిర్మూలనను కోరుకోలేరని కూడా స్పష్టం చేశారు. జాషువ "అంబేద్కర్‌లాగా జాషువాది పునాదుల్ని కదిలించే 'కుల నిర్మూలన' కాదు. సర్వకుల సమభావన" (పు.48)" జాషువ దళితుల స్థితిగతులు మీద అపారమైన వేదనతో కవిత్వం చెప్పాడు. కాని వారి జీవితాల విముక్తి కోసం దోహదపడే రాజకీయ చైతన్యాన్ని మాత్రం స్పృశించలేదు" (పు 54). ఎండ్లూరి చెప్పిన ఈ అభిప్రాయాలు లోతైన అధ్యయనంతో కూడుకున్నవే అయినా ఆలోచించవలసినవిగానే ఉన్నాయి. 'గబ్బిలం'లో దళితులను స్వాతంత్ర్యోద్యమంలోకి ఆహ్వానించారు జాషువ. ఆ పిలుపులో రాజ్యాధికార వాంఛ తొంగిచూస్తున్నదనిపిస్తుంది. ఆయన గాంధీజీ మీద కల్తీ లేని మమకారం పెంచుకున్నారు. గాంధీ మరణంతో క్రుంగిపోయారు. స్వాతంత్ర్యానంతర రాజకీయ వ్యవస్థపైన ఆయనకు సదభిప్రాయం లేనట్లుంది. ఈ నేపథ్యంలో విమర్శకే పరిమితమై మార్పు దృష్టిలోపించిందేమో !

***

**సాంఘికంగా ఆయన అంబేద్కర్ కోరుకున్న సమాజాన్ని కాంక్షించారు. అంబేద్కర్ మీద ఒకటీ అరా పద్యాలే రాశారు. అసమ సమాజం పోయి సమ సమాజం రావాలని, అవినీతిలేని పాలన రావాలని కోరుకున్నారు. మార్క్సిజం మీద ఒక్క పద్యమే రాశారు. వర్ణ వ్యవస్థను కీర్తించే గాంధీజీ మీద పుంఖాను పుంఖంగా రాశారు. ఈ వైచిత్రిని గురించి తీవ్రంగా ఆలోచించవలసి ఉంది.**

***

జాషువ సామాజిక కావ్యాలన్నీ అభ్యుదయ, దిగంబర సాహిత్య కాలాలలో రాసినవే. జాషువ కమ్యూనిజాన్ని ఆమోదించినట్లు లేదు గాని, మార్క్సిస్టుల అభిప్రాయలనీ ఆయన చెబుతూ వచ్చారు. కాకుంటే సమయం దొరికినప్పుడల్లా గాంధీజీని కీర్తిస్తూ వచ్చారు. అందుకే ఎండ్లూరి మానవతావాది లేదా నవ్యమానవతావాది అవుతాడని నిర్ణయించారు (పు 57) జాషువా కన్నీటికీ, కన్నీరులోంచి పుట్టిన ఆవేదనకు మూలం మానవతా వాద దృక్పథమే" (పు.56)" ఆయన కవితాదృష్టి సమసమాజ భావజాలానికి దగ్గరగా ఉంటుంది. అంతమాత్రం చేత ఆయనను పూర్తిగా వామపక్షభావాలు గల కవిగా నిర్ణయించలేము" (పు 58) జాషువలో ఇదొక విచిత్రమైన పరిస్థితి సాంఘికంగా ఆయన అంబేద్కర్ కోరుకున్న సమాజాన్ని కాంక్షించారు. అంబేద్కర్ మీద ఒకటీ అరా పద్యాలే రాశారు. అసమ సమాజం పోయి సమ సమాజం రావాలని, అవినీతిలేని పాలన రావాలని కోరుకున్నారు. మార్క్సిజం మీద ఒక్క పద్యమే రాశారు. వర్ణ వ్యవస్థను కీర్తించే గాంధీజీ మీద పుంఖాను పుంఖంగా రాశారు. ఈ వైచిత్రిని గురించి తీవ్రంగా ఆలోచించవలసి ఉంది. "జాషువా రాజకీయాలలో మితవాది. సాంఘికంగా అతివాది" (63) అన్న ఎండ్లూరి ప్రకటన సరైనదే కాని ఆయన అలా ఎందుకు మిగిలిపోయారని ? ఎండ్లూరి అన్నట్లు జాషువ ఒకానొక దశలో కమ్యూనిస్టు సిద్ధాంతాల వైపు మొగ్గుచూపారు. కాని స్థిరపడలేకపోయారు.

పాశ్చాత్యపాలకుల ద్వారా భారతదేశంలోకి అడుగుపెట్టిన క్రైస్తవ మతాన్ని స్వీకరించిన జాషువ "తెల్లవారి పాలనను ఏవగించుకొనేవాడు" అన్న ఎండ్లూరి పరిశీలన గొప్పది (పు 62).

ఆర్థిక విషయాలలో జాషువ చూపిన ఆసక్తి, మాట్లాడిన మాటలు తీవ్రమైనవే "దొడ్డ పదవులెక్కిగద్దిమేసెదు" వారు అని అవినీతి పరులను అధిక్షేపించారు. జాషువ పీడిత జన పక్షపాతం తిరుగులేనిది. అదే సందర్భంలో "జాషువా సమాజంలోని ఆర్థిక పీడనను కవిత్వం చేయగలిగాడేకాని దాన్ని రూపు మాపే మార్గాలను సూచించలేదు" (పు 69) అన్న ఎండ్లూరి అభిప్రాయం గమనించ దగ్గది. బహుశా ఎందుకు జాషువాకు గల గాంధీ వ్యామోహ కారణం కావచ్చు.

రెండో ప్రపంచ యుద్ధ కాలంలో జాషువ సాంగ్ పబ్లిసిటీ ఆర్గనైజర్'గా ఉంటూ యుద్ధ సాహిత్యాన్ని సృష్టించి దారి తప్పాడని అప్పట్లో విమర్శలు వచ్చాయి. ఇందుకు అప్పటి జాషువ ఆర్థిక స్థితి, ఆయన దేశభక్తిని శంకించతగదు (పు 89) అని ఎండ్లూరి అభిప్రాయం. అలా అంటూనే జాషువ జాతీయ స్రవంతి నుండి తాత్కాలికంగానైనా విడివడటం కించిత్ బాధాకరమేనని, పైగా అది ఆయనలోని రాజకీయ ఆలోచనా రాహిత్యమేనని కూడా అన్నారు ఎండ్లూరి. (పు 91) కవితపట్లతన కెంత అభిమానమున్నా, కవిలో కనిపించే లోపాలను ఎత్తి చూపడం పరిశోధక విమర్శకుడి నిజాయితీకి నిదర్శనం.

ఎండ్లూరి విమర్శనంతటినీ చదివితే గుర్రం జాషువ అప్రకటిత అభ్యుదయ కవి అని ఆయన భావించినట్లర్థమౌతుంది. జాషువ ప్రపంచ పరిణామాలన్నింటినీ జాగ్రత్తగా పరిశీలించి పరిశీలించిన దానిని కవిత్వీకరించే తత్వంగల కవి. ఆ కవి ముప్ఫైలలో అభ్యుదయ సాహిత్యం మొలకదశలో ఉన్నప్పుడే జాషువ అనాథ, స్వప్న కథలు రాశారు. వాటిలో ఆకలి ముప్ఫైల ప్రభావమే కనిపిస్తున్నది. అంతేకాదు శ్రమ దోపిడి నిరసన కూడా ఉంది. ఆ తర్వాత అభ్యుదయ రచయితలు ప్రసావించిన అంశాలనే జాషువ కూడా తన కవిత్వం లో ప్రసావించారు. ఎండ్లూరి వాటిని అనేకసార్లు ప్రస్తావించడంలో జాషువలోని ప్రచ్ఛన్న అభ్యుదయ కవి అన్న భావనే వ్యక్తమౌతుంది.

జాషువ జీవితం, ఆయన సాహిత్యం వేరు వేరు కాదు అన్నది కూడా మంచి అబ్జర్వేషన్. మిగతా భావ కవుల లాగా జాషువ

## మాయలోడు

మేరెడ్డి యాదగిరి రెడ్డి
9949415796

విత్తే విత్తనం తనదిగాదు
ఎరువులు పురుగు మందులు
ఏవీ తనవి కానేకావు
వాడి కంపెనీకి లాభాలొచ్చే
పంటలే పండించాలి
బి.టి. పేరుతో విత్తన పెత్తనం
కల్లబొల్లి మాటలతో
కోట్లు కొల్లగొట్టిందివాడే
రైతును బికారి చేసింది వాడే
పంట ధర పెంచుడు దించుడు
అంతా వాడి చేతిలోనే
కాడిని మేడిని, కర్రుగొర్రు
మాయం చేసింది వాడే
ప్రపంచీకరణ యాంత్రీకరణ పేరుతో
రైతును కూలీగా, కూలీని బిచ్చగాడిగా మార్చి
కుల వృత్తుల కూల్చింది వాడే
పాలైనా, నీల్లయినా, గ్యాసైనా
రోటీ, కపడా, మకాన్
అన్నింటి మీద వాడిదే పెత్తనం
తన అవినీతి సామ్రాజ్యానికి అడ్డొచ్చే
రాజైనా మంత్రయినా మార్చగలడు
కాదంటే ప్రభుత్వాలను కూల్చగలడు
అమ్మ ప్రేమను, తల్లిపాలను
వ్యాపార మయం చేసిన ఘనుడు
ప్రపంచాన్ని తన గుప్పిట్లో పెట్టుకుని
మనుష్యుల మరబొమ్మలుగా చేసి
కనిపించని కుట్రల బందీ చేసింది వాడే
వాడెవడో గాదు కార్పోరేట్ మారాజ్ !



కృత్రిమ దుఃఖవాదికాదని చెప్పడం కూడా విలువైన అంశమే "జాషువా కవిత్వం ఎంత గంభీరంగా ఉదాత్తంగా కనబడుతుందో ఆయన జీవితమూ అట్లాగే ఉంటుంది". జాషువ జీవితం వీరోచితమైనది. కష్టాలకు తలవంచిపోనిది" (పు 70)

జాషువ ప్రధానంగా కరుణరస కవి అని ఎండ్లూరి సిద్ధాంతం చేశారు. (పు 100) అంతేకాదు ఆయనది సొంత గొంతుక అని నిర్ధారించారు (పు 112) కవిత్వ రచనలో బుడి బుడి నడకలు వేసినప్పటి నుంచి మరణించేదాకా జాషువ పద్యాన్నే అభివ్యక్తి సాధనంగా తీసుకున్నాడు. పద్య తత్వం మీద అభ్యుదయ దృక్పథంతో ఎంత చర్చ జరిగినా జాషువ చలించలేదు. సమకాలీన, ఆధునిక భావాభివృద్ధికి పద్యాన్నీ సమర్థవంతంగా ఉపయోగించుకోవచ్చుని జాషువ నిరూపించారు. "పద్య కవిత్వంలో ఆధునికతను ప్రదర్శించిన వాడు జాషువా... పద్యాన్ని కవితా ప్రయోగశాలలో కాలానికి ఎదురొడ్డి నిలిచేలా పరీక్షలు చేసి విజయం సాధించాడు" అని ఎండ్లూరి అన్నదిందుకే. అయితే జాషువ పద్యానికే కట్టుబడి రాయడానికి ఇంకొక సాంఘికాంశం కూడా ఉండవచ్చుననిపిస్తుంది. అవకాశం వస్తే (పద్య) కవిత్వం అందరూ రాయగలరని రుజువు చేయడం, సనాతునుల చేతిలో పద్యం కఠిన విద్యగానే మిగిలిపోయిన సందర్భంలో దానిని సరళతరం చేయడం వంటి లక్ష్యాలు జాషువలో ఉండిఉంటాయి. సంప్రదాయవాదులు పద్యంతో పౌరాణిక భావాలను ప్రజల్లోకి తీసుకుపోతుంటే అదే పద్యాన్ని కష్ట జీవుల బతుకు వెతలను సామాన్య ప్రజలకు చేరవేయడానికి ఉపయోగించుకొని జాషువ కృషి చేశారు. పైగా వచన కవిత్వాన్ని ఎగతాళి కూడా చేశాడు జాషువ.

ఆకర్షణ గుణంగల జాషువ పద్యం "ఒక స్వయం కాంతి ప్రతిబింబిస్తూ ఉంటుంది "అనడం సబబే" తెలుగు కవిత్వంలో జాషువ పద్య ముద్ర ఒకటి స్థిరంగా నిలిచిపోయింది" అనడమూ సమర్థనీయమే (పు 119) నిజానికి ప్రాచీన తెలుగు కవులలోని పద్య విద్యలో ప్రౌఢ తెగ, సుకుమార తెగ అని రెండు తెగలున్నాయి. ఆధునిక పద్య కవులలోనూ ఆ తెగలు కొనసాగాయి. జాషువ సుకుమార తెగకు చెందిన కవి. కరుణశ్రీ, దువ్వూరి రామిరెడ్డి వంటి సుకుమార పద్య కవులున్నా, జాషువ డిక్షన్ మిగతా కవుల కన్నా భిన్నమైనది. గుండె లోతుల నుండి దూసుకొచ్చే జాషువ జీవనవేదన, కడుపుకోత, ఆయనను ఇతర కవుల నుండి వేరు చేసింది. మిగతా కవులది నలిగిన బాట. జాషువది సొంతబాట. ఎండ్లూరి సిద్ధాంతం చేసినది ఈ వాస్తవాన్నే.

దాశరథి, కరుణశ్రీల మీద వస్తు రూపాల పరంగా జాషువ వేసిన ప్రభావ ముద్రను ఎండ్లూరి బలంగా రుజువు చేశారు. మొత్తం మీద జాషువ స్వేచ్ఛావాది అని ఎండ్లూరి నిర్ధారించారు. (పు 140) ఒక స్పష్టమైన దృక్పథం గల విమర్శకుడు ఒక విస్పష్టమైన దృక్పథం గల రచయిత మీద ఎలా విమర్శ రాయగలరో ఎండ్లూరి రుజువు చేశాడు. ఆ రెండు దృక్పథాలలో సామ్యాముా, ఐక్యతా ఉన్నా, రచయితలోని వెలితిని, దోషాన్ని ఎత్తి చూపడానికి జంకని గుణం విమర్శ కెంత మేలు చేస్తుందో కూడా ఎండ్లూరి స్పష్టం చేశారు. కవి విమర్శ రాస్తే శైలి అలంకారికం కావడం సహజం. ఎండ్లూరి తన కవి చొక్కాను చిలక్కొయ్యకు తగిలించి విమర్శకుడు గానే విమర్శరాయడం విశేషం.

# క్షతగాత్రగానం

జీవన్
9059881131



అంతా అయిపోయ్యాక
వగచి ఏం లాభం
జరగాల్సిన ఘోరమంతా జరిగాక
ఏడ్చినా మొత్తుకొన్నా నెత్తిబాదుకొన్నా
ఏం ప్రయోజనం

ఆడదాని అవయవాల కొలతలే గాని
మేధస్సును కొలిచిందెన్నడు
గుండెను గాయపరచడమే గాని
హృదయాన్ని తాకిందెపుడు
మనసుని మానని పుండుగా మార్చడమే గాని
సాంత్వన వచనాల అశ్రునయనాలేవైనా రాలాయా
వయ్యారి భామనే తప్ప
ఒప్పుల కుప్పగా తలచిందెన్నడు
రూపురేఖా విలాసిని గానే తప్ప
అపురూప మానవిగా మన్నన చేసిందెన్నడు
బలిపశువుగా వధ్య శిలపైకి ఎక్కించడమే గాని
సాటి మనిషిగా గుర్తించిందెపుడు
సగం భూమి భారాన్ని మోసే
ఆకాశపు సగభాగాన్ని
నిర్లక్ష్యంగా అవతలకు నెట్టి పారెయ్యడమే గాని
నెత్తిన పెట్టుకొన్నదెపుడు
ఏ దుష్ట శక్తి కరాళ నృత్యమిది
ఏ పిశాచగణ సమాహార సమ్మోహనాస్త్రమిది
తల్లిగా చెల్లిగా నెచ్చెలిగా
బహుపాత్రధారీ మానవీయ మానవి
కరకు కర్కశ పాదాల కింద పడినలిగే
దుర్నీతి రచనా దుశ్శాసనులెవ్వరు
ఏ తిరోగమన దిశా సూచిక ఇది
ఒకరు కాదు ఇద్దరు కాదు
వేలూ లక్షలుగా
వ్యక్తులుగా సమూహాలుగా
ఘోర దురంతాలకూ తీరని అన్యాయాలకూ అత్యాచారాలకూ
అనుక్షణం బలిగావించబడే దుష్ట సాంప్రదాయం
ఏ పతన సమాజ ప్రతిఫలనం

అమ్మతనాన్ని
అమ్మకపు సరుకుగా మార్చిందెవ్వడు
ఆడదాన్ని అంగడి బొమ్మగ
బహిరంగ వేలం పెట్టిందెవ్వడు
మమతానురాగాలు లేని
విలాస వస్తువేనన్న మానవాధముదెవ్వడు
సబలను అబలగ మార్చి
విలువల వలువలొలిచిన
గాంధార సంతతి సంగతేమిటి

ఏ భావ దారిద్ర్యం
యువతను నిర్వేర్యం చేసింది
ఏ మాయాజాలం
యువతరాన్ని నిష్క్రియా పరత్వంలోకి నెట్టింది
ఏ దుష్ప్రచార సాధనాల చెదపురుగు
యువత మెదళ్ళను
అనుక్షణం తినేస్తున్నది
ఏ మత్తు
యువతను ఉన్మత్తుల చేసింది

***

ఇంత జరిగాక ఇప్పుడు
పొరలి పొరలి దుఃఖిస్తే ఏమి లాభం
జరగాల్సిన ఘోరమంతా జరిగాక
ఏడ్చినా మొత్తుకొన్నా నెత్తి బాదుకొన్నా
ప్రయోజనమేముంది
ఇంత జరిగాక ఇప్పుడు
క్రోధాగ్ని పర్వతం
రగిలి రగిలి రగిలి
బద్దలవకుండా వుంటుందా
భయదకంపిత నిశ్శబ్దం
బదా బదలు కాకుండా పోతుందా.....

కథ

# ఆంబుక్క

రేబుకుంట్ల సుదర్శన్ (సుజన)
9848359833



పొద్దు పడమరదిక్కు కుంగుతుంది ఆకాసం సంజజెరంగు దుప్పటి కప్పుకున్నట్లు. అంతలోనే దట్టమైన నల్లని చీకటి అలముకుంటున్నది. మళ్ళి అంతలోనే తెల్లని మబ్బులు మరికొంతసేపటికి నల్లగా దట్టంగా మారిపోయింది. నింగి విరిగి నేలకు కూలుతున్నట్లు భయం భయంగా. ఆకాశంలో పక్షులు చెల్లాచెదురుగా వాటి వాటి తావులకు పోతున్నయ్. సన్నగా వాన తుంపర మొదలైంది. తెల్లవారితే దసరా పండుగ.

రాజ్యలక్ష్మమ్మ ఇంటి ముందర వాకిట్లో కూర్చొని పట్నం నుండి తన నడిపి కొడుకు ఆయన భార్య తన ముద్దుల మనవరాలు. వస్తారని కళ్ళలో వత్తులు పెట్టుకుని ఎదురుచూస్తుంది. దసరా పండుగకు ముందురోజు ఆఫీసులకు సెలవివ్వరీసర్కారోల్లు. ఆఫీసైపోగానే బస్సెక్కినా ఆఖరు బస్సేలకు చేరుకుంటుండె. ఆఖరు బస్సేలకూడా దాటిపోయింది. ఈబస్సులెప్పుడు టైంకురావు. లేట్గొస్తదేమో అని మదిల తల్సుకుంట వర్షం జల్లుకు కొంచం కొంచం తడుస్తున్నా ఎదురుచూస్తూ అట్లనే కూకుంది. ఇంకా చీకటి పడింది. లోపలి నుండి ముసలోడు నడిజామైంది దొంగలు పడగాల తలుపెట్టి ఇంట్లకురా అని అర్సిండు. ఆ అర్పులకు లేచి వాకిలి తలుపెట్టి ఇంట్లకు బోయి నడిమింట్ల బల్లెపీట మీద అట్లనే నడుం వాల్చింది. ఎంతకూ కునుకు పట్లే. యింక రాడేమో అనుకుంది. పెనిమిటర్సిన మాట పదే పదే గుర్తొచ్చింది. దొంగలు పడగల్ల తలుపెట్టిరా !

హుఁ ఇంకా ఏమ్మిగిలిందని దొంగలుపడి దోస్కపోవడానికి. దోస్కపోవాలనుకుంద్రు తెలివిగా దోస్కపాయింద్రు. అందర్ని కాదని దోచి పెట్టినందుకు తగిన శాస్తి జరిగింది. ఇంకా దోచి పెట్టడానికింకేం మిగల్లేదుగనుక రాలేదు. మనసంతా ఏదోలా ఆందోళనగా అసహనంగా ఉంది. లేచి మరొకమారు చూడాలనుకుంది లేచింది. ఇంటినానుకొని వరుసగా నిద్రిస్తున్న ఇల్లులు. వర్షం తగ్గి ప్రశాంతంగా నిద్రిస్తున్న ఆకాశం మినుకు మినుకు నక్షత్రాలు తనకు మాత్రం ఏదో గుబులు. ప్రళయ వేల సముద్రపు అలల ఘోషలామనసంతా అల్లకల్లోలం. వాకిలి తలుపుతీద్దామని వెళ్ళింది. అప్పటికే నెత్తిమీదికి గొర్కోలు మొలిచినై. ఉసూరంటూ వచ్చింది. మనుమరాలు రాకపోయే సరికి పండుగ సంబురమే లేదు.

రాజ్యలక్ష్మమ్మ అరవై సంవత్సరాలుపై బడి బంగారు మేని ఛాయతో నుదిటున పావలా బిల్లంత కుంకుమ బొట్టు ఝరీ అంచున్న నూలుచీరలుకట్టి అష్ట లక్ష్ముల ప్రాభవం విలసిల్లుతుండేది అయింటిలో రాఘవులు తెల్లని ఎత్తైన గంభీరాకారం. తెల్లటి పొడవాటి నిండు చేతుల ఖమీజు దానికి బంగారు గుండీలు. పత్తర్పుడ్ దోతులు, నడుముకు వెండి మొలతాడు. తలకు రుమాలు, భుజంపై కండువా, ఇంట్లో పంచాంగం, ఊరి బైటే రహదారి చౌరస్తా కిరువైపులా పాతికెకరాల బంగారం లాంటి పంట పొలం. మిల్లు బట్టల వ్యాపారం వెండి బంగారు నగ నట్రా. విలువైన ఇత్తడి పాత్రలు సకల సౌభాగ్యాలతో తులతూగేవాడు. వూరోల్లకు పంచాంగం చెప్పేవాడు. ఉత్తరాలు పత్రాలు రాసిచ్చే వారు. చినుకుపడి చెల్కలల్ల ఇత్తనాలు ఎయాలంటే మంచిరోజు చెప్పేవాడు. ఆడబిడ్డల్ని అత్తవారింటికి పంపించాలన్నా కొత్తకోడల్లను తీసుకురావాలన్నా రాఘవులుతో పంచాంగం చెప్పించుకోవాల్సిందే.

వూరందరికి హితుడే కానీ ఇంట్లో మాత్రం పెద్దపులి. నోరుతెర్సిండంటే పెద్దపులి గాండ్రించినట్లే. కట్టుకున్న భార్యన్నా, కన్న కొడుకులన్నా డబ్బుల తర్వాతే. కనీసావసరాలకు కూడా కాణి రాలకపోయేది. అందుకే తండ్రి కొడుకుల మధ్య దూరం పెరిగింది.

పెద్దకూతురు తన అక్క పోలికంట. నడిపి కొడుకు తన తండ్రి పోలికంట. అందుకే వారిద్దర్నీ ప్రేమగా చూసేవాడు. వారి అవసరాలు మాత్రమే ఇష్టంగా తీర్చేవాడు. అమ్మ కూడా వాళ్ళ నాన్న పేరు కల్సినందున మురిసిపోయి గారంగా చూసేది. చిన్నప్పుడు గోరుముద్దలు తినిపిస్తు ఇది పెద్దన్న బుక్క, ఇది జగ్గన్న బుక్క, ఇది నీ బుక్క ఇది సుజన బుక్క, ఇది చిన్నోని బుక్క అంటు అన్న దమ్ముల పేర్లు చెప్తూ తినిపిస్తుంటే చిన్ని చినరాములు నాకు ఈ చిన్న చిన్న ముద్దలు సరిపోవు. అందరి బుక్కలు కల్పి వొక్కటే ఆం బుక్క పెట్టు అని గోముగా అంటూ అన్నీ కల్పి వొక్క గుటకలోనే మింగేవాడు. అది చూచి అమ్మ, పెద్దఅక్క సంతోషానికి అవధులు వుండేవే కావు.

చిన రాములు ఊర్లో అందరు ఇకమతుల రాములు అనేవారు. ఐ టి ఐ పూర్తిచేసి హైదరాబాద్లో ఆల్విన్ కంపినిల కొల్వు చేస్తుండే. ఆయన చదువుకుంటున్నప్పటికే ఆయనపై ఇద్దరన్నలు ఉద్యోగాలు చేసేవారు. తండ్రిచ్చిన పైసలు దాపెట్టుకుని అద్దెల్వకుంట అన్నలదగ్గర్కి పోయి పైసలడుక్కొచ్చుకొనేవోడు. ఉద్యోగమొచ్చినం కూడా అది టెంపరరీ ఉద్యోగమని తనకు సరిపోవని అన్నలను పైసలడుక్కొచ్చుకొనేవోడు. వొక్కోసారి అన్నలు లేవని చెప్పినా దాని ప్రభావం తల్లి కొడుకుల అత్తాకోడల్లకు మధ్య వైరంపెంచేది పెద్ద బిడ్డ మందర బుద్ధితోవోసారి నక్రేకల్ల ఉండే జగ్గన్న దగ్గరికి పోయినప్పుడు గిట్లనే పైసలెవని తప్పించుకోచూస్తే బట్టల దుక్నంల కావాల్సిన బట్టలు లుంగీలు తువ్వాలుతో సహా ఉద్దెర ఇప్పిచ్చుకుని డబ్బులకంటే ఎక్కువే గుంజిండు. మిగతా అన్నలేమో తమ జీతంలో సగం ఇంటికి తండ్రికి పంపిస్తూ అది కాకుంట పట్నంల ఉండే తమ్ముడికి నెల నెలా ఇచ్చేవారు. వారు వొకిల్లుగాని జాగా గాని కొనుక్కోలే. ఇకమతుల రాములు మాత్రం అప్పటికే రెండిళ్ళ జాగలు వొకిల్లు కొనుక్కుండు ఎవ్వరికీ తెల్వకుంట.



రాఘవులు పెద్దల్లుడు రామలింగం ఆయనది నల్లగొండ. తెల్లటి సల్వ బట్టలేసుకొని ఏపని చేయకుంట దొరల సోపతిపట్టి తిర్గేది. పొడవాటి కాళ్ళు. ఒడ్డుకొచ్చిన చేపల్ని లటుక్కున ముక్కున కరిచి తినే ఎరగాల్ల కొంగలా జీవితకాలం మామతో స్నేహం నటిస్తూ పూట గడిపిండు. మామున్నోడు. గింజకు కొదువ లేదు. పెద్దబిడ్డంటే ఎక్కడలేని పావురం. ఎప్పుడు ఏడ్పు ముఖం పెట్టుకుని అమ్మ దగ్గర బీదర్పులు అర్సేది ఇప్పుడే చస్తున్నట్లు. బిడ్డ కష్టాలు చూడలేక బియ్యం, పప్పులు, పాలు పెరుగు, నెయ్యి ఇలా సర్వస్వం పుట్టినింటినుండే సర్దేది. తండ్రిది బట్టల వ్యాపారమాయే. పుట్టింటికొచ్చినప్పుడల్లా తమకు తమ పిల్లలకు కావల్సినవి తండ్రికి తెల్వకుంట అమ్మ చేతుల్తో కొన్ని, తండ్రి నడుక్కొని కొన్ని తీసుకపోయేది. అట్లా కుటుంబం మొత్తం బట్టా పొట్టా అమ్మగారింటి నుండే ఎల్లదీసేది. వొకసారి ఇది పెద్ద తమ్ముడికి తెలిసింది పాచ్చాతాపం చెందాల్సిందిపోయి తమ్మునిపై పగ పెంచుకుని సమయమొచ్చినపుడల్లా అమ్మతో పితూరిలు చెప్పి తల్లీ కొడులమధ్య వైరం పెంచేది.

రామలింగం గారాలపట్టి జేస్టాదేవి. తొల్సూర్ బిడ్డ ముద్దుగుంటదని ఆపేరు పెట్టుకుండు తండ్రి. నల్గొండల ఇంటర్మీడియట్ తప్పి తోటి సోపతిరాల్ల దగ్గర పరువు పోతుందని వొచ్చి అమ్మమ్మింట్ల లంగరేసేంది. ఎడారి ఇసుక రంగుపోలిన లేత నాజూకు చెర్మ సౌందర్యం. విశాలమై లావైన కనుగుడ్లు తీరైన ముక్కు జీవకళ ఉట్టిపడే ముఖలావణ్యం. రెండు జడలు, హాఫ్ లంగా మొండి చేతుల చొక్కా కాళ్ళకు గజ్జెల పట్టాలు కాలేజీలో చదివిన చలాకీతనం తన ముద్దు ముద్దు మాటలతో ఇల్లంతా సందడి చేసేది. తాతయ్య అమ్మమ్మలను గుప్పిట్లో పట్టుకోగల సామర్ధ్యం. తాతయ్య అమ్మమ్మలు కూడా ముద్దు చేసేవారు. ఇంటికొచ్చిన అతిథులు ఈ గజ్జల గుర్రానికి పెళ్ళెప్పుడు చేస్తరని హెచ్చరించేవారు.

ఎండాకాలం బళ్ళకు సెలవులు ఇచ్చిండ్రు. మిగిలిన చిన్న పిల్లేసుకుని అమ్మింటికొచ్చింది పెద్దబిడ్డ. ఆ వెంటనే అల్లుడు. సుట్టం మర్యాదకు దేశం కోన్ని కోశిండ్రు. ఎండకాలమాయే అల్లునికోసమని సాయంత్రం కల్లులొట్టి తెప్పిచ్చిన్రుమామ. విశాలమైన ఇల్లాయే. సాయంకాలం ఇంటెనకాల వరండాలో పీటలేసుకుని కూసుండ్రు మామ అల్లుడు. తెల్లటి పొడవాటి గాజు గిలాసలు రాళ్ల ఉప్పుతో తోమి కడిగి ముందల పెట్టిండ్రు. కోడికూర ముక్కలు రెండు చిన్న చిన్న గిన్నెలల్ల పెట్టిండ్రు. వొకగిలాసల కల్లు వొంపి అల్లుని చేతికందించి తనొకదాంట్లో వొంపు కుండు. కల్లు తాక్కుంట మధ్య మధ్య కోడిముక్కలు నంజుకుంట మామ అల్లుండ్లు లొట్టిలాగిస్తున్నరు. మామ మాట కలుపుతూ అల్లునితో జేస్టాదేవి పెళ్లీడు దాటిపోతుంది. దానీడు పిల్లలిప్పటికే ఇద్దరు పిల్లల తల్లులైనరు. కన్నె చెర మహాపాపం. ఎవర్నన్న మంచోడ్ని చూడు వచ్చే లగ్గాలల్లనన్న కథ కతమనిపిద్దం అన్నడు ఊహించని మామ అనునయానికి అల్లుని నెత్తిమీద పిడుగు పడినంత పనైంది. చేతిలో పైసా లేకపాయ. మేనబావ ఉండుగని కొలువులేదు. ఎక్కడన్నా దూరం సంబంధం చూద్దామన్న లక్షలకు లక్షలు కట్నాలు పోయాల ఎక్కడ నుండి తేవాల్నని మనసులోనే అనుకొని మహారాజు పట్నంల ఉద్యోగం చేసే బామ్మర్ది ఉండే. మామకు ఇన్నేసి భూములు ఆస్తులు ఉండే. వీటినొదులుకొని బైట సంబదానికి నేనెందుకు పోత అనుకొని చిన్నగా పావులు కదిపిండు.

మామా వొకమాట యేమనుకోవుగా అన్నడు. అనుకునేందుకేముంది ఏందో చెప్పరాదు అన్నడు మామ. మేనకోడలొర్సన నీ పట్నం కొడుక్కు జెస్టాదేవిని చేస్కోరాదే. ఈడు జోడు మంచిగుంటది. నా దగ్గరేం లేదాయే నీకు తెల్వందేమున్నది బైటి సంబందానికి నేనెక్కడ బోను లక్షలకు లక్షలు కట్నాలు యాడదేను. నీకు మాత్రం ఇంత పెద్దాస్తి. సక్కదనాల కొలువుచేస్తున్న కొడుకు....

ముక్కు మొకం తెల్వని పరాయి పిల్ల ఈ అస్తి తింటే బాగుంటదా? నీ బిడ్డ మొఖం చూసైనా వొప్పుకోరాదే అన్నడు. ఎహే ! మనదగ్గర మేనమర్దల్లను చేస్కుంటరు గని మేనకోడల్లను చేస్కుంటరా? పిల్లనియ్యాల్సినింటి నుండి పిల్లను చేస్కుంటరా? ఆంద్రోల్లోలె! పాపం గాదు అన్నడు. ఇంతలో కల్లుల నంజుకోవడానికి మల్లింత కోడికూర రెండు చిన్న చిన్న గిన్నెలల్లపెట్కొని బిడ్డొచ్చి ఆన్ద్రోల్లేంది తెలంగానోల్లేంది మేనకోడలొర్సన మనోల్లుకూడా చాలామందే చేసుకుంటుంద్రు వొప్పుకోమని బతిమాలింది.

ఐతే నాదేముంది చేసుకుంటోడిష్టం. వాడొప్పుకుంటే చేయడాన్కి నాదేంబోయే అన్నడు. అమ్మమ్మ మనవరాలు నడిమింట్ల కూర్చుని అంతా వింటున్రు. మేనమామంటే ఇష్టమో! పట్నంపై మోజో ! ఆస్తిపై కన్నో ! తండ్రికి ఆర్థిక భారం తప్పుతుందన్న ఆలోచనో పట్టరాని సంతోషంతో వయసు వీచే గాలికి పురివిప్పిన నెమలిలా అమ్మమ్మను వాటేసుకుని గిరగిరా తిప్పింది జేస్టాదేవి. అమ్మమ్మ సంతోషించింది. కూతురు గుండెల మీద బరువు దిగుతున్నందుకు.

ఆలస్యమైతే అమ్రుతంకూడా విషం అవుతుందన్న లోకోక్తిని గుర్తుకు తెచ్చుకుని తెల్లారే మామను తీస్కొని బయలుదేరిండు. బస్సుకిరాయలెవరు బెట్టాలని తోవ్వలోవున్న యెల్లంల కాడ దిగి బడిపంతులుద్యోగం చేస్తున్న పెద్దబామ్మర్దిని కూడా తీస్కొని పట్నం బస్సెక్కిండ్రు. పెద్ద బామ్మర్ది నత్యంకు ఎందుకో మేనకోడలే ఇంటి కోడలవుతుందంటే మన్సుల కొంత అయిష్టత వుంది. అప్పటికి తనవరిదిలో చూసిన సంఘటనలు తన విజ్ఞత ఈ వ్యతిరేకతకు కారణం కావొచ్చు. వొక్కకొడుకే అయితే తేడా ఉండకపోవొచ్చు. కూడా ఐదుగురయే. కానీ తనుచేసేదేముంది. పెద్ద కొడుకంటే అప్పటి వరకు తండ్రికి ఏ విషయంలోనైనా మంచిగురే.



కాని అల్లునిమాటకు అంతకంటే విలువెక్కువ. మామా అల్లుళ్ళు కలసి నిర్ణయించుకున్నాక ఎదురుచెప్తే తనమాటకు విలువలేకపోగా అదనంగా శత్రుత్వం కొనితెచ్చుకున్నట్లే. బావ ఆర్థిక పరిస్థితిచూసిచేసేదేమిలేక వాళ్లతో కల్సి మౌనంగా అనుకరించాడు.

బస్సుపొద్దున 9 గంటలకేదిగి ఆటో కట్టుకుని నేరుగా అల్విన్ కంపిని దగ్గరికి పోయింద్రు తావుతెల్వక. డ్యూటీకి పోతుంటే పట్టుకోవచ్చని గేటు దగ్గర నిలబడ్డరు లోపలికిబోతుంటే పట్కున్రు. విషయం చెప్పిన్రు. ఇష్టమున్నా ఇకమతులోడాయే తన ఇకమతులు ప్రదర్శించిండు. పట్నంల ఖర్చెక్కువ. నేను బతుకుడే కష్టం. పెండ్లిచేస్కొని ఎట్లా బత్కేది అని బెట్టుచేసిండు. తండ్రితో ఇద్దరికీ సరిపోను బియ్యం, పప్పులు పంపిస్తే చేస్కుంటనని వొప్పించుకుండు. పెండ్లి కొడుకు బట్టలకు యితర ఖర్చులకు పాతికవేలు పెద్దబామర్దిచ్చేట్లు అప్పజెప్పింద్రు. పెళ్ళిపిల్ల బట్టలు, బంగారం ఇరువైపులా ఖర్చులు మామతోనే పెట్టిచ్చి ఎండాకాలం లగ్గాలల్ల ఘనంగా పెళ్ళిచేసిండు. తండ్రి మాత్రం ఉత్తచేతుల్తో కాపురానికి పంపిస్తే చేతులూపుకుంట పోయింది.

నిజానికి చినరాములు పనిచేసే ఆల్విన్ కంపనీ ప్రభుత్వ కంపనీయే. మంచి జీతంతో ఉద్యోగం చేస్తూ పెండ్లికి ముందే తండ్రికి అన్నలకు తెల్వకుంట రెండిళ్ళ జాగలు వొక ఇల్లు కొనుక్కుండు. అమ్మ పసుపు కుంకుమల కింద తెచ్చుకుని పెంపు చేసుకున్న పైసలు మనవరాలితో ఉబ్బిచ్చి కాజేసిండు. తండ్రి పీసోదని కొడులొచ్చినప్పుడల్లా తల్లికిచ్చిన పైసలు కూడా తనే తీస్కపోయేవాడు. ఊర్ల అమ్మకున్న పలుకుబడితో అప్పులుచేపిచ్చి పట్నం తీస్కపోయి ఇల్లస్తలాలు కొన్నడు. అప్పులోల్లు అడుగుతుంటే తమ్ముడు సుజన ఉద్యోగం వచ్చినంక అడిగితీర్పింది. చినరాములు రెండో ఇల్లు కట్టడం శురూ చేసిండు. తన అల్లుడిది ప్రైవేటుద్యోగం కొద్దిజీతం తిప్పల పడుతుండు అంటూ పెద్దబిడ్డ అమ్మతో సుజన ఉద్యోగం చేస్తుండుగా పైసలు సర్దమని పోరుపెట్టింది. అమ్మకూడా ఇయ్యమని నిష్టురమాడింది. మన్ననే ఉద్యోగంవచ్చే అప్పుచేసి అన్నకిప్పిచ్చిన పైసలు నాతో తీర్పిచ్చితివి. ఎవ్వరివ్వకున్నా నీకిస్తనేఉంటి. అని సంజాయించబోతే అన్న ఇల్లు కట్కుంటుంటే పైసలియ్యలేదని రద్ది పెట్టింద్రు.

ఉన్నట్టుండి రాఘవులు కాలికి నీరుపట్టి లావయింది. ఆపరేషన్ చేయాలన్నరు. పట్నంల కొడుక్కు యి.ఎస్.ఐ. దవాఖాన్ల ఉచిత వైద్యముందిని రేషన్ కార్డుకూడా తీస్కొని పోయిండు. దవాకాన్ల పదిరోజులున్నాదల్సి వచ్చింది. దవాఖాన్ల ఉన్న తండ్రిని చూసొద్దామని పెద్దన్న పోయిండు. విసిటర్స్ టైం అయిపోయిందని తిప్పి పంపింద్రు. ఇంటికిరా రేపు చూసి పోవచ్చని పిలవలేదు. బాగైనంక డాక్టర్లకు తమకు ఖర్చోచ్చిందని రొండు లక్షలు తీసికొచ్చి ఇయ్యమంద్రు తండ్రిని. నేన్నస్తే అమ్మను చూస్కొమని ఇంకొలక్షకల్పి మూడు లక్షలు పట్నం కొడుకు చేతిల బోసిండు మిగిల్న కొడుకులకు తెల్వకుంట.

మన్మరాలు ఇంటికోడలు కావడానికి ముందు ప్రతి దసరా సంక్రాంతి పండుగలకు కొడుకులు, కోడళ్ళు అందరు ఇంటికి వచ్చి పండగ సంతోషంగా జరుపుకొని పోయేవారు. పండగకు వచ్చినప్పుడు పట్నం కొడుకు బియ్యం పప్పులు అన్ని తీసుకపోయేది. మిగిలిన ఇద్దరు పెద్దన్నలకు ఏమి పోసేవారు కాదు. సగం జీతం ఇంట్లోకి ఇస్తుండేవారు. పట్నం కొడుకు జీతమివ్వకపోగా ఇంటి నుండి తీసుకపోవడం పెద్దన్నల మన్సులపడి క్రమంగా ఇంటికి రావడం మానేసింద్రు. అప్పటికి చిన్న కొడుకులిద్దరికి చదువులు కూడా పూర్తికాలే. వారి చదువులకు డబ్బులు ఇవ్వకపోయే వాడు తండ్రి. వుద్యోగం చేసే పట్నం కొడుక్కు ఇంటి నుండి సహకారం. చదువుకొని స్తిరపడాల్సిన కొడుకులకు నిరాదరణ ఉండేది. చదువులకు తండ్రిని పైసలు అడిగితె పెద్దోల్లను చదివిస్తే వాళ్ళు మేత పెట్టుంద్రు యింక మీరు పెడతరు అంటూ ఎద్దేవాచేస్తుండేది. బియ్యం ఇంట్ల కల్గినవే అయినా బియ్యంకూడా పేపర్లేసుకుంటూ ప్రైవేటులు చెప్పుకుంట కొనుక్కుని సదువుకున్నరు కొడుకులు. భూమి అమ్మి పెద్దోల్లవోలెగే వాళ్ళను కూడా చదివించమని అమ్మంటే నాకొడుకులకు చిప్ప చేతికియ్యాల్నా ఇంత బతుకు బతికి కొడుకులకేం మిగల్సలేదని నేను చెడ్డ పేరు మొయాల్నా అనేవాడు.

పెద్ద కొడుక్కి చాలాకాలానికి కొడుకు పుట్టిండు. మనుమని బారసాల ఖర్చు ఇంటికేసిని సున్నం చెల్కల తెచ్చిన కట్టెలతో సహా పైసా పైసా లెక్కరాసి కొడుకు దగ్గరొసూలు చేసిండు. మన్మడు అంబాడుతుంటే దెబ్బ తగిలింది డాక్టర్కు ఖర్చుఐనదని పెద్ద కొడుకు దగ్గర రెండొందలు వసూలు చేసిండు. అదే పట్నం కొడుకు ఇద్దరు బిడ్డలకు కర్సంతా తాతే పెట్టిండు. శాకిరంతా నానమ్మే చేసింది. ఇది మన్సుల పెట్టుకుని పెద్దకొడుకు కుమిలి కుమిలి తాగుడు కలవాటై తాను పనిచేస్తున్న ఊరిలోనే పసిరికలు వచ్చి సచ్చిండు. తను పనిచేసే స్కూల్ హెడ్మాస్టరుగాని ఇతర టీచర్సు గాని ఆ ఊరి జనానికి గాని తనొక అనాథగానే అన్పించిండు. ఆ స్కూల్ హెడ్ మాస్టర్ ఎట్లనో పత్తా తెలుసుకుని చప్రాసితో చావు కబురు పంపించిండు తండ్రికి. తేమలేని గుండె కదా ! తన దగ్గర ఆయన సొమ్మేమి దాచిపెట్టలేదని సర్కార్ సావు కర్సులిస్తది కదా ఆపైసలతో ఆపీస్గను అక్కడే కాల్సి పారేయమని ఆవార్త తీసుకొచ్చిన చెప్రాసితో చెప్పిండు. నాల్గోకొడుకు సుజనే ఖర్చుపెట్టి దహన కార్యక్రమాలుచేసిండు. బావ రామలింగం యెల్లంల వచ్చి బామ్మర్ది సామాన్లన్నీ సదుర్కపోయిండు.

పెద్దన్నలిద్దరు మినహా సంక్రాంతి పండగకు ఊరికెల్లిన్రు. అప్పటికి కొడుకులందరూ ఉద్యోగాలు చేస్త్రున్రు. చిన్న కొడుకులిద్దరికి పెళ్ళిళ్ళు కాలేదు. కొడుకులందరూ చదువుకొని బుద్ధిగా ఉద్యోగాలు చేస్తున్రు. మీ నాయనకు ఇంకా కష్టం తప్పకపాయ అని ఊర్ల జనం ఇకమతుల రాములు మొకం పట్కోని అడిగిన్రు. ఇంకా ఎంతకాలం తిప్పలపడ్తవ్ సంపాయించి ఎవరికి పెట్టేదుంది. మన్మరాలేనాయే వాళ్ళదగ్గర పోయిండురాదు అని ముస్లోనికి చెప్పింద్రు. పరాయి కోడళ్ళు పరాయి వోల్లైనయే మన్మరాలంటే పావురమేనాయే. చిన్నోలిద్దరికి పెండ్లిళ్ళు కాకనేపాయే. పోయి పట్నంల దర్జాగా ఉండని సలహా చెప్పింద్రు ఇది చినరాములుకు మన్మరాలుజేస్తాదేవి గుండెలో రాల్లుపడినట్లు అయ్యింది. పప్పులుప్పులు తీస్కపోచ్చని ఆశతో వచ్చింద్రు. ఊరోల్లకుముస్లోల్ల చూసిపోనోచ్చిండు. అనే మంచి పేరు తెచ్చుకోవచ్చు అనుకుంటే ఇలా ఉచ్చు మెడకు తగిలిందేమిటి అనుకుండు మన్సుల. అది పైకి కన్పించకుండా పైకి మాత్రం ఆవును ముస్లోల్లిద్దరే ఇక్కడేం చేస్తరు భూమంతా అమ్ముకొని రాండ్రి అని అందరి ముందు అలవోకగా చెప్పి పండుగెల్లగానే ఎవరిజాగల వాల్లెల్లిపోయింద్రు.



పండుగెల్లిన తెల్లారే ఎక్కడోల్లు అక్కడ పోగానే అల్లుడు రామలింగం రానే వచ్చింద్రు బావా బామ్మర్దులు బదులుకున్నట్లే ముస్లోనితో భూమమ్మించిండు. అమ్మిన పైసలు తెలివిగా పట్నంల బామ్మర్ది దగ్గర పెట్టిచ్చిండు అల్లుడు. మిగిల్న కొడుకుల నెవర్ని సలహా అడగలే. తండ్రెంటే కొంత భయం కొంత గౌరవం... ఎవరు ఎదురు చెప్పలే. తండ్రి కూడా తమకు ఏమైనా వైద్య ఖర్చులవసరమైతే ఖర్చు చేస్తడు లేకుంటే అందరన్నదమ్ములకు సమానంగా పంచుతడు వానికి అన్ని ఎరికే ఎవరికెన్ని వచ్చినవి ఇంకా ఎవరికి ఎన్ని యివ్వాలి అవిపోను మిగిలినవి సమంగా పంచుతడని ఫత్వా జారిచేసినట్లు చేసిండు కొడుకంటే అంత నమ్మకం డబ్బులున్నై మోసం చేయాల్సిన అవసరం లేదు ఏమైనా తేడా వస్తే తల్లి తర్వాత తల్లి లాంటి పెద్దక్క ఉంది. అందర్ని సవరిస్తది. నమ్మకంగున్న ఇంటల్లుడు అంతా మంచిగనే ఉంటదని అనుకుండు అమాయకంగా ఎట్లుంటది? పైసల్చేతుల పడే సొంత బిడ్డ లాబపడుతుండే జెస్టాదేవి తమ్ముడు పంతులుద్యోగంచేస్తూ చిన్న పెద్దల్ల తిర్గుతడు న్యాయంగ ఉంటదని అనుకుంద్రు దీనంతటికి సాక్షి కూడా కానెందుకు మాట్లాడుతడు అదృష్టం వరించేది తనక్కకేనాయే. ఇకమతుల రాములు కూడా అప్పటికే చేస్తున్న ఉద్యోగం మానేసి రియల్ ఎస్టేట్ వ్యాపారం చేస్తుండు. ఆగ్రామానికి సర్పించి అయ్యిండు. భూమమ్మిన పైసలు రియల్ ఎస్టేట్ వ్యాపారంల పెడితే మిత్తి ఎక్కువ వస్తుందని నమ్మ బలికిండు. అన్న నిజస్వరూపం తెల్వని తమ్ముళ్ళు మిగతా వదినలు నమ్మింద్రు. ఊర్ల ఉన్న ఇత్తడి, రాగి, వెండి, బంగారం సామాన్లన్నీ ఎవ్వరికీ తెల్వకుంటనే మోశిండు. అందులో తన రెండో వదిన తల్లిగారింటి నుండి తెచ్చుకున్న ఇత్తడి సామాన్లన్నీ ఉన్నై.

సంక్రాంతి పండగ తర్వాత దసరా పండక్కు రావాల్సిన మనవరాలు నడిపి కొడుకు వస్తాడని యెదురు చూస్తూ పండుగెల్లగానే పట్నం తీస్కపోతడు మనవరాలు. మునిమనుమరాల్లతో ముసలితనంలో హాయిగా గడుపొచ్చని ఆసపడితే నిరాశే మిగిలింది. దీనంగా మౌనంగా రోదిస్తూ అసలీ భూమి ఎందుకు అమ్మించ్చిండు. ఈముస్లోడు ఎందుకు అమ్మిండు. హైదరాబాద్కు అతి దగ్గరలో రోడ్డు పక్కనున్న విలువయిన బంగారం లాంటి భూమి. తిండి లేక అమ్మిండా అంటే కాదు. తాగప్పులు చేసిండా లేదు. మిగిలిన కొడుకులెవరికైనా ఇచ్చిండా? లేదు. చిన్నల్లుడు ఆదరువు లేదు భూమి చేస్కోని బత్కతనని అడిగితే నాకొడుకులు లేరా అన్నడు. భూమి ఉంటే పంచుకునేప్పుడు కొట్కోని సస్తరు పైసలైతే కోట్లాడకుంట పంచుకుంటరు మంచిగ కల్సి ఉంట రనుకుండు అమాయకంగా. ఉన్న పొలం ఉంటున్న ఇల్లు వదిలిపోగానే అల్లుడు రామలింగం ఊర్ల ఇంటి దూలాలు వాసాలు అమ్ముకుండు. జరిగిన మోసం అర్థమై ముసలోడు గుండాగి సచ్చిండు. పీనాసితనం కోసం పెద్దకొడుకును దూరం చేస్కున్నందుకు మన్మరాలిని పట్నం కొడుకును నమ్మినందుకు కూతురు మండరతనం అల్లుని చాణక్యం అందర్ని దూరం చేసి జేస్టాదేవి చినరాములకు కల్సోచ్చింది. కొంతకాలానికి అమ్మ కూడా ఇకమతుల రాములు పైసముచ్చోడని అర్థమై కుమిలి కుమిలి చచ్చింది. చచ్చేముందు తను దూరం చేసుకున్న కోడళ్ళను మనవళ్ళు మనవరాల్లను తల్సుకుంది. తన బిడ్డ ప్రాణానికి ప్రాణం అనుకున్న మనవరాలు. ముదిమనవరాళ్ళు దగ్గరకు రాకుంటే కుమిలి కుమిలి చేసిన తప్పర్థం చేసుకుంది. తండ్రి చెప్పిన ప్రకారం ఎవరికి పైసా పంచలేదు. ఎవరన్నా తెల్సినవారడిగితే అట్లనా వాళ్ళకు ఇవ్వలేదా నాయనున్నప్పుడు అడుక్కోవాల్సింది అంటూ చుట్టాలల్ల. సొంతూర్ల మొఖం చాటేసి దొంగ బత్కు బత్కుతుండు.



# అర్థ విపరిణామం

కె. ఆనందాచారి
9948787660



జీవితమంటే ఏమిటో,
ఎలా ఉండాలో ఏం చేయాలో
క్రొత్తగా నిర్వచనాలు
నిఘంటువుల్లోకి వచ్చేశాయ్ !
కొన్ని పదాల వెనుక భావాలు
క్రొత్త అర్థాల్ని కప్పుకున్నాయి !

సుఖించడమంటే
సౌకర్యాల సాలెగూట్లో
విలాస విన్యాసాలు చేస్తూ
సరుకుల్ని ఆలింగనం చేసుకోవటమే !

ఎదుటి వారి సుఖాల్ని
ఒక్కడే కొనుక్కోవటం
దొరక్కపోతే దోచుకోవటం

సుఖమంటే
ఎదురుగా పుట్టెడు దుఃఖం
పొర్లుతుంటే చూసి ఆనందించడమే

కళ్ళముందు
ఎవరిదో దుఃఖం పారకపోతే
తన సుఖాన్ని కొలవటం ఎలానో తెలియనితనం !

సుఖ దుఃఖాలనేవి
జీవితాల్ని అల్లుకొని ఉండటం మాని
మార్కెట్లో క్రయ విక్రయాలుగా
మారుతున్న వికృత పరిణామం సాగుతోంది !

ఆనందమంటే....
అందాన్ని చెరిపి
రూపాన్ని విరూపించి
సౌందర్యాన్ని నుసిలా మసి చేయడమే !

సంతోషమంటే
సందోహాల మధ్య
నవ్వుల వెలుగు దివ్వెలు
మొలవటం కాదిప్పుడు
సపరేట్‌గా నాకు నేను
నాకోసం నేనుగా మిగిలిపోవటమే !

లాక్మే, నివ్యా డబ్బాల్లో
మెరిసే తెల్లని క్రీమ్ మాత్రమే
సౌందర్యమనుకుంటున్న వేళ....
సత్యమంటే తెలుసుకోవటానికి
'ఐడియా' వాడిని ఆశ్రయిస్తున్న
తరుణాన ....
భ్రమైక జీవనంలో
సత్యంచిత్తు కాగితమై
కొట్టుకు పోతోంది

బ్రతుకు చిత్రం నిత్యం
ముక్కలు ముక్కలుగా పగిలిపోయి
అతుకుపడని శకలాలైనవి !
సత్యాసత్యాల సంగతుల
చర్చా సందర్భాలేవీ
డేటుడే స్క్రీన్‌పై హెడ్‌లైన్లు కావు
సెన్సెక్స్ ఎలా పెరగాలో సెనెట్‌లో నిర్ణయం
పార్లమెంటులో బిల్లామోదానికి
పన్నిన వ్యూహం....
ఇ-కామర్స్ కోర్సుల కొరకు
దేశాంతర సంచారంలో
దేహాంతరులై చరించడమే
సత్యశోధనగా మారింది !
అందుకే
మనిషంటే ఇపుడు
మానవీయ సుగంధాలు పరిమళించడం కాదు
'మనీ'లోకి మౌనంగా ప్రవహించడం
మహాయోధుడిలా నిలబడటం కాదు
మహా వినియోగదారుడులా రూపెత్తటం !

# పరిశోధకుడుగా గురజాడ



**గురజాడ అనుభవజ్ఞుడైన శాసన పరిష్కర్త. శాసన లిపిని బోధపరుచుకునేందుకు, దాని వృద్ధిని గమనించేందుకు సోదర భాష అయిన కన్నడాన్ని కూడా నేర్చుకున్నారు.గురజాడ శాసన పరిశోధనల్లో యుద్ధమల్లుని బెజవాడ శాసన పరిష్కరణ ప్రధానంగా పేర్కొనదగినది. గురజాడకు శాసన పరిశోధనలలో గిడుగు వెంకట రామమూర్తి, వేటూరి ప్రభాకర శాస్త్రి, కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు, జయంతి రామయ్య పంతులు, కృష్ణశాస్త్రి, హెచ్. కృష్ణమూర్తి మొదలైన వారి సహకారం కూడా ఉండేది.**

డా. తన్నీరు కళ్యాణ్‌కుమార్

9490776385

గురజాడ యొక్క సృజనాత్మక రచనలు ఆయన ఇతర సారస్వత కృషిని మరుగున పరిచాయన్నది చారిత్రక వాస్తవం. గురజాడ వారి సృజనకున్న శక్తి అంత గొప్పది. అందుకు కన్యాశుల్కం నాటకమే నిదర్శనం. తెలుగు సాహిత్య చరిత్రను ప్రభావితం చేసిన ఆయన రచనల వెనుక విస్తృతమైన పరిశోధనాత్మక అధ్యయనం వుంది. గురజాడ వారి వ్యాసాలు, లేఖలు, డైరీలు పరిశీలిస్తే ఈ సంగతి స్పష్టమౌతుంది. స్వతస్సిద్ధంగానే గురజాడ వారు పరిశోధనాత్మక దృక్పథం కలిగిన వ్యక్తి. చరిత్ర పరిశోధన, భాషల అధ్యయనం, శాసన పరిశీలన, నాటక రచన, విద్యాబోధన, ఇతర భాషలతో తెలుగు తులనాత్మక సింహావలోకన, కావ్య విమర్శ మొదలైనవన్నీ ఆయన పరిశోధన కృషిని వివరిస్తాయి.

గురజాడ వారి పరిశోధనలు మౌలికంగా మూడు విభాగాలకు చెందినవి. అవి శాసన పరిశోధన, చారిత్రక పరిశోధన, భాషా పరిశోధన. సందర్భాన్ని బట్టి, అవసరాన్ని బట్టి ఒక్కోసారి దేనికదే విడివిడిగానూ, పలు సందర్భాల్లో సంయుక్తంగానూ ఈ పరిశోధనలను ఆయన నిర్వహించారు. అందుకోసం తన అనారోగ్యాన్ని సైతం లక్ష్యపెట్టకుండా చారిత్రక ప్రాంతాలను విస్తృతంగా పర్యటించారు.

**1. శాసన పరిశోధన :**

గురజాడ అనుభవజ్ఞుడైన శాసన పరిష్కర్త. శాసన లిపిని బోధపరుచుకునేందుకు, దాని వృద్ధిని గమనించేందుకు సోదర భాష అయిన కన్నడాన్ని కూడా నేర్చుకున్నారు.గురజాడ శాసన పరిశోధనల్లో యుద్ధమల్లుని బెజవాడ శాసన పరిష్కరణ ప్రధానంగా పేర్కొనదగినది. గురజాడకు శాసన పరిశోధనలలో గిడుగు వెంకట రామమూర్తి, వేటూరి ప్రభాకర శాస్త్రి, కొమఱ్ఱాజు లక్ష్మణరావు పంతులు, జయంతి రామయ్య పంతులు, కృష్ణశాస్త్రి, హెచ్. కృష్ణమూర్తి మొదలైన వారి సహకారం కూడా ఉండేది.

ప్రథమాంధ్ర కవి ఎవరు ? అన్న చర్చ విస్తృతంగా జరుగుతున్న ఆ రోజుల్లో కొత్తగా దొరికిన శాసనాలను గిడుగు వారితో కలిసి పరిశీలించిన పిదప నన్నయ కంటే పూర్వమే తెలుగు సాహిత్యానికి సుస్థిరమైన స్థానం ఉందని గురజాడ గుర్తించారు. బెజవాడ యుద్ధమల్లుని శాసనాన్ని పరిశోధించి అందలి లిపిని బట్టి, అది రాజరాజ నరేంద్రుని కన్నా ప్రాచీనమైనదని గురజాడ నిర్ధారించారు. ఐతే గురజాడ వారి ఈ అభిప్రాయంతో కాశీభట్ట బ్రహ్మయ్య శాస్త్రి, టేకుమళ్ళ రాజగోపాలరావు పంతులు, కోటేశ్వర శర్మ మొదలైన పండితులు ఏకీభవించలేదు. అందుకు గురజాడ అనేక చారిత్రక, శాసన ఆధారాలను చూపి తన వాదన నిజమని నిరూపించారు.

ఈ క్రమంలోనే గురజాడ యుద్ధమల్లుని బెజవాడ శాసనంతో పాటుగా రెండవ అమ్మరాజు వేయించిన మల్లియపూడి శాసనం, నెల్లూరి శాసనం, రాజరాజ నరేంద్రుని కోరుమిల్లి శాసనం, వేంగీ రాజైన మహదేవరాజు శాసనం, రెండవ పులకేశి సతారా శాసనం, పశ్చిమ చాళుక్య రాజైన ఆరవ విక్రమార్కుని శాసనాలను పరిశోధించారు.

యుద్ధమల్లుని సంతతికి చెందిన శాసనాలను గురజాడకు పూర్వమే ఇలియటు దొర. నూయల్ దొర వంటి పాశ్చాత్య పరిశోధకులు కొందరు పండితుల సహాయంతో పరిశోధించడానికి ప్రయత్నించినప్పటికీ సఫలీకృతులు కాలేకపోయారు. అందుకు కారణం 6-9 సంఖ్యల మధ్య వ్యత్యాసాన్ని లేఖకులు గుర్తించలేకపోవడమేనని గురజాడ పేర్కొన్నారు. అంతేగాక ఈ శాసనాలు శక సంవత్సరం ప్రకారం ఉండటం చేత పండితులు కూడా పొరబడ్డారని గురజాడ వివరించారు.

గురజాడ వారి శాసన పరిశోధనను ప్రోత్సహించిన వారిలో ఆనంద గజపతి రాజు కూడా ముఖ్యులు. అప్పటి విజయనగరం

మహారాజైన ఆనంద గజపతి చిన్నతనంలో తన పూర్వులకు సుబేదార్, మహామండలేశ్వర బిరుదులుండేవని విజయరామ గజపతి ద్వారా విని విన్నాడు. ఈ విషయంలో వాస్తవాలను తెలుసుకోవాలనే వాంఛ ఆనంద గజపతికి కలుగగా, దాన్ని పరిష్కరించుకోవడానికి ఆశ్రితుల సహాయం కోరారు. ఆ బృందంలో గురజాడ ప్రధానుడు.

అప్పటికే గురజాడ విజయ నగరం మహారాజా వారి కళాశాలలో చరిత్ర అధ్యాపకునిగా పని చేస్తున్నారు. ఈ పరిస్థితుల్లో పని ఒత్తిడి వల్ల గురజాడ ఆరోగ్యం క్షీణించింది. గురజాడ పరిశోధనలు భావితరాలకు ఎంతో అవసరమని గుర్తించిన ఆనంద గజపతి గురజాడను అధ్యాపక వృత్తి నుండి తప్పించి, నాటి నుండి సంస్థాన శాసన పరిశోధకునిగా నియమించారు. ఈ వెసులబాటు గురజాడ వారి పరిశోధనలకు ఎంతగానో ఉపకరించింది. తన పరిశోధనకు మెచ్చి అప్పట్లోనే మహారాజా వారు 2350 రూపాయిలను పారితోషికంగా ఇచ్చారని గురజాడ తన డైరీలో రాసుకున్నారు.

ఆనంద గజపతిరాజు 1897లో మరణించగా, సంతాన హీనుడౌట చేత విల్లు ప్రకారం అతని మేనమామ కొడుకుని దత్తత చేసుకొని స్వీకార మహోత్సవం జరిపించారు. అది చెల్లదని బంధువులు దావా వేశారు.గురజాడ సంస్థాన ఆంతరంగిక కార్యదర్శి కావడం చేత ఆ దావాలో వంశ పురుషుల వృత్తాంతాన్ని శాసన ప్రమాణాలతో సహా నిరూపించారు. అందుకుగానూ గురజాడ ఉషాభ్యుదయం, శ్రీకృష్ణ విజయం మొదలగు ప్రబంధాలను, విజయనగర రాజుల శాసనాలను పరిశోధించి దావాను విజయవంతంగా పరిష్కరించారు.

❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄

**ఆనంద గజపతిరాజు 1897లో మరణించగా, సంతాన హీనుడౌట చేత విల్లు ప్రకారం అతని మేనమామ కొడుకుని దత్తత చేసుకొని స్వీకార మహోత్సవం జరిపించారు. అది చెల్లదని బంధువులు దావా వేశారు.గురజాడ సంస్థాన ఆంతరంగిక కార్యదర్శి కావడం చేత ఆ దావాలో వంశ పురుషుల వృత్తాంతాన్ని శాసన ప్రమాణాలతో సహా నిరూపించారు. అందుకుగానూ గురజాడ ఉషాభ్యుదయం, శ్రీకృష్ణ విజయం మొదలగు ప్రబంధాలను, విజయనగర రాజుల శాసనాలను పరిశోధించి దావాను విజయవంతంగా పరిష్కరించారు.**

❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄❄

**2. చారిత్రక పరిశోధన :**

గురజాడ చరిత్ర అధ్యాపకుడు. విజయ నగర సంస్థాన పరిశోధకుడు కావడం చేత ఆయన ఇల్లే ఒక గ్రంథాలయంలా ఉండేది. తెలుగు - సంస్కృత సాహిత్య గ్రంథాలు, శిలా శాసనాల రికార్డులు గల ఎపిగ్రాఫికా ఇండికా, ఇండియన్ యాంటిక్వరీ వాల్యూములు, నెల్లూరు జిల్లా శాసనాలు, విజయ నగర సంస్థానానికి చెందిన శాసనాలు, విజయ నగర రాజుల బంధువుల వంశ వివరాలను తెలిపే పద్య కావ్యాలు, వచన గ్రంథాలు ఉండేవి. అందువల్లనే రాజులు, పండితులు చరిత్రకు సంబంధించిన సమాచార వివరాల కోసం గురజాడతో తరుచుగా ఉత్తర ప్రత్యుత్తరాలు జరిపినట్లు ఆయన లేఖల ద్వారా తెలుస్తుంది.

గురజాడ కళింగ చరిత్ర, ఆంధ్ర కవుల చరిత్ర రాయడానికి ఎంతో ప్రయాస పడ్డారు. కులాల చరిత్రలను కూడా శోధించాలని ఎన్నో ప్రయత్నాలు చేశారు. కానీ ఈ పరిశోధనల విషయంలో గురజాడ ప్రయాస సఫలం కాలేదు. అందుకు నాటి సంస్థాన వారసత్వపు తగాదా, గురజాడ వారి అనారోగ్యం, వ్యావహారిక భాషా ప్రయోగం అనేవి ప్రధాన ఆటంకాలయ్యాయి. ఈ చరిత్ర పరిశోధనలో గురజాడ వారి కృషిని గమనించిన ఆయన మిత్రులు ఆయనను ఎంతగానో ప్రోత్సహించారు. గురజాడ పరిశోధనా ఫలాలు భావి తరాలకు ఎంతో అవసరమైనవిగా గుర్తించి, వాటిని పూర్తి చేయడానికి తమ వంతు సహకారాన్నందించారు. అప్పట్లో ప్రముఖ శాసన పరిశోధకులైన హెచ్. కృష్ణశాస్త్రి గురజాడకు కావలసిన సామాగ్రిని అందజేస్తుండేవారు.

కళింగ దేశ చరిత్రను రాయడానికి గురజాడ సంకల్పించారు. అందుకు అవసరమైన శాసనాలను, రికార్డులను సేకరించి పరిశోధించారు. అన్ని వివరాలనూ సమీకరించి మంచి ప్రణాళికను కూడా సిద్ధం చేసుకున్నారు. ఐతే ఆ చరిత్ర రచనలో ప్రయోగించే భాష విషయమై గురజాడకు, కొమఱ్ఱాజు లక్ష్మణరావు గారికీ ఏకీభావం కుదరలేదు. గురజాడ వ్యావహారిక భాషలోనే రాయడానికి సంకల్పించగా, ప్రచురణ కర్తలైన కొమఱ్ఱాజు గారు అందుకు అంగీకరించలేదు. ఐనా గురజాడ తన ప్రయత్నాన్ని విరమించలేదు.

ఈ సమయంలోనే విజయ నగర సంస్థాన వారసత్వపు దావాలో తలమునకలైపోవడంతో గురజాడ వారి చరిత్ర రచనకు అంతరాయం ఏర్పడింది. దీనికి తోడు అనారోగ్యం కూడా ఆయనను తీవ్రంగా కృంగదీసింది. గురజాడ అనారోగ్యం నుండి కోలుకోలేకపోయారు. గురజాడ తన అవసాన దశలో కూడా ఈ చరిత్ర రచన విషయమై విపరీతమైన వేదన పొందినట్లు ఆయన మిత్రులకు రాసిన లేఖల ద్వారా అర్ధమౌతుంది. గురజాడ మరణాంతరం ఆయన మిత్రుడైన గిడుగు రామమూర్తి గారు దీన్ని సమకూర్చాలని ప్రయత్నించారు. కానీ పూర్తి చేయలేదు. ఈ కారణంగానే గురజాడ విశేషంగా పరిశోధన గావించిన పూసపాటి గజపతుల చరిత్ర గానీ, విశాఖ జిల్లా చాళుక్యుల చరిత్ర గానీ వెలుగులోకి తీసుకు రాలేకపోయారు.

ఆంధ్రకవులు రాసిన ప్రబంధాలలోని ప్రథమాశ్వాసాలలో కృతిపతి యొక్క కృతిభర్త యొక్క వంశావళులను వెల్లడి చేసే పద్యాలను తీసి, అందుండే చారిత్రక విషయాలను విడదీసి, శిలా శాసనాలలోని రాజుల, మంత్రుల జీవిత కాలాల ఆధారంగా ఆంధ్ర కవుల, వారి పోషకుల కాల నిర్ణయం చేసి కవుల చరిత్రను రాయడానికి కూడా గురజాడ ఉపక్రమించారు. ఐతే గురజాడ ఆ కవుల చరిత్రను పూర్తి చేయకముందే కందుకూరి వారి కవుల చరిత్ర వెలువడింది. కానీ ఈ రెండు కవుల చరిత్రలలోని కాల నిర్ణయాలలో కొంత భేద భావాలున్నాయి. ఆంధ్ర కవుల చరిత్రను పూర్తిచేసి ప్రచురించాలని

గురజాడ ఎంతో ప్రయత్నం చేశారు. కానీ ఈ ప్రయత్నం కూడా పూర్తి కాలేదు. ఆ ప్రణాళిక అలాగే మిగిలిపోయింది.

**3. భాషా పరిశోధన :**

గురజాడ పరిశోధనలన్నింటిలో కెల్లా తలమానికమైనది భాషా పరిశోధన. గురజాడ తన జీవిత కాలంలో అత్యంత విలువైన అత్యధిక సమయాన్ని కేటాయించింది భాషా పరిశోధనకే. అందుకు కారణం వాడుక భాషకు సాహిత్య గౌరవం కల్పించాలన్నదే గురజాడ ధ్యేయం. అప్పటి పాశ్చాత్య ఆంగ్ల విద్యా ప్రభావంతో తన చుట్టూ ఉన్న ప్రపంచంలో గురజాడను ప్రధానంగా ఆకర్షించినవి రెండే రెండు. ఒకటి భాష. రెండోది నాటకం.

ప్రపంచంలోని పలు దేశాల్లో భాషకు సంబంధించిన పరిణామాలను తనకు లభ్యమైన ఆధారాలను గురజాడ వారు సూక్ష్మంగా పరిశీలించారు. పొరుగు భాషలైన తమిళం, కన్నడం, బెంగాలీ భాషల్లోనూ, యూరోపియన్ భాషల్లోనూ సంభవించే మార్పులు – చర్చలు ఎలా జరుగుతున్నాయో ఎప్పటికప్పుడు ఉత్సుకతతో గురజాడ తెలుసుకునేవారు. ఈ సమాచారం కోసం వివిధ ప్రాంతాలకు చెందిన భాషాశాస్త్ర వేత్తలతో పరిచయాలేర్పరచుకొని వారి నుండి ఉత్తర ప్రత్యుత్తరాల ద్వారా సమాచారాన్ని సేకరించి అవగాహన చేసుకునేవారు. అంతర్జాతీయ పత్రికల్లో వెలువడే భాషా విశేషాలను అధ్యయనం చేసేవారు. దీని వెనుక ఉన్న బలమైన కారణం ఒక్కటే. తెలుగును నిత్య నూతనంగా, సజీవ భాషగా నిలపాలన్నది గురజాడ వారి ఆకాంక్ష.

సాహిత్యం, విద్య సమాజంలోని కొందరి సొత్తుగా భావించడాన్ని గురజాడ ఆక్షేపించారు. అవి సమాజంలోని అన్ని మూలలకు వ్యాపించాలని, అందుకు వ్యావహారిక భాషే సరియైన సాధనమని గురజాడ వారి వాదన. ఈ ప్రయత్నంలో గురజాడకు గ్రాంథిక భాష వాదుల నుండి తీవ్ర ప్రతిఘటన ఎదురైంది. దీన్ని ఎదుర్కొనే ప్రయత్నంలోనే విస్తృతమైన భాషా పరిశోధన చేశారు. ఆ పరిశోధనకు ప్రతి రూపమే 'అసమ్మతి పత్రం'

ఈ పత్రంలో గురజాడ చేసిన భాషా పరిశోధన చారిత్రకమైనది, వర్ణనాత్మకమైనది, తులనాత్మకమైనది, అనువర్తితమైనది. గురజాడ అసమ్మతి పత్రంలో భాషకు సంబంధించిన ప్రతీ సూక్ష్మాంశమూ పరిశీలించబడింది. దీన్ని చదివే కొద్దీ కొన్ని అంశాలను సూక్ష్మాతి సూక్ష్మంగా, ఇంత విస్తృతంగా ఎలా చర్చించగలిగారా! అనే ఆశ్చర్యం కలుగకమానదు. ఒక ప్రత్యేకమైన పరిశోధన చేయగలిగినంత విషయ ప్రాధాన్యత కలిగినటువంటిది ఈ 'అసమ్మతి పత్రం'.

ఇంటర్మీడియట్ పరీక్షల్లో విద్యార్థులు రాసే సమాధాన పత్రాలలో అనుమతించదగిన తెలుగు భాషా శైలి ప్రమాణాన్ని నిర్ణయించడానికి మద్రాసు విశ్వ విద్యాలయం 1911వ సంవత్సరంలో ఒక సంఘాన్ని నియమించింది. అందులో గురజాడ కూడా సభ్యులు. ఈ విషయమై అనేక తీవ్ర వాదోపవాదాలు, తర్క వితర్కాలతో సుదీర్ఘమైన చర్చలు జరిగాయి. అనంతరం 1914లో ఈ సంఘం తీసుకున్న నిర్ణయాలు విద్యాభివృద్ధికి మేలు చేయకపోవడమే కాకుండా, తప్పక కీడు చేస్తాయని నిరూపిస్తూ విశ్వ విద్యాలయానికి గురజాడ సమర్పించిన విశ్లేషణాత్మక – పరిశోధనాత్మక నివేదికయే 'అసమ్మతి పత్రం'.

సాహిత్య రచనలో వ్యావహారిక భాష ప్రయోగాన్ని నిరసిస్తూ లక్ష్మణరావు గారు 'గ్రామ్య రూపాలన్నీ దేశంలోని ప్రతి ప్రాంతంలోనూ వాడుకలో ఉన్నాయన్న' గురజాడ వాదనను ఆక్షేపించారు. (అపుడు గ్రాంథిక భాషా వాదులు వ్యావహారిక భాషకు పెట్టిన పేరు 'గ్రామ్యం') అందుకు గురజాడ 'అవిస్త' అన్న సంయుక్త హల్లు ఉండే క్రియా రూపాలను వందల కొలది ఉదాహరణలిచ్చారు. (వస్తూ, చేస్తే, చూస్తూ, రాస్తూ, ప్రార్థిస్తూ మొదలైనవి). అతి ప్రాచీన కాలం నాటి శాసనాది సాహిత్య గ్రంథాలు మొదలుకొని తన కాలం వరకు గల రచనల్లో ఆ ప్రయోగం ఎంత విస్తృతంగా వాడబడిందో వందల కొద్ది ఆధారాలతో నిరూపించారు.

సాహిత్యంలో వ్యావహారిక భాషను ఉపయోగించడం ద్వారా భాషకున్న పవిత్రత, పటుత్వం పోయి సాహిత్యం సామాన్య స్థితికి దిగజారుతుందనేది గ్రాంథిక భాషా వాదుల వాదన. ఈ భ్రమను పోగొట్టడానికి గురజాడ ప్రపంచంలోని పలు భాషల వికాసాన్ని చారిత్రక ఆధారాలతో వివరించారు. ఇలాంటి గ్రాంథిక భాషా వాదున ప్రతి దేశంలోనూ ఉన్నదేననీ, ఈజిప్టు – యూరోపిన్ భాషలలో కూడా ఆరంభంలో ఇలాంటి ప్రతిఘటనలే ఎదురయ్యాయని గురజాడ ఉదాహరణలను చూపించారు. ఐతే కాల క్రమంలో ఆయా దేశాలలో వ్యవహారిక భాష సాధించిన ఫలితాలను, వికాసాన్ని చూపిన పిదప వారు తమ అభిప్రాయాలను మార్చుకున్నారని కూడా అసమ్మతి పత్రంలో వివరించారు.

అసమ్మతి పత్రం వ్రాయడానికి పూర్వమే మన భాషలో సంస్కరించుకోవాల్సిన సందర్భాలను తరుచుగా మిత్రులకు లేఖల ద్వారాను, వ్యాసాల్లోనూ గురజాడ సూచిస్తూ ఉండేవారు. వ్యాకరణబద్ధంగా రాయాలనే పండితులే ఎన్ని రకాలుగా వ్యాకరణ నియమాలను ఉల్లంఘించారో వారి రచనల నుండే ఉదాహరణలు చూపారు. వాడుక భాషకు 'గ్రామ్యం', 'మ్లేచ్ఛం' అనే పేర్లు పెట్టి హేళన చేసే గ్రాంథిక వాదులు, అసలు ఆ పదాలనే ఎంత తప్పుగా అర్థం చేసుకున్నారో చూపించడానికి పతంజలి 'మహాభాష్యం' మొదలుకొని పలు వ్యాకరణ గ్రంథాల నుండి ఉపపత్తులు చూపిస్తూ అసలు అర్థాన్ని గ్రహించమన్నారు.

గురజాడ అప్పారావు పరిశోధనా కృషి అపారం. విద్య, భాష, చరిత్ర, సాహిత్యం, శాసనాలు, నాటక రంగం మొదలైన విషయాలకు సంబంధించి అప్పారావు చేసిన పరిశోధన అపరిమితమైనది. కానీ మనకు అందిన ఫలాలు పరిమితమే. అయినప్పటికీ అవి ప్రామాణికంగా చరిత్రలో నిలిచిపోయాయన్నది గమనార్హం.



# (వ) రేవ్ !

గుర్రాల రమణయ్య
9963921943

నీపిచ్చి గానీ
దాటి వచ్చిన కాలాన్ని
గతించిన వసంతాన్ని
సాగిపోయిన ప్రవాహాన్ని
మళ్ళీ తిరగదోడటం దేనికి ?
ఒకే మాటని
తిప్పి తిప్పి చెప్పటం
ఒకే పాటని రీమిక్స్ చేసి పాడటం
నిన్న వేసిన పాత గెంతుల్ని
అటూ యిటూ జేసి
మళ్ళీ మళ్ళీ వేయటం
కొత్తగా భ్రమించటం తప్పితే
మరేమీ కాదని మీకూ తెలుసు
మొన్నటి దాకా క్లబ్బులని
నిన్నంతా పబ్బులని
ఆనందానికి తారుపూసి
అదే అసలు రహదారని
ఎండమావుల్ని జీవననదిగా
భ్రమించి పరిభ్రమిస్తూ
జీవితానికి ముడివేసి
ఎంతకాలం యీ చాంచల్యం ?
మనిషి శిఖరం ఆలోచన
శిఖరాన్ని అధిరోహించటం వివేచన
అడుగు దొరికితే తెలివిడి
అడుగు జారితే పతనం
పతనానికి ప్రయాణమైతే
ఎల్.ఎస్.డి కొకైన్‌ల సావాసమైతే
రేపులేని రేవ్ పార్టీల్లో
మత్తునే గమ్మత్తు అనుకుంటూ
మనిషినీ సంస్కృతినీ తగలెడుతూ
ఏమో ?
ఒరేయ్ మిత్రమా !
అధః పతనమే ఆఖరి మజిలీనా ?



# నేను - పాప

సైదులు ఐనాల
9948714105

మా చుట్టూ మూగిన ప్రపంచం
నేను
పాపతో
విస్తరించిన ఆకాశం
-0-
అక్షరం నేర్పాలని నా ఆరాటం
అనంత లోకాలూ తన గుప్పెట్లో ఒదిగాయని తెలియక
-0-
ఇంట్లో గజ్జల చప్పుడు
అందరి మోముపై నవ్వులు
తిరిగాడే దేవత పాపాయి తాత మురిపాలు
-0-
మంచు తెరల్లో
ఆ
ఆకు మీది
చివరి చినుకుపై నా చూపు
విచ్చుకున్న పాప మొఖం
-0-
సప్తసముద్రాలూ ఒకేచోట
కను రెప్పలచాటుగా...
పాప అలిగింది
-0-
పెన్సిలు - పేపరు
చాక్నారు - రబ్బరు
అటు ఇటు కుస్తీ పడ్తూ దోస్తీ
ఎంతసేపయిందో...
నిప్పులుకక్కే సూర్యున్ని
మడిచి గౌను జేబులో దూర్చింది
విజయ దరహాసం పాప మొఖంలో....



# నానీలు

నాగిశెట్టి
9849298233

సాటి కాకి దెబ్బకు
ఒక రకం
ఎద్దు పుండుకు మరో రకం
'కాకుల' నైజం

ఇప్పుడు కావాల్సింది
ట్రూ డిటక్టర్సే
రాళ్లలో
బియ్యమేరినట్టు

అవినీతికి
నాలుగు దిక్కులూ చాల్లా
'గని'ని తవ్వి
లోతెంతో చూడాల్సిందే

బతుకు చిత్రం
అలనాటి అమ్మా-నాన్న ఆటే
ఊహల మేడ
ఉత్తుత్తి కూడు

పంచన వ్రేలాడే
కంకుల గుత్తే సాక్షి
రైతు వెలుగు
అందరికీ వెలుగే

అక్కరకు
పాతరలో వడ్లు
కడుపున దాచి
పెట్టటమంటే ఇదేనేమో !



# గురజాడ రచనలు - సంఘసంస్కరణ



డా॥ పొన్నంరెడ్డి కుమారి నీరజ

"యెక్కడనా వొక చెట్టు మాటున / నొక్కకోకిల పలుకసాగెను" (ముత్యాల సరములు)

"ప్రేమ నిచ్చిన ప్రేమ వచ్చును / ప్రేమ నిలిపిన ప్రేమ నిలుచును" (కాసులు)

"దేశమంటే మట్టికాదోయి / దేశమంటే మనుషులోయి ?" (దేశభక్తి) అంటేనే గుర్తొచ్చేది గురజాడ. వెంకట రామదాసు, కౌశల్యమ్మ దంపతులకు 1862 సెప్టెంబరు 21న విశాఖజిల్లా, ఎలమంచిలి తాలుకా, రాయవరం గ్రామంలో జన్మించిన ఈయనకు 150 వసంతాలు.

సమాజాన్ని మేల్కొల్పిన కోడి, ప్రేమగా సంస్కరించిన కోకిల 'గురజాడ'. ఇప్పటి వరకూ తెలుగు సాహిత్యంలో జరిగిన మార్పులు రెండనుకుంటే అందుకు కారకులు ఇద్దరు. ఒకరు నన్నయ. మరొకరు గురజాడ.

కందుకూరి సాంఘిక విప్లవాన్ని గిడుగు భాషా విప్లవాన్ని తనలో సమన్వయించుకుని సరికొత్త సాహిత్య విప్లవాన్ని లేవనెత్తిన నవయుగ వైతాళికుడు గురజాడ. ఈయన చేతి చలువతో అస్పృశ్యంగా పడివున్న వాడుకభాష అందలమెక్కింది. ఆంధ్రభారతి కొత్తగా 'ముత్యాల సరాల' నలకరించుకుంది.

ఈయన తొలినాళ్లలో సాంప్రదాయ రీతిలో, ప్రాచీన వృత్తాల్లో ఖండకావ్యాలు రాసినా తర్వాత తనను తాను సంస్కరించుకొని ఆధునిక పద్ధతిలో రచన చేయడం ప్రారంభించారు. ఇందుకు పాశ్చాత్యుల ప్రభావమే కారణం కావచ్చు.

సమాజాన్ని వదిలి సంచరించిన కవులకు స్థానం ఉండదు. గురజాడ సంఘంలోని దురాచారాల్ని గమనించి, వారి భాషలో, సుకుమార భావాలతో చక్కని శైలిలో రచనలు చేశారు కాబట్టే ఆయన చిరస్మరణీయులు.

ఈయన గొప్ప మానవతావాది, సంఘ సంస్కర్త. ఆ విషయం ఈయన కవితలు, ఇతర రచనల ద్వారా వ్యక్తమౌతుంది. ఇందుకు వీరి నాటకాలు, కథలు, కవితలే నిదర్శనం.

అప్పటి సమాజంలో ఎన్నో మూఢ నమ్మకాలు, కన్యాశుల్కం, అస్పృశ్యత, బాల్య వివాహాలు, విగ్రహారాధన, అధికార మదాంధత్వం, వేశ్యా వ్యామోహం వంటి ఎన్నో సమస్యలుండేవి. వీటిని ప్రజల భాషలో ప్రజలకు తెలిపి వారిని మేల్కొల్పిన మనీషి గురజాడ.

**బాల్య వివాహాలు / కన్యాశుల్క నిరసనం :** ప్రస్తుత వరకట్న సమస్యకంటే భయకరమైనది నాటి కన్యాశుల్క సమస్య. కాసుకులోనై కన్యలను ముసలి వాళ్ళకు ముడేసే సాంఘిక దురాచారాన్ని ఈయన ఖండించారు. కన్యాశుల్కాన్ని నిరసిస్తూ ఆయన రాసిన గొప్ప నాటకం 'కన్యాశుల్కం'.

ఈ నాటక రచనా కాలానికి తండ్రి వయసో, తాత వయసో వున్న భర్తలకు భార్యలైపోయిన పిల్లలు యుక్త వయసుకు రాకముందే విధవలైపోవడం, శరీర వాంఛలకు తట్టుకోలేక కాలు జారడం, మోసపోయి లేచిపోవడం, గర్భధారణం, అప్రతిష్టను తప్పించుకోడానికి ఆత్మహత్య లేదా గర్భస్రావం, బెడిసికొడితే ప్రాణహాని, పుట్టింట్లో, అత్తింట్లోనూ యావజ్జీవ బానిసత్వం వంటివి ఆనాటి సమాజంలో ఉన్న సమస్యలు.

'కన్యాశుల్కం' నాటకంలో కన్యాశుల్క వివాహాలు ప్రధాన విషయమైతే, విధవా వివాహ సమస్య అంతర్నాటకం, అంతర్లీనంగా వేశ్యా సమస్య కనిపిస్తుంది.

మూర్ఖుడు, ధనాశపరుడైన అగ్నిహోత్రావధాన్లు తన పెద్ద కూతురు బుచ్చెమ్మను ముదుసలికిచ్చి వివాహం చేసి విధవను చేస్తాడు. అయినా బుద్ధి రాని అతడు రెండో కూతురు సుబ్బమ్మనూ దాదాపు ఏనభైఏళ్ల లుబ్ధావధాన్లకు అమ్ముకోవడానికి బేరం కుదుర్చుకుంటాడు రెండవ భార్యగా.

అగ్నిహోత్రావధాన్ల దురాగతాన్ని ఎలాగైనా ఆపమని, బిడ్డను కాపాడమని అతని భార్య వెంకమ్మ తన సోదరుడు కరటకశాస్త్రిని అభ్యర్థిస్తుంది. అతను తన శిష్యునికి స్త్రీవేషం వేసి నీచుడైన లుబ్ధావధాన్లు దగ్గర తక్కువ కన్యాశుల్కం తీసుకుని వివాహం జరిపించి సుబ్బమ్మను కాపాడుతాడు.

కన్యాశుల్క వివాహం వల్ల బాల్యంలోనే విధవలైపోయి తర్వాత వ్యభిచారానికి దిగిన పూటకూళ్లమ్మ, లుబ్ధావధాన్ల కుమార్తె మీనాక్షి పాత్రల ద్వారా విషాదపర్యవసనాల్ని చిత్రిస్తారు గురజాడ.

'ముసలి పులి'గా పేరు పడిన వృద్ధ భర్త చేతిలో చిక్కుకున్న అందమైన పడుచు పెళ్ళాం పడేపాట్లు అనుమానంతో ముసలి భర్త పెట్టే హింసలు, చేసే అవమానాలను 'మెటిల్డా' కథలో చిత్రిస్తారు. (మెటిల్డా' యూరిపోయిన్ సాహిత్యంలో దీనావస్థలో ఉన్న పాత్రపేరు)

మెటిల్డా గుమ్మంలోకి రాకూడదు. ఎవరినీ చూడకూడదని ఆంక్షలు పెడ్తాడు. దారిన పోయే కుర్రాడు చూశాడని అతన్ని పిలిచి "ఈ ముండని తీసుకుపో నీకు దానం చేశాను. తీసుకుపో! నాకు శని విరగడైపోతుంది" అంటాడు.

అతను పెట్టే హింసలు భరించలేక ఒకరోజు 'మెటిల్డా' ఇంట్లోని బ్రాహ్మణుడితో "మీరూ, మీ నేస్తులూ నాకాపరం మన్న నివ్వరా ? మీకు నేనేం అపకారం చేశాను? తల వంచుకు మీ తోవను మీరు పోతే నే బతుకుతాను, లేకపోతే నా ప్రారబ్ధం" అని ఆ కుర్రాడికి లేఖ పంపుతుంది.

కాటికి కాళ్ళు చాచుకున్న ముసలి పెళ్లి కొడుకులకు పసిపిల్లల్ని డబ్బు కక్కుర్తితో అమ్ముకోవడం 'నరమాంస విక్రయం' గురజాడ దృష్టిలో సమాజాన్ని అప్రతిష్ట పాలు చేయడమే. ఆ విషయం అందరూ గుర్తించాలని సుకుమారంగా చెప్తారు.

బంగారు దుర్గను పూలూ పళ్లతో భక్తిగా కొలిచే 'పూర్ణమ్మ'ను
"కాసుకు లోనై తల్లీ తండ్రీ
నెనరూ న్యాయం విడనాడి
............................
ముదుసలి మొగుడుకు ముడివేస్రీ" (పూర్ణమ్మ) అంటాడు.

ఆటపాటల వయసులో తోటి పిల్లలు నీ 'మొగుడు తాత' అని ఎగతాళి చేస్తే అమ్మా నాన్నే అంటగట్టాక ఆ బాధను పెద్ద దిక్కైన దుర్గకు చెప్పుకుంది.

పూర్ణమ్మను అత్తవారింటికి తీసుకుపోయే సందర్భంలో పెద్దలకు, తల్లిదండ్రులకు నమస్కరించగా

"తల్లీ దండ్రీ దీవించ్రి
దీవనవింటూ పక్కుననవ్వెను

పుత్తడి బొమ్మా పూర్ణమ్మ" ఆ నవ్వులోని అంతరార్థం ముసలి వాడితో పెళ్లి చేస్తే పిల్లా పాపలతో దీర్ఘ సుమంగళిగా ఎలా బతకడం అని.

పూర్ణమ్మ అత్త వారింటికెళ్తూ సమాజానికి గొప్ప సందేశమిస్తుంది.

"నలుగురు కూచుని నవ్వే వేళల
నాపేరొకతరి తలవండి
మీ మీ కన్న బిడ్డల నొకతెకు ప్రేమను నాపేరివ్వండి"

ఈ మాటల ఆంతర్యం తాను అన్యాయమైపోయానని, ఏ తల్లీ తండ్రీ ఇలాంటి పని మళ్లీ చేయకూడదని.

**మూఢ విశ్వాస నిరసనం :** ఒకప్పుడు సమాజంలో 70, 80 సం॥లకు ఒకసారి కన్పించే తోకచుక్కంటే ప్రజలకు భయం. అది కన్పించడంవల్ల దాన్ని చూడడం వలఏదో కీడు సంభవిస్తుందని, అరిష్టం జరుగుతుందని ప్రజల నమ్మకం.

ఆ భయాన్ని పోగొట్టడానికి కవి చాలా సున్నితంగా తన భార్యకు చెప్తున్నట్లు తోకచుక్కను "కాముబాణంగా".. "వేల్పులలనల కేలి వెలితొగ" గా అభివర్ణిస్తాడు.

"ధూమ కేతువు కేతువనియో
మోము చందురుడలిగి చూడడు?" (ముత్యాలసరాలు)

కేతువని భయపడి చూడటం లేదేమో ! అది ఎలాంటి అరిష్టాన్నీ కల్గించదనీ, భూమికి దూరపు బంధువనీ, అప్పుడప్పుడూ అలా చూసి వెళ్ళడానికి వస్తుందనీ చెప్తాడు.

ప్రజలు చదువు లేకపోవడం వల్ల తోకచుక్కను చూసి భయపడి కీడుగా భావించుకున్నారని

"చన్న కాలపు చిన్నబుద్ధులు
బెదిరి యెంచిరి కీడుగా" అంటూ దాన్ని (ముత్యాలసరాలు)

'నింగి తొడవు'గా ఉత్ప్రేక్షించారు. తాను దాన్ని సంఘ సంస్కరణ ప్రయాణ పతాక'గా భావిస్తానని ప్రవచించారు.

ఆంగ్ల భాషా పఠనం వల్ల తనకీ విషయం తెలిసిందనీ, బ్రిటిష్ వారు 'కల్లనొల్లరు" అనీ అంటారు.

**అస్పృశ్యతా నిరసనం :** అంటరానితనం అనే వర్ణం అధర్మంగా వచ్చిందని, అలాంటి భావం తొలగిపోవాలని అంటారు.

గాంధీజీ హరిజనోద్యమం ప్రారంభించకముందే ఈయన 'లవణరాజుకల'లో "మలిన చిత్తులకు" అగ్రకులాలు, "మలిన వృత్తులకు" నీచకులాలు విధించిన 'వర్ణధర్మం అధర్మం' అంటారు. అందుకే

"మలిన దేహాల మాలలనుచును
మలిన చిత్తుల కధిక కులముల
నెలవొసంగిన వర్ణ ధర్మ మధర్మంబే" (లవణరాజుకల) అని

'మాల' అన్న భేదం కులాన్ని బట్టి గాక మనసునుబట్టి కలగాలని

ప్రతిపాదించి ప్రాచీన వర్ణ వ్యవస్థను ఖండించారు.

మంచి, చెడు అనేవి రెండే కులాలని

"మంచి చెడ్డలు మనుజులందున

యెంచి చూడగ, రెండె కులములు

మంచి యన్నది, మాలయైతే మాలనే అగుదున్" అని మంచి మాలయైతే మాలనేనవుతానంటాడు.

జాతిబంధాలన్న గొలుసులు జారిపోవాలనీ, మతాలన్నీ మాసిపోయి జ్ఞానం ఒక్కటే నిలిచి వెలుగుతుందని, వర్ణ భేదాలన్నీ కల్ల కావాలనీ, ఎల్ల లోకము ఒక్క ఇల్లుగా ఉండాలని ఈయన ఆశ. ఇది వసుధైక కుటుంబ భావానికి ప్రతిధ్వని. ఇందుకు సహపంక్తి భోజనాలు బాగా సహకరిస్తాయన్నాడు.

మాలలని దూరంగా ఉంచడానికి కారణమైన మలిన వృత్తులను గురువు దయవల్ల మానేశానని

"మాలనైనను మలిన వృత్తులు

మానుకుంటిని గురువు దయచే" (లవణరాజుకల) అని గౌరవ ప్రదమైన వృత్తి "పశుల మేపుచు పొట్టపోషింతున్" అంటాడు.

మతాలు వేరైనా మనసులొకటవ్వాలనేది ఆయన కోరిక.

"మతం వేరైతేను యేమోయి ?

మనసు లొకటై మనుషులుంటే" (దేశభక్తి)

లోకాలన్నీ ఒకే కుటుంబంలాగా ఉండి. వర్ణభేదాలు మాసిపోవాలని

"యెల్లలోకము వొక్కయిల్లై

వర్ణ భేదములెల్ల కల్లై" (ముత్యాల సరాలు) ప్రేమగా ఉండాలన్నది ఈయన ఆకాంక్ష.

అధికార మదాంధతను నిరసించడం : భుజబలంతో, అధికార దాహం, ధన దాహంతో పదవినలంకరించిన వారికి మంచీ చెడూ తెలియవు. అధికార మదాంధుడైన రాజు ప్రవర్తనను చేష్టలుడిగిన జనాన్ని 'కన్యక' నిందిస్తుంది.

"రాజు తలచిందేను ధర్మం

రాజు చెప్పిందెల్ల శాస్త్రం" అన్న రాజులున్న ఆ రోజుల్లో పెళ్ళైన స్త్రీకి, పెళ్లికాని స్త్రీకి రక్షణ కరువే. భార్యైనా, బిడ్డైనా రాజుకన్ను పడితే

"డేగ పిట్టను పట్టి విడుచున?

కన్నె యింటికి మరలి నడచున" అన్నట్లు అతని వశం కావాల్సిందే. దైవకార్యం నెరవేర్చడానికి వెళ్తున్న సెట్టి కూతుర్ని పట్టుకోవడానికి వస్తే ఎవ్వరూ అతన్ని ఎదురించలేకపోయారు.

"వీర్య మెరగక, విద్య నేర్చక బుద్ధి మాలినచో

కలగవా యిక్కట్లు?......... అని డబ్బు కోసం, పదవి కోసం అడ్డదారులు తొక్కి నీతి లేకుండా ప్రవర్తించవద్దని మంచి బుద్ధితో

"రాజులై మనుదయ్య" అంటుంది.

మన కులంలో భార్య పిల్లలను కాపాడుకునే ఆశకూడా లేదని తనవారితో

"అన్నలారా తండ్రులారా

ఆలకించండొక్క విన్నప

మాలు బిడ్డల కాసుకొనుటకు

ఆశలేదొక్కొ కులము లోపల?" అని వాపోతుంది.

తనను కాపాడటం ఎవరివల్లా కాదని తెలుసుకున్న కన్యక, రాజు నుండి తప్పించుకోవడానికి వీల్లేదని "పట్టమేలే రాజువైతే పట్టునన్నిపు" డంటూ ఆత్మాహుతి చేసుకుంటుంది.

విగ్రహారాధన నిరసన : మనిషితోటి మనిషినీ, అతని సాధక బాధకాలను గుర్తించడు కానీ గుడిలోని ప్రతిమల కోసం ఎన్నో చేస్తాడు.

ప్రాణమున్న 'మనిషి' ఆ ప్రతిమకంటే తక్కువ కాదంటాడు. ముక్తికోసం కొండ, కోనలకు వెళ్ళడం అనవసరం అంటాడు. ఎదురుగా ఉన్న 'మనిషి'లో దేవున్ని చూడమంటాడు.

"మనిషి చేసిన రాయి రప్పకి

మహిమ కలదని సాగి మొక్కుతు

మనుషులంటే రాయి రప్పల కన్న కనిష్టం

గాను చూస్తావేల బేలా ?

......................

కన్ను తెరిచిన కానబడడో ?

మనిషి మాత్రుడియందు లేడో ?

యెరిగి కోరిన కరిగి యీడో ముక్తి" అంటాడు.

వేశ్యావృత్తి, నిరసనం : వ్యభిచారం ఒక వృత్తిగాను, కులంగానూ ఉంటూ ఉన్న కాలం. వేశ్యల పట్ల వ్యామోహం విద్యావంతుల్లోనూ, ధనవంతుల్లోనూ ప్రబలంగా ఉండేది. వేశ్యా సంపర్కాన్ని ఒక ఘనకార్యంగా చెప్పుకునేవారు. ఇలాంటి వ్యామోహంలో పడి పెడదారి పడుతున్న భర్తకు భార్య బుద్ధి చెప్పి 'దిద్దుబాటు' చేస్తుంది.

పది రోజుల్నుండి ఇంటికి రాని భర్త మీటింగులు, ఉద్యమాల ద్వారా లోకోపకారం చేస్తున్నానని అబద్ధాలు చెపితే విషయం తెలుసుకున్న భార్య పుట్టింటికి వెళ్తున్నట్లు ఒక లేఖ రాసి మంచం కిందే దాక్కుని అతని మనోవేదనను పని వాడికి చెప్పుకుంటుంటే విని కిలకిలా నవ్వుతుంది. అతనిలో మార్పు తీసుకొస్తుంది.

'సరళ' మధురవాణిలా వేశ్యపాత్ర. గత్యంతరం లేక చేస్తోన్న వేశ్యా వృత్తి. పెళ్లి చేసుకుని సంసారిగా జీవించాలన్న కోరిక. వేశ్యల్ని లేవనెత్తాలన్న సత్సంకల్పం వున్న ప్రొఫెసర్ నిష్టచెడి తానే వెల్లకిల పడిపోవడం ఈ కథలోని (సంస్కర్త హృదయం) సంగతులు.

"నాబోటి భోగం పిల్లను ఏ మర్యాదస్థుడు పెళ్ళాడతాడో చెప్పండి.." అంటూ సరళ తనను సంస్కరించాలనుకున్న రంగనాథం మాస్టరుతో వాపోతుంది.

సమాజంలోని దురాచారాల్ని సుతిమెత్తగా నిరసించిన ఈయన మహానుభావుడు. ఈయన ప్రభావం తర్వాత ఎందరో కవులపై పడింది. ఈయన నడిచిన మార్గంలో నడిచిన వారెందరో. అందుకే అంటాడు శ్రీశ్రీ "అడుగుజాడ గురజాడది" అని.



కథ

# అన్య- అనన్య

ఎ. రవీంద్రబాబు

9848425039

రాత్రి... సమయం ఒకటిన్నర దాటి నాలుగు నిముషాలు అయి ఉంటుంది. అనన్య తన బెడ్‌రూంలో కళ్ళు తెరిచింది. కళ్లు తెరిచింది అంటే అప్పటి వరకు నిద్రపోయింది అని కాదు. కళ్లు మూసుకొని ఏవో ఆలోచనల్లో మునిగి ఉంది అని అర్థం. చిన్నగా నడుచుకుంటూ బెడ్‌రూమ్‌లో నుంచి బైటకొచ్చింది. మమ్మీ, డాడి గది దగ్గరకొచ్చింది. తలుపు వేసుంది. వాళ్ళు నిద్రపోతున్నారని నిర్ణయించింది. మెల్లగా నడుచుకుంటూ హాల్లో ఉన్న టివీ దగ్గరకొచ్చింది. టీవీ స్టాండ్ డస్క్‌లో ఉన్న కటింగ్‌బ్లేడ్, స్క్రూడ్రైవర్ తీసుకుంది. శబ్దం రాకుండా జాగ్రత్తగా టీవీ విప్పింది. లోపలున్న వైర్లను చూసింది. అప్పటి వరకూ మామూలుగున్న అనన్య ముఖం కోపంతో రంగుమారింది. ఏదో ఆవహించినట్లైంది. పళ్లు కొరికింది. చేత్తో ముఖాన్ని కసిగా కొట్టుకుంది. కటింగ్‌బ్లేడ్‌తో వైర్లను ఇష్టమొచ్చినట్లు కత్తిరించింది. కసి తీరక పిచ్చిపిచ్చిగా అటు ఇటు పికింది. మళ్లీ నెమ్మదిగా టీవీని బిగించింది. ఒకసారి చూసి నవ్వుకుంది. ఏమీ తెలీనట్టు అన్నీ ఎక్కడివక్కడపెట్టి ముసిముసిగా నవ్వుకుంటూ తన బెడ్‌రూమ్‌లోకి వెళ్ళి పడుకుంది. కళ్లు మూసుకుంది. హాయిగా నిద్రలోకి జారుకుంది.

తెల్లవారి ఉదయాన్నే ఏడు గంటలకల్లా అనన్య వాళ్లమ్మ లత టీవీ ఆన్ చేసింది. రాలేదు. "ఏమండీ టీవీ రావట్లేదు చూడు" అని అనన్య వాళ్ల నాన్న వినోద్‌ను కేకవేసింది. షేవింగ్ చేసుకుంటున్న వినోద్ అట్లానే వచ్చాడు. "అదేంటి... రాత్రి బాగానే వచ్చింది కదా... పైగా నైన్ ఓ క్లాక్‌కు అనన్య ఇంటర్‌వ్యూ వస్తుంది కదా.." అంటూ కంగారుగా రెండు మూడు సార్లు రిమోట్ నొక్కి చూశాడు. చివరకు టీవీ నట్లు విప్పి చూశాడు. లోపల రాక్షసి జుట్టు విరబోసుకున్నట్లు వైర్లన్నీ తెగి ఉన్నాయి. ఇద్దరికీ అర్థం కాలేదు ఏందుకిలా అయింది అని. "ఎవరు చేసి ఉంటారు? ఎవరు చేసి ఉంటారు?" అనుకున్నారు. కంగారు పడ్డారు. ఆ పై భయపడ్డారు.

అనన్య తన రూమ్‌లో నిద్రపోతూనే ఉంది. నిద్రలో హాయిగా నవ్వుకుంటుంది.

***

ఇంట్లో ఎవ్వరూ లేరు. లత, వినోద్ బయటకెళ్లారు. అనన్య తండ్రి రూమ్‌లోకెళ్ళింది. కంప్యూటర్‌ను ఆన్ చేసింది. అన్ని ఫోల్డర్స్ ఓపెన్ చేసింది. వినోద్ తయారు చేసిన ఎన్నెన్నో బట్టల డిజైన్స్. తయారు చేసినవి కొన్ని. చెయ్యాలనుకున్నవి కొన్ని. అందులో అనన్య అనే ఫోల్డర్ ఓపెన్ చేసింది. తను పుట్టినప్పటి నుంచి ఇప్పటి వరకు అంటే పదమూడేళ్లు– కూతురు కోసం వినోద్ తయారు చేసిన అన్ని డిజైన్స్ ఉన్నాయి. ఒక్కొక్కటీ చూసింది. ఒక్కో దాన్ని కోపంగా చూసింది. భయంగా చూసింది. సిగ్గుగా చూసింది. బాధగా చూసింది. విరక్తిగా చూసింది. అందులో ఓ డ్రస్... తనకు, తన డాన్స్‌కూ, తన పాటకు పేరు తెచ్చిన డ్రస్. ఎదిగీ ఎదగని తన అందాల్ని బహిర్గతం అవ్వి అవకుండా ఉండేలా తన తండ్రే తయారు చేసిన డ్రెస్. దాన్ని చూసింది. అంతే తెల్లటి అనన్య ముఖం జేవురు రంగుగా మారింది. పళ్ళు కొరికింది. కళ్లు చింతనిప్పుల్లా ఎర్రబడ్డాయి. కంట్రోల్, ఆల్ట్, డిలిట్ కొట్టింది. విజయంతో నవ్వుకుంది. తర్వాత ఒక్కో ఫోల్డర్‌ను తీసేసింది.

తన డ్రస్ డిజైన్స్ ఉన్న సిడీలన్నిటినీ ముక్కలు చేసింది. తర్వాత కంప్యూటర్ సి.పి.యు విప్పింది. లోపల వైర్లన్నీ కత్తిరించింది. మరికొన్ని వస్తువుల్ని విరిచింది. మళ్లీ బిగించింది. ఏమీ తెలీనట్టు తన రూమ్‌కొచ్చింది. కొద్దిసేపు పడుకుంది. ఇంకా అమ్మా నాన్న రాలేదు. ఇంటి ముందున్న లాన్‌లోకి వెళ్ళింది. ఆ రోజే కొత్తగా పూసిన తెల్లగులాబి పువ్వును ముద్దు పెట్టుకుంది.

వినోద్ డ్రస్ డిజైనర్. సిటీలో పేరున్న డిజైనర్స్‌లో వినోద్ ఒకడు. అనన్య బట్టలన్నీ తండ్రే డిజైన్ చేస్తాడు. అనన్య వేసుకునే ప్రతి డ్రస్ కోసం చాలా కష్టపడతాడు. రాత్రింబవళ్లు సిస్టమ్ ముందే కూర్చొని తయారు చేస్తాడు. అసలు తన డ్రస్ సెన్సే అనన్య ఎదుగుదలకు కారణం అని చాలా గర్వపడతాడు.

ఆ రోజు సాయంత్రం రిలాక్స్‌గా కాఫీ తాగుతూ వినోద్ కంప్యూటర్ ఆన్ చేసేడు. కాలేదు. ఏమైందని... కంగారు పడ్డాడు. ఎందుకంటే...? వారం రోజుల్లో అనన్య ప్రోగ్రాం ఢిల్లీలో ఉంది. నేషనల్ ఛానల్ వాళ్లది. పైగా లైవ్. దాంతో అనన్య కెరీర్ అంతర్జాతీయంగా ఎదుగుతుంది అనుకున్నాడు. తయారు చేసిన డ్రస్ భలే వచ్చింది అనుకున్నాడు. ఆ డ్రస్‌లో అనన్య అందర్నీ బాగా ఆకర్షిస్తుంది అనుకున్నాడు. కానీ...?! లతను పిలిచి చెప్పాడు. ఇలా ఎందుకు జరుగుతుంది. ఎవరు..? ఎవరు...? పని మనుషులెవరూ చేయరు. “అనన్య చేస్తుందేమో...” అన్నది లత. ఆ మాటనే తట్టుకోలేకపోయాడు వినోద్. లత కూడా తన నోటి వెంట అలా ఎందుకు వచ్చిందా అనుకుంది. కానీ మొన్న టీవీ...ఈ రోజు కంప్యూటర్... అంతుపట్టటం లేదు. అయినా ఇద్దరి మనసుల్లో అనన్య మీద ఓ కన్నేసి ఉంచాలి అనుకున్నారు.

* * *

అప్పుడే అనన్య యాడ్ ఫిల్మ్‌లో నటించి అమ్మతోపాటు ఇంటికి వచ్చింది. అది మగవాళ్లు ఉపయోగించే షేవింగ్ క్రీమ్‌కు సంబంధించింది. ఒకతను క్రీం రాసుకొని షేవింగ్ చేసుకుంటాడు. షవర్‌లోంచి నీళ్లు చినుకులుగా రాలుతూ అతని గడ్డాన్ని క్లీన్ చేస్తాయి. వెంటనే అనన్య తన సుకుమారమైన చేతుల్తో ఆ గడ్డాన్ని స్పర్శించాలి. ఫీలై... వెంటనే ముద్దివ్వాలి. ఐలవ్‌యు అని హస్కీగా చెప్పాలి. అనన్యను మాత్రం ఆఫ్‌స్కర్ట్‌లో నడుం కనిపించేలా క్లోజ్ షాట్ నుంచి వైడ్ షాట్‌గా తీశారు. అసలు మగవాళ్ల షేవింగ్ క్రీమ్‌కు, తన శరీరానికి సంబంధం ఏమిటో అర్థం కాలేదు అనన్యకు.

ఆ రోజు సాయంత్రం వినోద్ ఇంకా ఇంటికి రాలేదు. లత వంట గదిలో పని మనిషితో మాట్లాడుతూ బిజీగా ఉంది. అనన్య తన రూం నుంచి ఓ డ్రెస్ తీసుకొని లాన్‌లో ఓ మూలకు వచ్చింది. అది అంత త్వరగా కనిపించే స్థలం కాదు. ఆ డ్రెస్‌ను కిందేసి అగ్గిపుల్లతీసి వెలిగించింది. ఆ డ్రస్‌కు నిప్పు పెట్టింది. ఆ మంట వెలుగులో అనన్య కూడా నిప్పు లానే ఉంది. కళ్లే కాదు ముఖం మొత్తం మండిపోతుంది. కానీ అనన్య నవ్వుకుంటుంది. లోలోపల నుంచి నవ్వుకుంటుంది. అది ఆరేళ్లప్పుడు టీవీలో ఇచ్చిన తొలి ప్రదర్శనలో వేసుకున్న డ్రస్. అందరూ అనుకుంటున్నట్లు అనన్య జీవితాన్ని వెలిగించిన డ్రస్. ఇప్పుడు మంటలో వెలిగిపోతుంది.

ఆ చుట్టు ప్రక్కల బట్టకాలిన వాసన వ్యాపించింది. ఆ వాసనే లతను, పని మనిషిని తాకింది. వాళ్ళు పరుగెత్తుకుంటూ వచ్చారు. వచ్చేసరికి తగలబడే డ్రస్ వెలుగులో అనన్యను చూసి ఒక్కసారిగా భయపడ్డారు. పలకరించడానికే జంకారు. ఐదు నిముషాలయ్యాక అనన్య పక్కనున్న అమ్మను, పని మనిషిని చూసింది. ఏమీ మాట్లాడకుండా తన రూమ్‌కు వెళ్లింది. లత కూడా ఏమీ మాట్లాడలేదు.

అసలు అనన్య అలా చేయటం, అలా చూడటం... లత జీర్ణించుకోలేకపోతుంది. అంటే..?!! టీవీ కంప్యూటర్ కూడా.. అనన్యే...??! లతకు అర్థమైంది. ఏ పనీ చేయబుద్ధి కాలేదు. వినోద్‌కు ఫోన్ చేసి విషయం చెప్పకుండా వెంటనే రమ్మన్నది. వినోద్ వచ్చాక విషయం చెప్పింది. అనన్య రూమ్ లోంచి బయటకు రాలేదు. రూమ్‌లోకి వెళ్లటానికి వీళ్లకు ఏదోలా ఉంది. అసలు వెళ్లి ఏం మాట్లాడాలో.. ఎలా అడగాలో తెలీటం లేదు. ఓ... వైపు భయం. మరో వైపు దిగులు, అన్నిట్ని మించి బాధ. దిగువ మధ్య తరగతికి చెందిన వాళ్ల కుటుంబం నేడు ఆర్థికంగా ఈ స్థితిలో ఉన్నదంటే అందుకు కారణం అనన్య. అనన్యతో పాటు కుటుంబం ఎదిగింది. అనన్యకు వయసు పెరుగుతుంటే వీళ్లకు సొసైటీలో స్టేటస్, గుర్తింపు వచ్చాయి. కార్లు బంగ్లాలూ వచ్చాయి. అసలు వినోద్‌కు డిజైనర్‌గా పేరు అనన్య డ్రస్‌ల వల్లే వచ్చిందని చెప్పాలి.

ఎండాకాలమైనా ఆ రోజు సాయంత్రం బాగా వానపడింది. వాళ్ళ ఇంటికి ఎదురుగా ఖాళీ స్థలం ఉంది. నాలుగిళ్ల అవతలి కూలిపనులు చేసుకొనే వాళ్లు గుడిసెలు వేసుకొని బతుకుతుంటారు. అనన్య ఎప్పుడు కార్లో అటునుంచి వెళ్లినా డోర్‌తీసి మరీ అక్కడ పిల్లల్ని చూసేది. ఇప్పుడు ఆ పిల్లలు ఎదురుగా ఉన్న ఖాళీ స్థలంలో ఆడుకుంటున్నారు. వానలో తడుస్తూ కేరింతలు కొడుతున్నారు. అనన్య వాళ్ల అరుపులు వింది. తన రూమ్ కిటికీ తీసింది. గాలి పూలతీగల్లా వర్షంతో ఆడుకుంటుంది. ఆ పిల్లలు వెండి మేఘాల్లా మెరుస్తూ ఎగురుతున్నారు. అట్లానే అనన్య వాళ్లనే చూస్తూ ఉంది. చూస్తూనే ఉంది. ఒక్కసారిగా గుండెల్లోంచి దుఃఖం పొంగు కొచ్చింది. కళ్ల బయటి వర్షంతో పోటీపడ్డాయి. ఏ ఆచ్ఛాదనా లేకుండా కారిపోతున్నాయి.

పదమూడేళ్ల అనన్య... మంచుబిందువుల్లో తడిసిన పుష్పించని మల్లె... పాటై ప్రవహించే వెన్నెలవాగు. మెరుపుల్ని సైతం మైమరిపించే జలతారు. ఇప్పుడు ఒంటరిగా తనే వర్షంగా మారిపోయింది. మౌనంగా రోదిస్తుంది. బయట వర్షం లోన వర్షం. మధ్య కిటికి.

* * *

అనన్యకు రెండేళ్లు. ముద్దు మాటల్తో ఆడుకుంటుంది. ఏవేవో తనకే తెలిసిన పాటలు అందంగా పాడుకుంటుంది. అమ్మ నాన్నల మధ్య ఆప్యాయతగా పెరుగుతోంది. ఓ రోజు టీవీలో ఓ ఛానల్లో చిన్న పిల్లల డాన్స్ ప్రోగ్రాం వస్తుంది. ఫైనల్లో గెలిసిన వాళ్లకి హైదరాబాదు సిటీలో ఫ్లాటు, లక్షరూపాయల నగదు, లత, వినోద్ ఆసక్తిగా చూస్తున్నారు. వాళ్లతో పాటు చిన్నారి అనన్య కూడా. "ఏమండీ మన అనన్యని కూడా పెద్ద డాన్సర్‌ని చేద్దాం. లేదా సింగర్‌ని చేద్దాం. "భర్తతో అంది లత" మంచి ఆలోచన. రాబోయే పదేళ్ళలో మీడియా, అడ్వర్టైజ్‌మెంట్ రంగాలలో పెను సంచలనాలొస్తాయి. అప్పటికి మన అనన్యని మంచిగా తీర్చిదిద్దుదాం." అన్నాడు వినోద్. ఇక అప్పటి నుంచి అనన్య జీవితంలో సంచనాలు చోటుచేసుకున్నాయి.

రోజూ ఉదయాన్నే ఏడు గంటల నుంచి తొమ్మిదివరకు సంగీతం క్లాసు. సాయంత్రం ఐదు నుంచి ఏడు గంటల వరకు డాన్స్ క్లాసు. మధ్యలో వాటి ప్రాక్టీసు. అమ్మ ప్రేమ, నాన్న అనురాగం వాటిలో తన నైపుణ్యంతో ముడిపడి ఉండేది. ఇలా చేసింది. అలా పాడిందనీ... బాగా చేస్తే ఐస్‌క్రీం కొనివ్వటం. సంగీతం టీచర్ బాగా పాడిందని మెచ్చుకుంటే తల్లిదండ్రులు ముద్దు చేయటం అనన్యకు అలవాటైంది. తను అమ్మ నాన్న ప్రేమ బాగా పొందాలంటే ఇంకా బాగా చేయాలని ఆ పసి మనసుకు తెలిసిపోయింది. అనన్యకు మూడో ఏడు రావటం తోటే స్కూల్లో వేశారు. ఇటు స్కూలు, అటు అవి. బాగా బిజీ జీవితం. శారీరక, మానసిక శ్రమలకు ఆ చిన్ని మనసు తప్పదన్నట్లు అలవాటైంది. క్లాసికల్ డాన్సనీ, క్లాసికల్ మ్యూజిక్ అని, తర్వాత వెస్ట్రన్ డాన్స్, వెస్ట్రన్ మ్యూజిక్.. అలా ఎన్నెన్నో... అన్నీ ఎదిగే వయసుతో అవీ ఎదుగుతూ వచ్చాయి. మధ్యమధ్యలో అక్కడక్కడ ప్రదర్శనలు ఇవ్వటం... పొగడ్తలు, విమర్శలు... అన్నీ అనన్య జీవితంలో భాగమై పోయాయి. తనకు స్నేహితులు అంటూ కూడా పెద్దగా ఎవరూ ఏర్పడలేదు.



ఓ రోజూ వర్షం పడుతుంది. లత ఇంట్లో ఎక్కడో ఉంది. అనన్య వయసు అప్పుడు ఏడేళ్లు. వర్షంలోకి వెళ్ళి ఆడుకుంటుంది. ఇంట్లో నుంచి బయటకొచ్చిన లత లోపలికి లాక్కెళ్లింది. రెండు దెబ్బలు కొట్టింది. "ఎల్లుండి టీవీ వాళ్ళు ప్రిలిమినరీ షో ఉంటే ఇప్పుడు వర్షంలో తడుస్తావా...? గొంతు పాడవుతుంది కదా...?" అని కసిరి. తలకి గంధంతో దూపం వేసింది. ఆ ధూపం పడక అనన్యకు బాగా తలనొప్పి వచ్చింది. ఆ మాట చెప్తే ఏమంటదోనని అట్లానే ఓర్చుకుంది.

ఓసారి ఇంటికి బంధువులు వచ్చారు. వరుసకు మేనత్త కొడుకు, కూతురు. అనన్య ఈడు వాళ్లే. వారం రోజులు ఉన్నారు. అనన్య వాళ్లతో గడిపిన సమయం కంటే ప్రోగ్రామ్సనీ.., టీవీ ఛానల్సనీ తిరిగినదే ఎక్కువ. కానీ తన మనసులో మాత్రం వాళ్ళతో ఆడుకోవాలని, కబుర్లు చెప్పుకోవాలని ఎంతో ఉండేది. కానీ ఏ మాత్రం కుదిరేది కాదు. అప్పటికే తనంటే ఓ గుర్తింపు వచ్చింది. ఎందుకంటే సంవత్సర కాలంగా ఒక ఛానల్లో వచ్చే డాన్స్ ప్రోగ్రాంలో పార్టిసిపేట్ చేస్తుంది.

అనన్య పదేళ్ళ వయసప్పుడు తనే పాడుతూ, మరో అబ్బాయితో కలిసి డాన్స్ చేయాలి. సెలక్ట్ అయిన వాళ్లు పేరున్న ఓ హిందీ ఛానల్లో పాల్గొనవచ్చు. అయితే రెండిటికీ లింక్ కాలేదు. అంతే ఇంటికొచ్చాక తండ్రి వినోద్ కోపం అంతా ఇంతాకాదు. కొట్టడానికి బెల్ట్ కూడా తీశాడు. అనన్య భయంతో వణికిపోయింది. రెండు రోజులు జ్వరం. ఆ పై వినోద్ సారీ కూడా చెప్పాడు. అసలు తప్పు చేసింది అనన్య కాదు. జోడీగా చేసిన అబ్బాయిని తెలుసుకున్నాడు. తర్వాత ఎప్పుడూ అనన్య వెనుతిరిగి చూడలేదు. ఏది పాడినా, ఏ డాన్స్ చేసినా తనే నెంబర్ వన్‌గా పేరు తెచ్చుకుంది. అట్లానే మనుషులకంటే ఎక్కువ వాటితోనే కాలం గడిపింది.

కార్తీకమాసం. పౌర్ణమి వెన్నెల విరగబూస్తోంది. ఓ కార్యక్రమంలో భాగంగా ఔట్డోర్‌లో షూటింగ్. పైగా ఆ కార్యక్రమం ఫైనల్ ఎపిసోడ్. సినిమా వాళ్ళతో, ప్రేక్షకులతో నిండిపోయి ఉంది. అనన్య తన తండ్రి డిజైన్ చేసిన డ్రెస్ వేసుకుంది. అప్పుడు అనన్యకు పన్నెండేళ్లు నిండుతున్నాయి. కానీ ఆ డ్రెస్ శరీరానికి అంత మంచిగా సెట్ కాలేదు. అంటే శరీరం మొత్తాని డ్రెస్ కవర్ చేయటం లేదు. అనన్య గిల్టీగా ఫీలయింది. ఆ విషయమే చెప్పింది. "ఆ సినిమాలో హీరోయిన్ ఇలాంటి డ్రెస్స్ వేసుకుంటుంది. ఏం కాదు వేసుకో." గద్దించినట్లు అన్నాడు. ఇక తప్పలేదు. తనే విజయం సాధించింది. కానీ మనసులో ఏ మూలో బాధ మిగిలింది. వీళ్లకు నా డాన్స్ కావాలా...? నా పాట కావాలా...? కనిపించే నా శరీరం ముఖ్యమా...? అనుకుంది.

క్రమంగా అనన్యకు మంచి పేరొచ్చింది. చిన్న వయసులోనే ఇరగదీస్తుంది. అని ప్రోగ్రామ్స్ నిర్ణేతలు పేపర్లు చించి మరీ చూపించారు. కార్యక్రమాల్లో అనన్యను పైకెత్తి మరీ పొంగిపోయారు. అనన్య తెలుగమ్మాయి కావటం తెలుగువాళ్ళ అదృష్టం అన్నారు. అనన్య ఎన్నో పోటీల్లో విజయం సాధించింది. పేరుతో పాటు డబ్బూ వచ్చింది. తల్లిదండ్రులూ స్థితిగతులూ మారాయి. అనన్యకు ఫాలోవర్సూ ఎక్కువయ్యారు. అట్లానే ఫ్యాన్సూ పెరిగారు. తన కూతుర్ని అనన్యలా పెంచాలి అని చాలామంది తల్లిదండ్రులు అనుకున్నారు. అనుకుంటున్నారు. అలా పెంచేవాళ్లూ తయార్యయారు. పెంచుతున్నారు.

* * *

బయట వర్షం. అనన్య లోనా వర్షం. మధ్య కిటికి. క్రమంగా ఏడుపును దిగమింగుకుంది. బయట వర్షం తగ్గింది. తిన్నగా తన డోర్ తీసుకొని బయటకొచ్చింది. హాల్లోకొచ్చి కూర్చొంది. ఎదురు చూస్తున్న వినోద్, లత హాల్లో పక్కసోఫాలో కూర్చున్నారు. ఇక తప్పదన్నట్లు వినోదే మొదలు పెట్టాడు. "అనన్య ఏమైంది? టీవీని, నా కంప్యూటర్‌ని ఎందుకలా చెడిపేశావు?" "నాకు నచ్చటం లేదు డాడీ. ఎందుకో బాగా బాధగా ఉంటుంది. వాటి మీద చెప్పలేని కోపం వస్తుంది." అన్నది. "అదేంటే... నాశనం చేసింది కాకుండా... తిక్క సమాధానాలు చెప్తున్నావ్.?" లత కోపంతో అరిచింది. "అదే... నాకు తెలుసు. కానీ ఎందుకో అలా చేయాలనిపిస్తుంది." ముక్తసరిగా సమాధానం చెప్పింది.

అనన్యకు అంతకుమించి ఎక్కువ మాట్లాడాలనిపించలేదు. కామ్‌గా రూంలోకి వెళ్ళిపోయింది. ఓ సారి డాక్టర్‌ను కలిస్తే మంచిదనిపించింది వినోద్‌కు. సైకియాట్రిస్టు రాఘవకు ఫోన్ చేసి విషయం చెప్పాడు. ఓసారి తీసుకురా చూద్దాం అన్నాడు డాక్టర్ రాఘవ.

ఆ రోజు సాయంత్రం అనన్యను తీసుకొని డాక్టర్ దగ్గరకు వెళ్ళారు వినోద్, లత. వాళ్ళిద్దర్ని బయటకు పంపి, అనన్యతో మాట్లాడటం ప్రారంభించాడు డాక్టర్. ఆమె మనసులోని ఒక్కో విషయాన్ని తెలుసుకోసాగాడు.

"అంకుల్ నన్నెందుకు ఇలా పెంచారు మా అమ్మా నాన్న, నేనేం తప్పు చేశాను." అని అడిగింది మొదటగా....

డాక్టర్‌కు ఏమి చెప్పాలో అర్థం కాలేదు. "నీకేం అనన్య. చిన్న వయసులోనే పెద్ద పేరు తెచ్చుకున్నావ్. అసలు నీకు తెలుసా...! నేను నీకు పెద్ద ఫ్యాన్"ని అన్నాడు డాక్టర్.

"అదే డాక్టర్ నా సమస్య. మిగిలిన పిల్లల్లా నా జీవితం లేదు. చిన్నప్పటి నుంచి నా తోటి వారి నుంచి నేను వేరయ్యాను. ఆఖరకు నాకు ఓ మంచి ఫ్రెండ్ కూడా లేరు." ఏడుస్తూ.... నంగినంగిగా మాట్లాడుతుంది అనన్య. మళ్ళీ అనన్యే చెప్పసాగింది.



"డాన్స్, పాటలు, పేరు తప్ప నాకు వేరే జీవితమే లేదు. నా ఇష్టాలు, నా సంతోషాలు నాకు లేనప్పుడు ఇవి నాకెందుకు అంకుల్. నా జీవితాన్ని ఇలా మార్చిన వాటన్నిటి మీద కోపం కసి. అంతే అంకుల్. అంతే... ఆఖరుకు నా శరీరం కూడా వీళ్లకు... "అన్నది. ఏడుస్తూనే అన్నది. మాటల్ని మింగుతూనే అన్నది.

సరే అనన్య నీ విషయం అర్థమైంది. మీ అమ్మ నాన్నతో మాట్లాడతాను. కొద్దిసేపు బయట కూర్చో అన్నాడు.. వినోద్, లత లోపలికి వచ్చి కుర్చీల్లో కూర్చున్నారు. డాక్టర్ చెప్పటం మొదలుపెట్టాడు.

"మీరు అనన్య. ఓ మనిషిని... మనసున్న పాపని మర్చిపోయారు. మీ ఇష్టాలు, అభిప్రాయాలు తనపై రుద్దారు. ఇప్పుడు అనన్య అనన్యకాదు. ఓ.. గ్లోబల్ వరల్డ్ తయారుచేసుకున్న ఫ్యాంటసీ. అనన్య శరీరాన్ని, మనసును, అసలు అనన్యనే ఓ బిజినెస్‌గా మార్చేశారు. డబ్బు సంపాదించారు. సహజంగా వయసుతో పాటు మనిషి మానసికంగా, శారీరకంగా ఎదుగుతారు. కానీ మీరు మీ కోర్కెలతో అనన్యను..?? ఇది ఒక విధంగా చిన్నపిల్లలపై జరిగే మానసిక అత్యాచారం వంటిది." డాక్టర్ మాటలకు వినోద్‌కు కోపం వచ్చింది. "డాక్టర్" పెద్దగా అరిచాడు.

"నువ్వు అరిచినా. నే చెప్పేది నిజం. తను చిన్నప్పటి నుంచి మీ కోసం అణచుకున్న భావాలన్నీ వ్యతిరేకంగా ఇప్పుడు వ్యక్తమవుతున్నాయి. అనన్యలో "స్కిజో ఫ్రెనియా" లక్షణాలు కనిపిస్తున్నాయి. ఇదీ ఉన్మాదం, పిచ్చి లాంటిదే అంటారు. క్రమంగా ఇంకా తనలో ఈ లక్షణాలు పెరిగే అవకాశం ఉంది. ఎందుకంటే మీరు చెప్పినదాన్ని బట్టి తను అతి చిన్నవయసు నుంచి చాలా మానసిక ఘర్షణలకు లోనైంది. ప్రకృతికి కూడా దూరమైంది." అన్నాడు.

"మరిప్పుడు ఎట్లా డాక్టర్?" అడిగింది బాధతో లత.

"ఇప్పుడు, తన జీవితానికి పూర్తిగా దూరంగా ఉంచాలి. తను ఏం కోరుకుంటుందో... చిన్నప్పటి నుంచి ఏం కోల్పోయిందో అవన్నీ కొంతవరకైనా ఇవ్వగలగాలి. ఎక్కడైనా ప్రశాంతమైన ప్లేసుకు తీసుకెళ్లండి. ఎక్కువ ప్రకృతితో గడిపేలా చూడండి. ఇక మీ ఇష్టం." చెప్పాడు డాక్టర్.

ముగ్గురూ తిరిగి కార్లో ఇంటికి బయల్దేరారు. వర్షం ప్రారంభమైంది. వినోద్ కారు విండో తీసి "వర్షం పడుతుంది". అన్నాడు. అనన్య ఆప్యాయంగా చూసింది. చినుకును స్పర్శించింది. ఇంటికి వచ్చారు. ఎదురుగా ఉన్న ఖాళీ స్థలంలో పిల్లలు ఆడుకుంటున్నారు. లత "వెళ్ళి వాళ్లతో ఆడుకో" అంది. అనన్య చినుకుల్లో కలిసి కదం తొక్కుతుంది. ఒక్క ఉదుటన వెళ్ళింది. తోటి పిల్లలతో కలిసి వర్షానికి పాట నేర్పింది.. గాలికి డాన్స్ నేర్పింది. వాళ్ళల్లో ఒకటిగా కలిసిపోయి ఆడుకుంటుంది.

డాక్టర్ రాఘవ తన పేరును మరింత పెంచుకోవటానికి మీడియా అనన్య విషయం చెప్పేశాడు. ప్రతి ఛానలూ అనన్య గురించి వాళ్ళకు తోచిన విధంగా కథనాలు ప్రసారం చేయనారంభించాయి. ఇక అనన్య ఇల్లైతే పేపరు వాళ్లతో, టీవీల వాళ్ళతో నిండిపోయింది. వినోద్ చేసేది లేక నిజమేనని తేల్చి చెప్పాడు. అనన్యని తీసుకొని దూరంగా వెళ్తున్నామని కూడా చెప్పాడు. అప్పటికే కొన్ని ఛానల్ వాళ్ళు వర్షంలో ఆడుకుంటున్న అనన్యను చూపిస్తూ ఏవేవో మాట్లాడేస్తున్నారు. అనన్య మాత్రం పట్టించుకోకుండా ఆడుకుంటుంది.

అంతలోనే అనన్య పాల్గొంటున్న టీవీ కార్యక్రమాల వాళ్ళు వచ్చేశారు. అనన్య చేయాల్సిని రెండు యాడ్ ఫిల్మ్‌స్ వాళ్ళూ వచ్చేశారు. "మీరు ఇప్పుడు ఇలా చేస్తే మాకు కోట్ల నష్టం వస్తుంది. ఎవరు తీరుస్తారు. మీరు వెళ్ళిపోవటానికి మేం ఒప్పుకోం" అంటున్నారు. వినోద్, లత వాళ్ళకు నచ్చజెప్పే ప్రయత్నం చేస్తున్నారు. అనన్య పరిస్థితి అర్థం చేసుకోండని బతిమాలుతున్నారు. కానీ వాళ్ళు ఏ మాత్రం వినటం లేదు. గొడవ పెరిగింది. సహజత్వానికి కృత్రిమతకు మధ్య, డబ్బుకు జబ్బుకు మధ్య, వ్యాపారానికి మానవతకు మధ్య తగాదా పెరిగింది. వినోద్ ఓ నిర్ణయానికి వచ్చాడు. అనన్య సంపాదించిన ఆస్తులను వారి నష్టం కింద జమ చేసుకోమని చెప్పాడు. అనన్య, లత, వినోద్‌లు సంతకాలు చేశారు. ఆ మర్నాడే అనన్యతో అరకులోయ ప్రయాణమయ్యారు. ఈ బిజినెస్ బతుకుల నుంచి అరకు అందాల మధ్య తమ కూతుర్ని మామూలు మనిషిగా మార్చుకోవటానికి............

ఇప్పుడిక అనన్య అరకులోయలో పచ్చపువ్వులు విచ్చిన నవ్వుల్లా... చినుకు రవ్వల దోబూచుల్లా.... వాగు వంకల శబ్దలయగా.... సువాసనల్లోనో తేలే తేయాకు అలలా... కొండచరియల గాలి పడవల్లా... అలా... అలా... కనిపించాలని కోరుకుందాం.



# మహా 'ప్రజా' కవి

ఆచార్య దావులూరి కృష్ణకుమారి

రాజదర్బారుకి వెళ్ళినా నీలగిరి కొండలకు వెళ్లినా పుస్తకాలే గురజాడకు మిత్రులు. ఆనాటికి వచ్చిన వివిధ భాషా సాహిత్య స్వరూపం వివేచన వారిలో నవనవలాడ్తూనే ఉండేది. శంభు చంద్ర ముఖర్జీ వంటి గురువుల చుట్టూనే వారి మనస్సు అల్లుకుని ఉండేది.

ఏ పుస్తకం చదివినా దాని రచనా సరళి, శైలి, వస్తువు మలచిన తీరు అనే అంశాల్లో తనకు నచ్చినివి, తనకు తోచినవి ఆ పక్కనే నోట్సు రాసుకోవడం గురజాడ అలవాటు.



ఆధునికాంధ్ర సాహిత్య యుగ పురుషుడు, గేయ కవితా పితామహుడు. ఆధునిక గద్య వాఙ్మయ ప్రవర్తకుడు వ్యావహారిక భాషా సాహిత్యోద్ధారకుడు, సమకాలీన భావ ప్రతినిధి, అభ్యుదయ నాటిక సాహిత్యపు వేగుచుక్క గురజాడ అప్పారాయకవి.

గురజాడ ప్రతిసాహితీ ప్రక్రియా కళాఖండం వెనుక ఎంతో ప్రతిభ ఉంది. లోకశాస్త్ర కావ్యాద్యవేక్షణం ఉంది. పురాతన సాహిత్య ప్రకాశం ఉంది. సంస్కృతాంధ్రాంగ్ల తమిళ కన్నడ మళయాళ బెంగాలీ సాహిత్య వికాస పరిణామం ఉంది. విరామం ఎరుగని శ్రమ ఉంది. సమకాలీన సమాజం ఉంది. సగటు మనిషి యధార్థ జీవితం ఉంది. విశ్వమానవ ప్రేమ ఉంది. దేశీయాభిమానం ఉంది. ఆత్మ విశ్వాసం ఉంది. మానవత్వం ఉంది. సాంస్కృతిక కళ ఉంది. విమర్శనాత్మక పరిశీలనం ఉంది. ఉదాత్త భావం ఉంది. స్వానుభవం ఉంది. స్వభావయుక్తమైన భాష ఉంది.

రాజదర్బారుకి వెళ్ళినా నీలగిరి కొండలకు వెళ్లినా పుస్తకాలే గురజాడకు మిత్రులు. ఆనాటికి వచ్చిన వివిధ భాషా సాహిత్య స్వరూపం వివేచన వారిలో నవనవలాడ్తూనే ఉండేది. శంభు చంద్ర ముఖర్జీ వంటి గురువుల చుట్టూనే వారి మనస్సు అల్లుకుని ఉండేది.

ఏ పుస్తకం చదివినా దాని రచనా సరళి, శైలి, వస్తువు మలచిన తీరు అనే అంశాల్లో తనకు నచ్చినివి, తనకు తోచినవి ఆ పక్కనే నోట్సు రాసుకోవడం గురజాడ అలవాటు.

ఉపన్యాసకులుగా, ప్రాచీన శాసన లిపి పరిశోధకులుగా నిర్వహించిన పదవులు, కళింగదేశ (విశాఖ, శ్రీకాకుళ, విజయనగరం జిల్లాలు) చరిత్ర, విజయనగర సంస్థాన చరిత్ర, ఆంధ్రదేశ చరిత్రల ఊహా ప్రతి పాదనల సంకల్పానికి ప్రాణంపోశాయి. (విడివిడి కాగితాల్లో నోట్సు రూపంలో ఉంది.)

సంస్థానం పనిమీద ఎప్పుడు ఎక్కడికి వెళ్లినా గురజాడ చూపు వేరు. తీరిక సమయాల్లో నాటకాలకు మీటింగులకు వెళ్లడం, ఏది విన్నా ఏది చూసినా వాటి పద్ధతులు, వాటి ప్రాముఖ్యాలు జనాకర్షణకు కారణాలు ఏవి అనే వాటి మీదే వీరి ధ్యాస అంతా ఉండేది.

బోర్డు ఆఫ్ స్టడీస్ మెంబరుగా వెళ్లినా విద్యాసంబంధం గానే వారి ఆలోచనలు చుట్టు ముట్టి ఉండేవి. క్లాసుగదులు ఎలా ఉన్నాయి. పాఠం చెప్పడం ఎలా ఉంది. వస్తు విన్యాసం విమర్శనాత్మకంగా ఆలోచనీయంగా ఉందా లేదా అనే దానిపైనా గురజాడ కేంద్రీకరణ అంతా.

'తమిళ ప్రాంతాల్లో మాట్లాడే తెలుగు భాషలో తెలుగువారి మాటలు, 'అర్థాలు ఎలా మార్తున్నాయి' ఒకే భాష వివిధ ప్రాంతంలో ఉచ్చరణ భేదం ఎలా పొందుతుంది' ఈ ప్రాంతంలో త్యాగయ్య తెలుగు పాటలు ప్రచారంలో ఉండడానికికారణం ఏమిటి అనేలాంటి భాషా ప్రగతిని గుర్చిన విచారణ మరో వైపు మెదిలేది.

ఒక దర్బారులో ఆనంద గజపతి మహారాజా వారితో ప్రసంగాలు బతుకు పుస్తకంలోని పాఠ్యాల వంటివి. సంఘంలోకి అడుగు పెట్టాక ఎలాంటి విమర్శకైనా సంసిద్ధం అవ్వాలని. అది అలవడడానికి తగినంత ఓర్పు ఉండాలని, కోపాన్ని, అసంతృప్తినీ తాత్త్వికశక్తితో అణచుకోవాలని, మంచి మాటలు మరచిపోకూడదనీ,

## జనమే ...

✍ : సి. హెచ్. మధు
✆ : 9949486122

ఊహల రెక్కల మీద ప్రయాణం చేసి చేసి
అలసిపోయిన నేను
కవిత్వం చెట్టు క్రింద సేదదీరుతాను
నాకు కవిత్వం ప్రాణం
నా ఊపిరి కవిత్వం
ఈ కవిత్వాన్ని కూడా అటూ ఇటూ ఎటోల
గాలిలో మళ్ళించటం కాదు
నేను జనంచుట్టే త్రిప్పుతుంటాను
నాకు జనమేగా ప్రాణం
వస్తువు జనం
శిల్పం జనం
భాష జనం



అసలు నాకవిత్వమే జనం
జనం శిల్పం మీద నిలబడిన
నా అడుగు ఎన్నడూ తడబడటం లేదు
జనం కన్నీటి చుక్క నుండి ప్రారంభమయిన
కవిత్వం
జనం పిడికిలి వరకు ఎదిగింది
నా అల్లిబిల్లి భాషను జనం పట్టించుకోలేదు
జనం భాషకు నా కవిత్వంలో ప్రాణం పోశాను
నా కిపుడు
జనమే పదం
జనమే వాక్య
జనమే కలం
జనమే ఆయుధం

---

ఎదుటివాళ్ళను ఆకట్టుకునేలా నిపుణతను పెంచుకోవాలనీ మొదలైనవి ఆ అంశాలు.

ఈ పుస్తక జ్ఞానాలన్నింటిని మించింది వీరి అనుభవాత్మకమైన ప్రబోధజ్ఞానం. మనిషిలో మనిషిని, మంచిని చూడగల్గడం, నిరుత్సాహ పడకుండా జీవన అపజయాల్ని ఎదుర్కోగల్గడం, వ్యతిరేకతను తట్టుకుంటూనే రచనలో వెనకపడకుండా ఉండడం, ఆత్మ పరిశీలనను పెంచుకోవడం, దేశీయమైన బాణీని ఛందస్సును పలుకుబడిని అవగాహనకు తెచ్చుకోవడం, ఎక్కడికిపోయినా ప్రతిదీ పరిశీలించే తత్త్వాన్ని అలవరచుకోవడం, ఎదుటివారిలోని గొప్పతనాన్ని గుర్తించడం వంటి మేలుకోళ్ళ నిరంతర మనన శీలమైనవి.

తన జీవితంలోని ప్రతి సంఘటనను, ప్రతి పదవిని ప్రతి విషయాన్ని తన సాహిత్య కృషిలో అంతర్భవింప చేసుకున్న మహా తాత్త్వికుడు గురజాడ. వీటన్నింటి మూలంగా గురజాడ ఆలోచన, గాంభీర్యాన్ని విశాలతను సంతరించుకుంది. నిజాన్ని ఎదుర్కోగల ధీమాను ఆపాదించుకుంది. సృజనశక్తిని సమకూర్చుకుంది. పాతకొత్తల మేలు రీతులతో ఎదిగిన ముందుచూపును అంది పుచ్చుకుంది. సంఘ సంస్కరణకూ సాహిత్యానికీ ఉన్న సంబంధాన్ని గుర్తించగల్గింది. సమాజంలో ప్రతి స్థాయిలోని స్త్రీల దాస్య స్థితికి వారి దురవస్థలకు ఆర్థిక పరిస్థితులకు మూలం వెదుక కల్గింది. జాతి, కులమత, వర్గ రహిత సమాజానికి కొత్త తెన్నులు చూపింది. సమాజపు హెచ్చు తగ్గులకు మంచి చెడులే కొలమానాలని తీర్మానించుకుంది.

ఇలా స్వాయత్త పరచుకున్న ఈ లోక విజ్ఞాన సంపదనంతా సాహితీ శిల్పంగా మలచుకుని ఆ సొత్తును ప్రజలకీ అప్పగించిన ప్రజాకవి గురజాడ.

సాహిత్య సిద్ధాంతాలు, సంస్కరణాత్మక ఆదర్శాలు, వసుధైక కుటుంబ భావన, శ్రమైక సాధన, దేశ ప్రగతీ, సామాజిక స్పృహ, మానవ చరిత్రను స్త్రీ పునర్నిర్మిస్తుందనే క్రాంత దర్శిత్వం వంటి సాహిత్యపు జాడలు మంచి చేవగల ప్రజాకవిగా మహాకవిగా గురజాడను నిలబెట్టాయి.

గోర్కి చెప్పినట్లు ఈ కింది ప్రజాకవి అక్షణాలకు 'నిక్కమైన నీలం' వంటి వాడు గురజాడ.

ప్రజాకవి భావాలు మనిషి స్వతంత్ర భావాల్ని, స్వేచ్ఛనీ, శక్తినీ సంపదల్ని అణచి ఉంచడాన్ని తీవ్రంగా ఖండించాలి.

మోసకారుల్ని దగాకోరుల్ని సోమరుల్ని సేవకాప్రవృత్తుల్ని పరాన్నభుక్కుల్ని ప్రతిఘటించాలి.

ఒక మనిషి మీద మరోవ్యక్తి చలాయించే అధికారాన్ని ఒకరి శ్రమని మరొకరు దోచుకునే పద్ధతిని రూపు మాపాలి.

మానవ జీవిత వికాసానికి, సమైక్య కృషికి సాహితీ రూపం ఇవ్వాలి. నిస్పృహను దూరం చెయ్యాలి.

చదువరుల జీవితంతో సన్నిహిత సంబంధం కల్గించేలా ఉండాలి స్వశక్తి మీద విశ్వాసం కల్గించేలా ప్రయత్నం చెయ్యాలి. శ్రమశక్తిని గుర్తింపచేయాలి.

స్త్రీని శారీరక సుఖాన్నిచ్చే కామ స్వరూపిణిగా కాక తనతో పాటు ప్రయాణానికి సిద్ధంగాఉన్న సహజీవిత భాగస్వామినిగా చిత్రింపచేయాలి."

అందుకే గురజాడ భాషా ఉద్యమం ప్రజల ఉద్యమం అయింది. దానిని ఎవరిని సంతోష పెట్టడానికైనా వదులుకోను అన్న గురజాడ నియమం ఆంధ్రసాహిత్య 'ప్రజాస్వామిక యుగానికి' ప్రధాన సూత్రం అయింది.

ఇక 'మాటలో అర్థంలో భావంలో సరికొత్తను దర్శించ గలవాణ్ణి, పాతని కూడ చక్కగా చిత్రీకరించగలవాణ్ణి మహాకవి అంటారు. అద్దాల నాటి నుంచి నేర్చిన తేట మాటల రాటుతనంతో సజీవమైన సహజమైన ప్రజాహిత భావనతో, చెవికింపు కల్గించే లోక ఛందంతో, కంటికగపడే వస్తుతత్వంతో కొమ్మెరుంగులు చిమ్ముతూ సమాజ సంస్కరణ కాంతులను బళ్లున ప్రసరింపచేసిన 'మహాకవి' గురజాడ. ఈ మహాకవితత్త్వాన్ని ముత్యాల సరంలో తన రచనల సిద్ధాంతంగా అభినవీకరించాడు.

'ఇహము లోపలి మంచి నంతటినీ' ఇముడ్చుకున్న ఈ మహా 'ప్రజా' కవి సాహిత్యాత్మ, గట్టిమేల్ తలపెట్టే బలిమికి ధీశక్తిని తోడును చేసి ముందు తరాల వారికి ముందుగతి చూపుతూనే ఉంటుంది.





# పదేళ్లపాటు ...

ఆచార్య ఆత్రేయ

నాటకం – జీవిత నాటకం జగన్నాటకం ఈ మూడింటినీ నాటకమనే అన్నారు. అంటే ఈ మూడూ ఒక దానికొకటి అద్దం. ఒకటి మరొకదానిలో చూచుకొంటూ కనపడుతూ వుంటుంది. అంచేత ఈ మూడు నాటకాల సంగతి కాస్తో కూస్తో తెలిస్తే గానీ అసలు నాటకం తీరుతెన్నులు తెలుసుకోలేమని నామతం. ఈనాడు మన నిత్య జీవితం మీద అంతర్జాతీయ ప్రభావా లెన్నో ముద్రవేస్తున్నది. అది సాహిత్యానికీ అవశ్యం. ఇలా తరచిచూడగా తేలే సారాంశం ఒక్క ముక్కలో చెప్పాలంటే – నేడు – మనదేశంలో – దేశ దేశాలలో – మానవ జీవితంలో – గోచరిస్తూన్న అస్పష్టత, అయోమయత, తప్పించుకు తిరిగే తత్వం – తాత్కాలిక వినోద వాంఛ, అన్నీ నాటకాలలో కూడా స్పష్టంగా కన్పిస్తున్నవని నా అభిప్రాయం.

**నా** పుట్టిల్లు నాటకరంగమైనా అత్తిల్లైన సినిమా రంగానికి వచ్చి పద్దెనిమిదేళ్లయినవి. ఆ కొత్తల్లో అడపదడపా పండగా పబ్బానికి పుట్టింటికి వెళ్లేవాణ్ణి. అదీ పదేళ్లుగా అసలు లేదు. ఈ పదేళ్లనే నేను 'ఇటీవల' గా నిర్వచించుకొని సింహావలోకనం చేస్తాను.

అత్తింట కాపురం పెట్టిన అల్లుడు ఎంత చెడిపోతాడో అందరికీ తెలుసు. పదేళ్లుగా నాటకరంగం వైపు కన్నెత్తి చూడని నన్ను 'ఇటీవలి నాటకాల తీరు తెన్నుల' గురించి అభిప్రాయం – తీర్పు చెప్పమని ఆదేశించారు మిత్రులు. నా కందుకు అర్హత లేదనుకోవడం వారి విచక్షణను అనుమానించి అవమానించడం అవుతుంది గనుక – అర్హత వున్నదనుకునే ముందుకు వెళ్తాను.

నాటకం – జీవిత నాటకం జగన్నాటకం ఈ మూడింటినీ నాటకమనే అన్నారు. అంటే ఈ మూడూ ఒక దానికొకటి అద్దం. ఒకటి మరొకదానిలో చూచుకొంటూ కనపడుతూ వుంటుంది. అంచేత ఈ మూడు నాటకాల సంగతి కాస్తో కూస్తో తెలిస్తే గానీ అసలు నాటకం తీరుతెన్నులు తెలుసుకోలేమని నామతం. ఈనాడు మన నిత్య జీవితం మీద అంతర్జాతీయ ప్రభావా లెన్నో ముద్రవేస్తున్నది. అది సాహిత్యానికీ అవశ్యం. ఇలా తరచిచూడగా తేలే సారాంశం ఒక్క ముక్కలో చెప్పాలంటే – నేడు – మనదేశంలో – దేశ దేశాలలో – మానవ జీవితంలో – గోచరిస్తూన్న అస్పష్టత, అయోమయత, తప్పించుకు తిరిగే తత్వం – తాత్కాలిక వినోద వాంఛ, అన్నీ నాటకాలలో కూడా స్పష్టంగా కన్పిస్తున్నవని నా అభిప్రాయం. ఇందుకు కారణాలు పరిశీలించాలి. ఆ పరిశీలన ప్రస్తుతం మన దేశానికే పరిమితం చేసుకుందాం.

స్వాతంత్ర్యం రాక పూర్వం మనకు ఒకటే సమస్య – బానిసత్వం ! ఆ తరువాత మనకు చచ్చేన్ని సమస్యలు. అసలు స్వాతంత్రమే ఒక పెద్ద సమస్య అయిపోయిందేమో.

దేశంలో, జీవితంలో, సమస్యలంటూ వుంటే అవి కవి కలంలో కంఠంలో మారుపలకాలి కవితగానో – నాటకం గానో !

ఇక్కడ ఒక చిన్న ప్రశ్నకు తపీమని జవాబు చెప్పేస్తే తీరిపోతుంది. 'సమస్యల కోసమేనా కవిత్వం' అంటే– 'అవును' అని ఖచ్చితంగా చెప్తూ, ఎవరు, ఎప్పుడు, ఏ సమస్యా లేకుండా ఏం వ్రాసారో చెప్పమని సవాలు చేస్తూ ఆ వాదం ముగిస్తాను.

సమస్యలంటూ వుంటే కవి కంఠంలో మారుపలకాలి అన్నాను కదూ, మరి నాటక రచయిత కంఠంలో అలా పలికిందా ! ఎప్పుడు ? ఎన్నాళ్లు ? ఇప్పుడూ పలుకుతూందా ? కాస్త తిరగేసి చూద్దాం. (నాటక రచయిత కవి కాడంటారా ? కాకపోతే పోనీండి.)

చూద్దామంటే చూద్దాం అంటే ఆ దేమంత తేలిక పనికాదు. ఇటీవల తెలుగులో నాటక రచయితులు చాలామంది వెలిసారు. నాటకాలు కోకొల్లలుగా వ్రాసారు. కొత్తకొత్త ప్రయోజనాలు, ప్రయోగాలు ప్రయత్నించారు.

ఇలా వుండగా 'మాకో మంచి నాటకం వ్రాసివ్వండి,' అంటూ ' మంచి నాటకాలు లేక చస్తున్నాం' అంటూ కొందరు – ముసలమ్మను పట్టుకు వసంతాలాడినట్టు, Ford car runs on its old prestige అన్నట్టు నా వద్దకు వస్తారు అర్థిస్తూ, వారి అభ్యర్థనలో నిజం నిజంగా అంతేనా అని కూడా ఆలోచించాలి.

నేనిటీవల నాటకాలు వ్రాయకపోయినా, ఇటీవలి నాటకాలు దాదాపు చాలామటుకు చదివాను, కొన్ని చూచాను.

నిజంగా మంచి నాటకాలు లేవా! వున్నవి. కానీ కొందరు కోరే ఆ 'మంచి' ఏమిటి ?

కొన్ని నాటకాలు చూస్తున్నంతసేపూ 'నేనింక నాటకాలు వ్రాయగలనా? వ్రాసినా ఇంత బాగా వ్రాయగలనా' అనిపించింది నాకు.

కానీ అవే నాటకాలు చదివినప్పుడు 'ఏదో లేదు' అనిపించింది. ఈ అనిపించడానికి కారణం ఏమిటి ?

స్థూలంగా నాకు రెండు కారణాలు కనిపించినవి. ఒకటి– నాటకంలో 'సినిమా' అనుకరణ ఎక్కువకావడం. రెండు– నాటకంలో పాత్రలు సమాజంలోని సజీవ వ్యక్తులు కాక, రచయిత సృష్టించి, అతని 'విసురుల'కు 'చెణుకుల'కు సాధనాలుగా పని చేసేవి కావడం – ఈరెండు కారణాలకు మూలం – నేను ముందే మనవి చేసిన అస్పష్టత – అయోమయత ! కనుక మూల కారణానికి కారణం వెతుకుదాం.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత – మనకు బోలెడు సమస్యలెదురైనవి. చెప్పవలసినవి, అడగవలసినవి చాలా కనిపించాయి. హిందూ ముస్లిం సఖ్యత, నిరుద్యోగం – బ్లాక్ మార్కెట్ – అవినీతి – లంచగొండితనం – ఎన్నికలు ఇత్యాది ఎన్నో ! ఈ సమస్యలు పుష్టివంతమైన కథా వస్తువులై చాలా నాటకాలు వచ్చాయి అప్పట్లో. నాటక రచయితకు కడుపు నిండిన భోజనం ! కానీ కొంత కాలానికి – అంటే దాదాపు రెండవ జనరల్ ఎన్నికలయ్యేసరికి ఇవన్నీ అంతర్ధానమైనవి. అనగానే పరిష్కారమైపోయినవని పొరబాటున అనుకునేరు. ఇవి మన జీవితాలలో ఒక భాగంగా ఇమిడిపోయినవి. వాటిలో మనం కాపురం చేయడానికి అలవాటు పడిపోయి, అవి మనకు ఆప్తబంధువులుగా తయారైపోయినవి. అవి సమస్యలుగా కనిపించడం మానేసి సహజమైనవిగానూ, సర్వ సామాన్యమైనవిగానూ రూపొందినవి. అప్పుడే ఏర్పడ్డది నేనన్న అయోమయస్థితి, రచయితకు ఏం వ్రాయాలి అన్నదే పెద్ద సమస్యగా ఎదురైంది. వ్రాయడమనేది ఒక పెద్ద జబ్బు. దానికి వుపశాంతి ఎప్పుడూ ఏదో ఒకటి వ్రాస్తూండడమే.కనుక ఏం వ్రాయాలన్నది సమస్యే అయినా ఏదో ఒకటి వ్రాయాలన్నది అవశ్య వ్యసనం అయిపోయింది. ఆ వ్యసనాన్ని తృప్తిపరచుకునేందుకు రచయిత 'తప్పించుకు తిరిగే తత్వం' తాత్కాలిక వినోదం' అలవాటు చేసుకున్నాడు. ఈ బాధ నాటక రచయిత కున్నంతగా పద్య గేయ కవులకు లేదు. శ్రీశ్రీ మొదలు – నేటి అతినవ్య దిగంబర కవుల వరకు, ఆ నాటి 'ఆకలి' కుళ్ళిన ఎముకులు' 'దగాపడిన తమ్ముళ్ళు' ఇత్యాది వస్తువులనే వేరే వేరే మాటల్లో, మూసల్లో మనకు వినిపిస్తున్నారు. కానీ నాటక రచయిత అలా చేయలేదు. కారణం – చదువరులకు ప్రేక్షకులకు వున్న తేడా – చెవికీ కంటికీ వున్న శక్తి వ్యత్యాసమే. అంచేత నాటక రచయిత అడ్డదారులూ, అడ్డమైనదారులూ తొక్కవలసివచ్చింది.

స్వాతంత్ర్యం వచ్చిన తరువాత – మనకు బోలెడు సమస్యలెదురైనవి. చెప్పవలసినవి, అడగవలసినవి చాలా కనిపించాయి. హిందూ ముస్లిం సఖ్యత, నిరుద్యోగం – బ్లాక్ మార్కెట్ – అవినీతి – లంచగొండితనం – ఎన్నికలు ఇత్యాది ఎన్నో ! ఈ సమస్యలు పుష్టివంతమైన కథా వస్తువులై చాలా నాటకాలు వచ్చాయి అప్పట్లో. నాటక రచయితకు కడుపు నిండిన భోజనం ! కానీ కొంత కాలానికి – అంటే దాదాపు రెండవ జనరల్ ఎన్నికలయ్యేసరికి ఇవన్నీ అంతర్ధానమైనవి.

ఆ దారులన్నిటిలో భయంకరమైనది ప్రమాదకరమైనదీ 'ఖూనీకోరు' నాటకాలు – క్షమించాలి – 'డిటెక్టివ్' నాటకాలు – లేక అపరాధ పరిశోధక నాటకాలు, నాటకాలకన్నా నవలాసాహిత్యంలో యీ ఇతివృత్తాలు – బలమైన స్థానాన్ని ఆక్రమించుకొన్నాయి. వీటి విషయానికి తరువాత వస్తాను.

రెండవది – స్త్రీ. స్త్రీని వివిధ కోణాల నుంచి పరిశీలించి చిత్రించడం రచయిత చేసిన రెండవపని. ఇదివరకున్న పడుపువృత్తి పోయి – దానిస్థానే – రకరకాల మానసిక, శారీరక – వ్యభిచారాలు తలలెత్తినవి. మానసిక దౌర్బల్యం వల్ల కాలుజారిన మగువ – మన సొకరికిచ్చి తను వొకరికిచ్చిన ఇల్లాలు – వివాహానంతరం – కుండ మార్పిళ్లలాగా – భార్యలను మార్చుకున్న భర్తలు – వీటిలో కాంప్లికేషన్లు – నాటక రచయితకు వస్తువులైనవి, మనుష్యులెంత మారినా – సమాజంలో ఎన్ని అవకతవకలున్నా, ఆడుదాన్ని పతివ్రతగా తప్ప వేరే విధంగా చూడడం ఇష్టపడని భారతీయులలో, ఏ కొద్దిమంది మేధావులకో తప్ప – సామాన్యజనానికీ నాటకాలట్టే రుచించలేదు. అంచేత ప్రజాదరణ పొందలేదు.

అంతగా పొసగకపోయినా ఇక్కడ ఒక్కవిషయం చెప్పకతప్పదు. 'ప్రేమ' మన ప్రాచీన సాహిత్యంలో ఎక్కడా వినరాదు. అది మనం విదేశం నుంచి దింపుకొన్న ఒక మత్తుపదార్థం. మనకున్నది, మన పూర్వీకు లెక్కువగా పాటించి, చాటించినది 'ధర్మం' ధర్మకర్మబద్ధులం మనం. అలాంటి మన సమాజంలో ఈ ప్రేమ ప్రవేశించి, ఎన్నో విపరీతాలకు దారితీసింది. మరీ సినిమాలలో– వాటి ననుసరిస్తూన్న నాటకాలలో యీ ప్రేమ – వీర విహారం చేస్తూ, ఏకచ్ఛత్రాధిపతిగా ఏలుతూ – కుర్రవాళ్ళను వెర్రివాళ్ళను చేస్తూందేమోనని నా భయం. ఈ మాటంటే నన్ను సనాతనుడు, ఛాందసుడు అని జమకడతారేమో, ఫర్వాలేదు.

ఈ దశలోనే పైన చెప్పిన రెండు దారులకు అనుగుణంగా వున్న అమెరికన్ సాహిత్య అనుకరణలు, అనువాదాలుగా కొన్ని నాటకాలు వెలసినవి.

వస్తువు సహజము, సామాజికము, సర్వజనీనము కానప్పుడు దానికి కృత్రిమాలంకారాలు, ముస్తాబులు, ముసుగులు అవసరమవుతాయి. అందులో సినిమా అనుకరణ ఒక ముస్తాబు. నాటకంలో కొన్ని సమయాలలో అందంగానూ, రసస్ఫోరకంగానూ వున్నా, చాలాసార్లు, చాలామటుకు నాటకంలో నాటకీయతను దెబ్బతీసినవని చెప్పక తప్పదు. వీనికి ఋజువు ఆ ముస్తాబులు కొట్టవచ్చినట్లు కనపడడమే. జుట్టున్నమ్మ ఏ కొప్పుపెట్టినా అందమే. లేనప్పుడు కనపడిపోతుందిగా అంతే.

ఇక నాటక రచయిత ప్రయత్నించిన రెండవ ముస్తాబు – అందమైన ముసుగు. సంభాషణల జిగితో సన్నగానేసిన జరీముసుగు అది. ఇటీవలి నాటకాల సంభాషణలలో చాతుర్యము, విసురులు, చెణుకులు విరివిగా వినవస్తున్నవి. ఇవి వినోదజనకంగా వున్నవి. కానీ వీటిలో ఎక్కువపాలు నాటకకథావస్తువుకు గానీ, కథాకథనానికి గానీ, కథలో పాత్రలకు గానీ, సంబంధము, అవసరము లేనివిగానే వున్నవి. రచయిత విజ్ఞానాన్ని, వివిధ విషయాలపై అతనికున్న అభిమాన అయిష్టతలను వెల్లడి చేయడానికే అన్నట్లున్నవి. తాత్కాలికంగా ప్రేక్షకులను నవ్విస్తూ, చక్కిలిగింతలు పెడుతూ, గబుక్కున అక్కడక్కడ కథ చెప్పేస్తూ నాటక ప్రదర్శన కాలాన్ని హాయిగా గడిపేందు

కుపకరిస్తున్నవి. నాటక ప్రయోజనం అంతమాత్రమే అయితే ఆ రచయితలందరూ సిద్ధసంకల్పులే. అంతకన్నా ప్రయోజనం ఇంకేదో వుందనుకుంటే యీ సంభాషణలన్నీ అజాగళస్తనాలే అవుతాయి.

మరొక ముఖ్యాంశం - తెలుగు నాటకాలలో తెలుగుదనం కొరవడిపోతూందేమో ! ఒకనాటి తెలుగు పండుగలు, వేడుకలు - వినోదాలు - ఈనాడు - వుండవలసిన పల్లెటూళ్లలోనే అదృశ్యమైపోతున్నవి. జాతికి నిలువుటద్దమేగా నాటకం. కనుక బాధపడి లాభం లేదు.

రాజకీయంగా, సాంఘికంగా ఒక స్తబ్దత ఏర్పడ్డ రోజులివి. అదే స్తబ్దత నాటకాలలో కూడా ప్రతిబింబితమవుతూంది.

సమస్యలా - బోలెడన్ని - అన్నీ అలాగే వున్నవి - ఇంకా అధ్వాన్నమైనవేమో కూడా, సాధించవలసిన అభ్యుదయమా - ఒక్కడుగు ముందుకు సాగలేదు సరికదా - కాస్త వెనక్కే వెళ్ళిందేమో. దీనికంతటికీ కారణం మధ్యతరగతి ప్రజ - అందులో మేధావులు. ఎప్పుడు ఏ అలజడి చేసినా, ఏ ఎలుగు వినిపించినా, ఏ పిలుపు వచ్చినా మధ్యతరగతి నుంచే వచ్చింది, రావాలి. ఆ మధ్యతరగతి కిప్పుడు 'అరిచే కుక్కకు కవళం'లాగా కొన్ని అవకాశాలు ఈ పరిపాలనా యంత్రం కలగజేస్తూంది. వెయ్యి మొదలు పదివేల వరకు ఎంతమాత్రం డబ్బున్నాచాలు - ఏ చిన్న పర్మిట్టో - లైసెన్సో సంపాయించి - మెల్లమెల్లగా మధ్యతరగతి మనిషి పై తరగతిలోకి వెళ్ళి పెట్టుబడిదారై కూర్చునే అవకాశాలు - చాలా ఏర్పడ్డాయి. ఆ మత్తులో పరుగెత్తుతూన్న మధ్యతరగతి మనిషికి, మొన్ననే రిపేరైన రోడ్డు నేడు గతుకులు పడివున్నా, కాళ్లు కొట్టుకొన్నా, అందులో కాంట్రాక్టరు గడించిన డబ్బే కనిపిస్తుంది గానీ- అందులో అవినీతి, అరాచకత్వం కనిపించదు - కనిపించినా పట్టించుకోడు - తనపరుగు తనదే. ఇది చాలా ముఖ్యమైన కారణం. నాటకాలను గురించి చెప్పమంటే నేను రాజకీయాలు చెప్పాను. అప్రస్తుతం కాదనుకుంటాను. అయితే క్షమించండి.

మొత్తం మీద జాతిని వీపు మీద చరిచి - కదిలించి వురికించే ఒక ప్రయత్నం జరగాలి, ఆ పని నాటక రచయిత అందరికన్నా సులభంగా, సున్నితంగా చేయగలడు, సినిమా ప్రభావంలోపడి - వికారాలను అందాలుగా దర్శిస్తూ, తీయనైన అబద్దాలకు అలవాటుపడి పోయిన జనాన్ని తనవైపు మళ్ళించుకోవడం - తన మాట వినిపించడం - తన వెనుక నడిపించడం నాటక రచయితలకు కష్టమైనపనే - కానీ అసాధ్యంకాదు. అందుకు ముందు తానా వాతావరణం నుంచి బైటపడాలి.

ఈనాడు తెలుగులో సిద్ధహస్తులు, సిద్ధప్రతిష్ఠులు అయిన నాటకకర్తలను - వారి నాటకాలను కొన్నిటినైనా ప్రస్తావించక యీ సమీక్ష సంపూర్ణము సమంజసమూ కాదు.

**వ్రాయడమనేది ఒక పెద్ద జబ్బు. దానికి వుపశాంతి ఎప్పుడూ ఏదో ఒకటి వ్రాస్తూండడమే. కనుక ఏం వ్రాయాలన్నది సమస్యే అయినా ఏదో ఒకటి వ్రాయాలన్నది అవశ్య వ్యసనం అయిపోయింది. ఆ వ్యసనాన్ని తృప్తిపరచుకునేందుకు రచయిత 'తప్పించుకు తిరిగే తత్వం' తాత్కాలిక వినోదం' అలవాటు చేసుకున్నాడు. ఈ బాధ నాటక రచయిత కున్నంతగా పద్య గేయ కవులకు లేదు. శ్రీశ్రీ మొదలు - నేటి అతినవ్య దిగంబర కవుల వరకు, ఆ నాటి 'ఆకలి' కుళ్ళిన ఎముకులు' 'దగాపడిన తమ్ముళ్ళు' ఇత్యాది వస్తువులనే వేరే వేరే మాటల్లో, మూసల్లో మనకు వినిపిస్తున్నారు. కానీ నాటక రచయిత అలా చేయలేదు. కారణం - చదువరులకు ప్రేక్షకులకు వున్న తేడా - చెవికీ కంటికీ వున్న శక్తి వ్యత్యాసమే. అంచేత నాటక రచయిత అడ్డుదారులూ, అడ్డమైనదారులూ తొక్కవలసివచ్చింది.**

నా దృష్టిని ఆకర్షించిన రచయితలలో శ్రీభమిడిపాటి - శ్రీ ప్రఖ్య శ్రీరామమూర్తి శ్రీయన్.ఆర్.నంది, శ్రీ గొల్ల పూడి మారుతిరా - ముఖ్యులు. ఈ నలుగురూ నాలుగు కోవలక త్రోవలకు చెందినవారు.

భమిడిపాటిది ఒకరకంగా వారసత్వము! ఆయ నాటకాలలో చాలావరకు సజీవమైన పాత్రలు తెలుగువాళ్లు వుంటారు. 'కీర్తి శేషులు' నాక నచ్చిన నాటకం, నాలుగు కాలాల పాటు నిలిచే ! అందులో కవి ఒకప్పటి నేనూ ఆయనా ఇంకా చాలామంది: మిగిలిన పాత్రలు కూడ ప్రతికవీ ఎరిగినవే. కాకుంటే అక్కడక్కడ నాటకాన్ని బిగించడం కోసం - కొంత అతిశయోక్తి వెళ్లారేమోనని నా అనుమానం.

ఇక 'ప్రఖ్య' అంటేనే నాకు భయం. ఆయన 'ఫణి' ఎప్పుడూ నాకళ్ళెదట పడగవిప్పి బుసకొడుతూన్నట్టే వుంటుంది. నాటక నడపటంలో నేర్పు, సంభాషణలలో చాకచక్యం - చురుకుదనం - అన్ని లక్షణాలు వున్నవి కాకుంటే నా కంప్లెయింట్ ఒక్కటే. ఆయనకల ఎప్పుడూ డిటెక్టివ్ ఎలిమెంట్ నే ఏరుకొంటుంది. ఆ దారి తప్పితే మంచిదని నా సలహా. ఎందుకంటే - క్రైమ్ సబ్జెక్ట్సు వినోదమూ కాదు - విజ్ఞానమంతకన్నా కాదు. పొరబాటైతే మన్నించాలి.

యన్.ఆర్.నంది 'మరో మొహంజిదారో' ఒక విశిష్ట సృష్టి ఇందులో అవలంబించిన టెక్నిక్ ఆ ఇతివృత్తానికి ఎంతో చక్కగా అతికిపోయింది. ఈ సృష్టికి ఆయనకు నాప్రత్యేక అభినందనలు.

గొల్లపూడి మనిషి ఎంతపలచగా వుంటాడో మనసంత పెళుసుగా మాట్లాడుతుంది అవసరమైనప్పుడు. ఎప్పుడూ నవ్వుతూవుండే ముఖం ముసుగున ఎప్పుడో ఎక్కడో నలిగిన హృదయాలు - కురిసిన కన్నీళ్ళూ పలుకుతూ పలకరిస్తూవుంటాయి. ఆయన రాగరాగిణిలో మూగబాధలు ముద్దుగా ముద్దగా ముసురుకొని వుంటాయి. రేడియో గడియార జీవితం ఈయన కలానికి కళ్లెం వేస్తుందేమోనని నాభయం. లేకుంటే వూర్కునేవాడు కాడు.

స్థలాభావం - కాలాభావం చేత యీ నలుగురినే ప్రస్తావించాను. ఇతరులు నొచ్చుకోకూడదు.

వీళ్లూ వాళ్లూ అనేమిటి - యువక రచయితలందరూ - నా విమర్శను సహృదయంతో స్వీకరించి - నిద్రాణమై-నిస్సారమై-పోతూన్న తెలుగు నాటకరంగానికి సరిక్రొత్త కలం కొరడాలతో - మేలుకొలుపులు పాడి ముందుకు ముందుకు వురకలు వేయించాలని నా కోరిక - విన్నపం. అందుకు నా సమీక్ష వుపకరిస్తే సార్థకమవుతుంది.

సెలవు

**(సారస వ్యాసావళి పుస్తకం నుండి(1967))**

కథ

# అశాస్త్రీయం



జి. నరసింహమూర్తి
8977987266

సుబ్బడు అసలు పేరు సుబ్రహ్మణ్యం. ఈ సుబ్రహ్మణ్యం కాస్తా సుబ్రహ్మణ్యస్వామి, తర్వాత సుబ్రహ్మణ్య సిద్ధాంతిగా మారిపోయాడు వాళ్ల వాళ్లకే ఆశ్చర్యమైపోయింది, ఈ 'సుబ్బిగాడు ఎప్పుడయ్యిపోయాడా సిద్ధాంతి' అని

ఎవరెవరు ఎలా యెక్కడ తగలడితే తనకెందుకు, తాను మాత్రం పైపైకి ఎదిగిపోవాలి. వాళ్లని వీళ్లని పట్టుకుని, అవసరమొచ్చిన కాడల్లా యేడ్చి, కనికరించమని కడుపు చూపించి వాస్తు, జ్యోతిష్య సర్టిఫికేట్లు లాంటివి మేనేజ్‌చేశాడు. వాస్తు జ్యోతిష్య పండిత చక్రవర్తి అనే ఓ బిరుదును స్వంత ఖర్చుల మీద ఎక్కడో ఉత్తర భారతదేశం నుంచి సంపాయించి తెచ్చుకున్నాడు గురుడు !

దీని వెనుక ఓ మాస్టర్ మైండ్ ఉంది. అదే అతని మేనమామ. పేరు చెవిపోగుల సోమరాజు. ఇంటిపేరు తెలియదు గాని అతని చెవులకు పోగులు ప్రత్యేకించి, అతనికంటేయెక్కువగా ఊగిసలాడుతుంటాయి గనుక అతనికి చెవుపోగుల సోమరాజుగా ఆ చుట్టుపట్ల చాలా పేరుంది. అంతేకాదు అతనికి మెడ నిండా రుద్రాక్ష దండలు. రెండు చేతివేళ్లకీ రంగురాళ్ల ఉంగరాళ్లు! రంగు రంగుల తాళ్ళు ముంజేతికి, నొసట దట్టమైన విబూది. దాని మీద రూపాయి బిళ్లంత ఎర్రని బొట్టు. అవి చూస్తేనే ధాం మని గడిలోపడిపోతాడు అవతలవాడు.

పిలవకపోయినా అవి అశుభ కార్యాలయినా, తన దగ్గరున్నా జ్యోతిష్యాన్ని మత్తు మందులా ప్రయోగిస్తాడు. సుష్ఠుగా రెండు పూటల్దీ ఒక్కసారి లాగిస్తాడు. వాస్తునో జ్యోతిష్యాన్నో అక్కడ ప్రయోగిస్తాడు. వాళ్లు తేరుకోకముందే నిష్క్రమిస్తాడు. అదీ అతని ఆర్టు !

"వొరేయ్ సుబ్బడూ ! మేనమామగా చెబుతున్నా నీకీ రహస్యం జ్యోతిష్యం, వాస్తూ నీకు కామధేనువులు... కడుపులో నీళ్లు కదలకుండా కోట్లు సంపాయించొచ్చు. 'ఈ రోజుల్లో రాజకీయ నాయకుడైనా అవ్వాలి, లేదా జ్యోతిష్యవాస్తు పండితుడైనా కావాలి. అటు ప్రజలూ, ఇటు రాజకీయ నాయకులూ పడిచచ్చేది వీళ్ల చుట్టూనే... నాయకులు ఓడితే యింటికిపోయి నెత్తిన చెంగేసుకు కూర్చోవాలి. మరి జ్యోతిష్యవాస్తు శాస్త్రజ్ఞుడికి తీరిక ఉందా ఈ లోకంలో? లేదు, బియ్యేలూ, ఎమ్మేలూ తిండికి హామీలివ్వవు. అదే జ్యోతిష్యాన్ని పట్టుకొని ఏ మూలన కూర్చున్నా నీ ఫీజు నీ కొచ్చేస్తుంది – పైగా ప్రభుత్వ ఉద్యోగి అయితే కుక్కిన పేనులా ఉద్యోగమనే రొంపిలో పడి రిటైర్‌మెంటు వరకూ ప్రపంచాన్ని చూసే అవకాశం లేకుండా ఆఫైళ్ల మధ్యే చచ్చి కుళ్లవలసిందే ! కడకి ప్రభుత్వంలో పనిచేసే ఇంజనీర్లకూ, డాక్టర్లకూ ఈ కుక్కిన పేను సామెత అన్వయిస్తూనే ఉంటుంది"

సోమరాజుకి చదువులో తప్ప తక్కిన కొన్ని శాస్త్రాల్లో ప్రవేశముంది. జ్యోతిష్య వాస్తు శాస్త్రమే కాదు తుమ్ముల శాస్త్రం, బల్లి, పిల్లి, చిలక శాస్త్రాలతో పాటు దేవదాసి బస్వీ శాస్త్రం, సారమేయ శబ్ద శాస్త్రం – దీన్నే కుక్కల మొరుగు శాస్త్రం అంటారు.

సుబ్రహ్మణ్య సిద్ధాంతి ఆహార్యం భయంకరంగా ఉంటుంది. కళ్లకు కాటుక తట్టెడు! మెడనిండా మోపుడు పూసల దండలూ, రంగు రంగు రాళ్ల ఉంగరాళ్లు ! అబ్బో ! మాయల ఫకీర్‌కి మొగుడు !

ఓ పక్క కాళికాదేవి ఉగ్రురాలై త్రిశూలంతో మీదకురికే ఫొటో ! సాంబ్రాణి ధూపాలూ, కొబ్బరికాయా, కుంకుమా, పసుపూ వగైరాల్తో అక్కడేదో నరమేధానికి సిద్ధం చేసినట్టు అనిపిస్తుంది.

బయట సుబ్రహ్మణ్య సిద్ధాంతి అపాయింట్‌మెంట్ కోసం ఎదురు తెన్నులు చూస్తున్నాడు కంకటాల సుబ్బారాయుడు. కంకటాల సుబ్బారాయుడు చాలా వ్యాపారాలు చేసిన మనిషి. కలకత్తా నుంచి ముంబాయ్ వరకూ రకరకాల ప్లేటులు మార్చినా ఎందులోనూ నిలబడలేదు. ఉత్తర భారతంలో సుబ్బారాయుడికి చాలామంది చల్లికూడు స్నేహాలూ పాన్ మసాలా పరిచయాలూ ఉన్నాయి.

సుబ్రహ్మణ్య సిద్ధాంతి ఆఫీసులాంటి ఆఫీసు సెటప్ కలక్టర్ కూడా ఉండదు.

రిసిప్షనిస్టు రోజీని చూసిపోవడానికే ఆ ఆఫీసుకి ముసలీ ముతకా వచ్చిపోతుంటారనిపిస్తుంది. రోజీ అసలు సిసలైన తెలుగు పిల్లే. ఇటీవలే ఇంగ్లాండు నుంచి దిగిందేమోననిపిస్తాది. తెలుగును ఇంగ్లీషుగా మాట్లాడతాది.

పదివేలు ఫీజు కట్టనిదే సిద్ధాంతి అపాయింట్‌మెంటు దొరకదని గతంలో సుబ్బారాయుణ్ణి రోజీ తరిమేసింది. ఇప్పుడతను పదివెయ్యి నోట్లుతో వచ్చాడు. రిసెప్షన్లో రోజీకి పది పెళ ఫెళ మనే నోట్లు సమర్పించాడు.

మధ్యాహ్నం ఒంటి గంటకు సుబ్బారాయుడికి లోనకెళ్లే అవకాశం దొరికింది. లోనకెళ్లి తన బాధలన్నీ చెప్పుకొన్నాడు.

అంతకుముందు అపాయిట్‌మెంట్ కోసం పూర్తిచేసిన వివరాల్ని సుబ్రహ్మణ్య సిద్ధాంతి ఓ కంట చూసి, అతని బాక్‌గ్రౌండ్ గురించి ఓ అవగాహన కొచ్చాడు.

మీ అమ్మాయికి అంబానీకి మించిన వాడితో వివాహం అవుతుంది. గ్రహాలన్నీ చాలా అనుకూలంగా ఉన్నాయి. వ్యాపారంలో గురుడు అనుకూలిస్తాడు. కుజుడికీ, శనికీ చాలా ఘర్షణ – తర్వాత ఇద్దరూ శాంతించడంలో పట్టిందల్లా బంగారం సంతానికి ఉద్యోగంలో ప్రమోషన్ అంటూ గబగబా చెప్పేశాడు.

* * *

ఓ నెలరోజులు గడిచాయి. సుబ్రహ్మణ్య సిద్ధాంతి కూర్చున్న ఆఫీసు రూంలోకి ఓ నడి వయస్సాయన ప్రవేశించి "నేను ఈ నగర వినియోగదారుల హక్కుల పరిరక్షణ సంఘ అధ్యక్షుణ్ణి పేరు విజయబాబు" అన్నాడు.

అతనితోపాటు మరో బట్టతల యువకుడు "నన్ను రమేష్ అంటారు. జనచైతన్య వేదిక కార్యదర్శిని. మిమ్మల్ని కొన్ని విషయాలు అడిగేందుకు అనుమతిస్తారని అనుకుంటున్నా" అన్నాడు. సుబ్రహ్మణ్య సిద్ధాంతికి అమాంతంగా లోనకు ప్రవేశించిన వీరినెలా ఎదుర్కొవాలానన్న కంగారు ! "మీరు వృత్తిగా స్వీకరించిన జ్యోతిష్యం, వాస్తులకు శాస్త్రీయత ఉందని మీరు నమ్ముతున్నారా ?" రమేష్ ప్రశ్న.

ఈ లోకాన్ని శాసించేది మా శాస్త్ర జ్ఞానమే. ఈ జ్యోతిష్యాన్ని వాస్తునీ అనుమానించేందుకు ఎవరో మహానుభావుడు బొంబాయి హైకోర్టులో కేసు వేస్తే హైకోర్టు తీర్పేమిటో తెలుసా?" ఘాటుగా ప్రశ్నించాడు రమేష్‌కి ఆ విషయం తెలియదని.

"తెలుసు" అన్నాడు రమేష్.

సుబ్రహ్మణ్యం ఉలిక్కిపడ్డాడు.

"జ్యోతిష్యం నాలుగు వేల సంవత్సరాల పురాతనమైంది. ఎన్నెన్నో కాల పరీక్షలకు తట్టుకుని నిలబడింది. ప్రజల విశ్వాసం పొందింది కనుక అది శాస్త్రీయ విజ్ఞానమే" అని చెప్పింది అన్నాడు రమేష్. "హైకోర్టే దంకా బజాయించి చెబితే మరింతకన్నా ఇంకేం కావాలి?" ప్రశ్నించాడు సిద్ధాంతి తన చెయ్యే పైనుందని. "అనేక మూఢ విశ్వాసాలు కూడ వేలాది సంవత్సరాలుగా ప్రజలు విశ్వసిస్తూ వస్తున్నారు. వాటిల్లో వాస్తూ, జ్యోతిష్యం, హస్త సాముద్రికం లాటివన్నీ ప్రజల్ని మోసగించే మోసపూరిత శాస్త్రాలు. శాస్త్రీయతకు నిలబడవు. అవునా?" ప్రశ్నించాడు రమేష్.

"కొన్నింటిని ఆచరించి తీరాలి"

"అయితే మీ తండ్రి గారు చనిపోతే సాంప్రదాయ ప్రకారం ప్రజల ప్రాచీన విశ్వాసం ప్రకారం మీ తల్లిగారిని కూడా చితి ఎక్కించి చంపేస్తారా? అంటే సతీ సహగమనం. దానిని ప్రభుత్వం నిషేధించింది. వేలాది సంవత్సరాలుగా సాగుతూ వచ్చిన మూఢాచారాలు ప్రజాకంటకాలనీ, దుర్మార్గమని ప్రజలే నమ్ముతున్నారు"

అవును రేపు తన తండ్రిచస్తే తల్లిని భగ భగ మండే చితి మంటల్లో కాల్చి పారేయడమేనా? తన మనస్సు ఒప్పుకోవడంలేదు.

"చూడండి సిద్ధాంతి గారూ ! ఓ మాయల ఫకీరు వేషంలో జ్యోతిష్యం, వాస్తూ, శకునాలూ అంటూ అనేకమందిని మోసగిస్తున్నారు. దీని ద్వారా అనేకమంది తమ జీవితాల్నీ, సొమ్మునూ కోల్పోతున్నారు. వస్తు రూపానగాని, డబ్బు రూపాన గాని ప్రతిఫలం తీసుకుని వినియోగదారుల్ని మోసగిస్తే వినియోగదారుల పరిరక్షణ చట్టాన్ని ప్రభుత్వం 1986, 1988లో రూపొందించి జిల్లా ఫోరాలను నిర్మించింది" అన్నాడు విజయబాబు.

"చూస్తుంటే మీ యిద్దరూ కొన్ని గ్రహ దోషాల్తో పీడింపబడుతున్నారు. మీకు త్వరలో కీడు ముంచుకొస్తుంది. ఆ మాత మిమ్మల్ని విడిచి పెట్టదు" అంటూ తన దగ్గరున్నా ఆయుధాన్ని వాళ్ల మీద అలా ప్రయోగించాడు.

విజయబాబూ, రమేష్ సుబ్రహ్మణ్య సిద్ధాంతి తెలివి తేటలకి నవ్వుకున్నారు. ఇటువంటి మోసగాళ్లు ఉపయోగించే ఆయుధం ఇదేనని వాళ్లకు తెలుసు. ఇంకా ఇటువంటి రకాల మోసగాళ్ళను చూసే ఉన్నారు.

పోలీసు ఇన్‌స్పెక్టర్ ఇద్దరు కానిస్టేబుల్స్‌తో లోనకొచ్చి "సుబ్రహ్మణ్య సిద్ధాంతి గారంటే మీరేనా?" ప్రశ్నించాడు.

పోలీసుల్ని చూడ్డంతోనే కంగారుపడి "అ–అవును" అన్నాడు

## నానీలు

దామరకుంట శంకరయ్య
9440876788



కాగితం
పురుడు పోసుకుంది
ఎన్ని వృక్షాల
త్యాగ ఫలమో !

మట్టికి
మానుకు మొక్కు
మానవ మనుగడకు
అవే దిక్కు

మానవులన్నాక
మమతలుండాలి
కులాల పేర
కుమ్ములాటలెందుకు ?

చెడగొట్టి
చేరదీసుడంటే ?
చెట్లు నరికి
మొక్కలు నాటినట్టు

కూతురుకు
పెళ్లి చేశాడు
తండ్రికి
దశమ గ్రహం పట్టింది

## నానీలు

శ్రీ నాగాస్త్ర
9640317108

పాడలేను
బంగారు మొలతాళ్ళు
రైతులపై
వ్రేలాడుతుండగా ఉరితాళ్ళు



బండెడ్ల మెడల్లో
గంటల సవ్వడులు
మసి బార్చింది
ట్రాక్టర్ పొగగొట్టం

నాలుగు గట్లలోని
మడి కాదు
పొలమంటే
అన్నం గిన్నె

హాలికుడంటే ?
బంజర్లు దున్ని
పీయూషాన్ని పంచి
హలాహలాన్ని మింగేవాడు

సెజ్జల్లుడు
ఇల్లరిక మొచ్చాడు
భూపుత్రులను
బికార్లుగా మార్చాడు

సిద్ధాంతి ఇదేదో ప్రమాదం ముంచుకొచ్చిందని.

"బ్యాంకులో మీ ఆవిడ పదివేల నకిలీ నోట్లు డిపాజిట్ చేస్తుండగా కస్టడీలోకి తీసుకున్నాం"

"ఆ పదివేలూ జ్యోతిష్యం చూపించుకోడానికి కొచ్చిన ఓ ఆసామీ ఇచ్చిపోయాడు"

"అవి నకిలీ నోట్లని మీకు తెలియదా?"

"ఎలా తెలుస్తుంది?" తెల్లమొహం వేశాడు సిద్ధాంతి.

"ప్రజల భూత భవిష్యత్ వర్తమానాల్నీ – వాళ్ల కష్టాల్నీ, నష్టాల్నీ వారి బతుకుల్నీ, విప్పి చెప్పగలిగే అద్భుతమైన శాస్త్రం మీ చేతిలో ఉండగా అప్టరాల్‌తెల్లకాగితాల మీద ఉన్నదేమిటో వాటి స్వభావం యేమిటో చెప్పలేకపోవడం ఆశ్చర్యం" అన్నాడు రమేష్ వ్యంగ్యంగా.

సుబ్రహ్మణ్య సిద్ధాంతిని బయటకు తీసుకొచ్చారు పోలీసులు.

సరిగ్గా, అదే సమయంలో రెవెన్యూ డిపార్ట్‌మెంటు వారి జీపు వచ్చింది. అందులోంచి రెవెన్యూ ఇన్‌స్పెక్టరూ సర్వేయరూ దిగారు.

"సుబ్రహ్మణ్య సిద్ధాంతి గారు ! మీకో నోటీసు... మీరు ఈ బిల్డింగ్ ప్రభుత్వ భూమిని సగం కబ్జా చేసి కట్టించారు."

"కాదు – నా ఆస్థి ఇది"

"అలాగని మీ జ్యోతిష్యం చెబుతుందా వాస్తు చెబుతుందా ?– పోనీ ప్రభుత్వ భూమిని కబ్జా చేసి ఓ దివ్యమైన ముహూర్తములో మీరు నిర్మించిన ఈ మేడని బుల్‌డౌజర్స్‌తో నేల మట్టం చేసేందుకు చట్టం రెడీగా ఉందని మీ గుప్పిట్లో పెట్టుకున్న మీ శాస్త్రాలు ఏమైనా కొన్ని జాగ్రత్తలు ఈ పాటికి చెప్పే ఉండాలి... కాని అవి చెప్పవు – చెప్పలేవు .. వాటి సాయంతో కొందరు ప్రజల్ని మోసగించి బ్రహ్మాండగా బతికేస్తున్నారు" అన్నాడు రెవెన్యూ ఇన్‌స్పెక్టర్.

"మీ జ్యోతిష్యం, వాస్తుల్నీ ప్రజలనెత్తిన పులమడమే గాక పనీపాటా లేని కొందరు తమ ఛాందసానికి శాస్త్రంగా పేరుపెట్టి ఆగమ శాస్త్రం, జాతక శాస్త్రం, పితృ తర్పణ శాస్త్రం, దేవదాసీ బస్వీ శాస్త్రం, లాంటివెన్నో రాసి ప్రజల్ని వంచిస్తున్నారు. ఇవన్నీ ప్రజా ప్రగతికి కంటకమయ్యే విద్రోహ చర్యలే... ఇవి కూడా అందమైన టెర్రరిస్ట్ చర్యలే... ఇదే శాస్త్రం ముసుగులో సాగుతున్న అశాస్త్రీయం.. సైన్స్ పేరుతో అన్‌సైంటిఫిక్‌గా సాగుతున్న ఛీటింగ్..." జీపెక్కండి ఆర్డరేశాడు ఆలోచించే శక్తి గల పోలీస్ ఇన్‌స్పెక్టర్.

# గురజాడ నాటక దృక్పథం చైతన్య వికాసం



మానాపురం రాజా చంద్రశేఖర్
9440593910

గురజాడ పేరు చెప్పగానే ఆధునిక తెలుగు సాహిత్యంలో ముందుగా మనకు స్ఫురణకొచ్చే నాటకం కన్యాశుల్కం. 1892-1902 మధ్య కాలంలో రెండు కూర్పులుగా ఊపిరి పోసుకున్న ఈ నాటకాన్ని సృజించడానికి గురజాడ ఎంతగా తపనపడి, మథనం చెంది, క్లిష్టమైన సంవిధానాన్ని సాధించాడో, దీనిని లోతుగా అధ్యయనం చేస్తే ఆ విషయం మనకు బోధపడుతుంది. వ్యవహారిక భాషలో జనసామాన్యానికి అర్థమయ్యే రీతిలో నాటకాన్ని సరళంగా రాయడమనేది అప్పట్లో మామూలు విషయం కాదు. స్వల్పమైన ఇతివృత్తానికి విశాలమైన సామాజిక భావజాలాన్ని జోడించి నాటక రచన చెయ్యడంలో గురజాడ ప్రజ్ఞ బయటపడింది.

ఆనాటి కాల పరిస్థితులకు అనుగుణంగా సామాజిక జీవితంలోని లోటుపాట్లను సునిశితమైన పరిశీలనా జ్ఞానంతో గురజాడ అధ్యయనం చేశారు. పాత్ర చిత్రణలోనూ, సంభాషణల్లోను సున్నితమైన హాస్యాన్ని చతురతతో పండించి వ్యంగ్యధోరణిలో రక్తి కట్టించారు. మధ్య తరగతి బ్రాహ్మణ కుటుంబాల్లో అవలంభించే మూర్ఖపు పద్ధతులను, తొంగిచూసే లొసుగులను, అమానవీయ చర్యలను ప్రతిభావంతంగా నాటకీకరణ చేశారు గురజాడ. అట్టడుగు వర్గాల బతుకుల్లోని బీభత్సాన్ని కళాత్మకంగా తీర్చిదిద్ది మానవతావాదంతో ఒడిసి పట్టుకోవడంలో గురజాడ ప్రదర్శించిన నేర్పు. చేసిన కూర్పు బహుముఖీనమైనది.

శూద్రకుడు రాసిన మృచ్ఛకటికం ప్రభావంతో సూక్ష్మదృష్టితో పరిశీలించి కన్యాశుల్కంలో గురజాడ చేసిన పాత్రలసృష్టి ప్రముఖుల మెప్పును పొంది రచనాపరంగా ఉన్నత ప్రమాణాలను అందుకుంది. ఆనాటి సాంఘిక వ్యవస్థలో నెలకొన్న పరిస్థితుల నేపథ్యంలోంచి సంఘ సంస్కరణాభిలాష దృష్టితో కన్యాశుల్కం రూపుదిద్దుకుంది. సామాజిక రుగ్మతలను నిర్మూలించి సాంఘిక దురాచారాలను రూపుమాపి, కన్యాశుల్కాలను అంతమొందించి, వితంతువుల పునర్వివాహాలను ప్రోత్సహించి, వేశ్యలకు సంఘంలో సముచితమైన స్థానాన్ని కల్పించడానికి కన్యాశుల్కం నాటకాన్ని గురజాడ ప్రధానాస్త్రంగా ప్రయోగించారు.

సంస్కృతాంధ్ర ఆంగ్ల సాహిత్యాలను లోతుగా మథించి తత్త్వశాస్త్రాన్ని అధ్యయనం చేసిన అనుభవంతో అసంఖ్యాక ప్రేక్షకసమాజానికి నాటకరూపంలో సందేశాన్ని అందించడానికి గురజాడ కంకణం కట్టుకున్నారు. శాస్త్రీయదృష్టి, తార్కికశక్తి, ఉన్నతమైన వ్యక్తిత్వం, లోకజ్ఞాన పరిశీలన, చిత్తశుద్ధి, ఆత్మవిశ్వాసం వంటి లక్షణాలు గురజాడలో సహజంగానే చోటుచేసుకున్న సుగుణాలుగా మనం చెప్పుకోవచ్చు. 19వ శతాబ్దం చివర్లో భారతదేశం స్థితిగతులను అవగాహన చేసుకొని దార్శనిక దృక్పథంలో అభ్యుదయం దిశగా మళ్ళించడానికి మేథోమథనాన్ని కొనసాగించిన వాళ్ళలో గురజాడ ముందువరుసలో నిలుస్తారు.

సమకాలీన జీవితంలోని సంక్లిష్ట సామాజిక పరిస్థితులను ఆకళింపు చేసుకోవడానికి రోజుల తరబడి మథిస్తూ ఆలోచించి అవిశ్రాంత కఠోర శ్రమజీవితాన్ని గడిపిన సాహితీస్రష్ట మన గురజాడ. కన్యాశుల్కం నాటకంలో సమస్యలకు, వాతావరణ కల్పనకు, వాక్యనిర్మాణరీతికి, పాత్ర సృష్టి విధానానికి సృజనాత్మకంగా గురజాడ గిరిగీసుకొని కట్టుబడి ఉండిపోయారు. అజ్ఞానం, అమాయకత్వం, అసూయ, అయోగ్యత, మోసం, మౌఢ్యం, హేతువాద దృక్పథం. సంస్కరణ దృష్టి. ఔదార్య సుగుణం వంటి గొప్ప గొప్ప భావాలెన్నో ఈ నాటకంలో కొకొల్లలుగా రూపుకడతాయి. గ్రామీణ, నగర, సాహిత్య,

కళా వ్యవస్థలతో పాటు సామాజిక బహిరంతర స్వరూప స్వభావాలు, మానవుడి ఆలోచనా సరళి ఎలాంటి పరిణామాలకు లోనయ్యాయో సమూలంగా దృశ్యరూపంలో అద్దంపట్టించి ప్రతిబింబించిందో ఈ నాటకం చెప్పిస్తుంది. ఈ విధంగా ప్రదర్శన యోగ్యతనూ పఠన యోగ్యతనూ సమపాళ్ళలో కలిగిన ఏకైక గొప్ప నాటకం గురజాడ కన్యాశుల్కం. ఇది ఆనాటికి అన్ని విధాలుగా కొత్త నాటకంగా ఆధునీకరించి, సమకాలీనం చేసి, సమాజీకరించి రూపొందించబడింది.

1897 నాటి వ్యవహారిక భాషోద్యమం విప్లవాత్మకమైన మార్పులను తీసుకొచ్చింది. ఈ తీవ్రతలోంచే గిడుగు రామమూర్తి పంతులు గారి 'వాడుకభాషా ఉద్యమం' కోసం గురజాడ 'ఆంధ్ర సాహిత్య పరిషత్తు'ను 1911లో స్థాపించడం జరిగింది. ఈ క్రమంలో పలువురి అధ్యాపకులతోనూ, ఉద్దండ పండిత మేథావులతోనూ సుదీర్ఘ చర్చలు, వాదనలు గురజాడ జరిపారు. దేశంలోని పలు ప్రాంతాలను సందర్శించి ఉన్నతవర్గాల సహచర్యం లభించాక గురజాడ జీవన సరళిపై పాశ్చాత్య నాగరికతా వ్యామోహపు ఛాయలు పడ్డాయి. ఈ ఊపులోనే ఆధునిక తెలుగు సాహిత్యంలో మొట్టమొదటిసారిగా 'పాశ్చాత్యధోరణి'ని గురజాడ సమర్థవంతంగా ప్రవేశ పెట్టగలిగారు. దీనికి జాతీయ - అంతర్జాతీయ నాటకకర్తల రచానాధ్యయనం గురజాడకు పరోక్షంగా సహకరించింది. ఆనాటి అన్ని సామాజిక రుగ్మతలకు మూలకారణం ఆర్థికసూత్రం. దీనిని ఆధారంగా చేసుకొని ఆంగ్లపాలకులు భారతదేశాన్ని ఈ అధోగతి స్థితికి దిగజార్చారు. ఈ అంతర్లీన స్పృహను ధ్వని పూర్వకంగా కన్యాశుల్కంలో కలిగించి అందరి ఆలోచనలనూ తట్టిలేపే విధంగా గురజాడ ప్రయత్నించారు.



ఈ పాశ్చాత్య సంస్కృతి మూలంగా దేశవ్యాప్తంగా హేతువాద దృక్పథం, ప్రాపంచిక వ్యవహార జ్ఞాన, వైజ్ఞానిక దృష్టి, సంస్కార బుద్ధి. దూరదృష్టి వంటి అభ్యుదయ ధోరణులు చోటు చేసుకుని ఆలోచనా పరిధిని విస్తరింపజేసింది. ఈ రకమైన విషయ పరిజ్ఞానమంతా పాశ్చాత్య, ఆధునిక భారతీయ నాటకకర్తల రచనలు చదివి, ఆలోచనా ధోరణిని పెంపొందించుకొని గురజాడ తన జ్ఞానపరిధిని విస్తృత పరుచుకోవడానికి మేథోపరమైన కృషిచేశారు.

ఆధునిక వచన నాటక పితామహుడైన ఇబ్సన్‌తో పాటుగా విలియం షేక్స్పియర్, జార్జి బెర్నార్డ్‌షా, మొలియర్, జాన్‌గే, బెన్‌జాన్సన్ వంటి నాటకకర్తలతో పాటు గిరీష్ చంద్రఘోష్, దీనభందు మిత్ర, మైఖెల్ మధుసూదన దత్తా, అమృతలాల్ బసు, దళపత్‌రామ్, డి.ఎల్.రాయ్, కిర్లోస్కర్, భారతేందు హరిశ్చంద్ర, రణఛోడ్ భాయ్ ఉదయ్‌రామ్, గోవింద భల్లాల్ దేవళ్ మున్నగు దేశీయ నాటకకర్తల నాటక రచనలకు గురజాడ కన్యాశుల్కానికి మధ్య రచనాభేదం పొడసూపినా, నాటకాలలోనిపాత్ర నడుమ పోలికలు అక్కడక్కడా కానవస్తాయి. వీళ్ళలో కొంతమంది సమకాలీన సామాజిక జీవితాల్లోని పాత్రచిత్రణ చేయడం ద్వారా ఈ సామీప్యం ఏర్పడిందని చెప్పవచ్చు. గురజాడ కంటే మరికొంతమంది ముందే నాటక రచనా ప్రక్రియను చేపట్టనప్పటికీ పూర్తిగా వ్యవహారిక భాషలో ఆధునిక నాటక రచనా పద్ధతిని పరిచయం చేసిన ఘనత మాత్రం గురజాడకే దక్కుతుంది.

ఇలా అసంఖ్యాక నాటక రచనలు చేపట్టి లబ్ద ప్రతిష్టులైన రచయితలందరి సరసనా సమస్థాయిలో గురజాడని నిలబెట్టిన ఏకైక నాటకం కన్యాశుల్కం. కాబట్టే ఇన్నేళ్ళయినా ఇది జనబాహుళ్యంలోకి చొచ్చుకుపోయి, పలువురి విమర్శకుల ప్రశంసలను పొందుతూ, ఒక సజీవ నాటక కళాఖండంగా ప్రేక్షక పాఠకుల మనసుల్లో చిరస్థాయిగా నిలిచిపోయింది.

గురజాడకి స్వతహాగా కాల్పనిక ప్రతిభ చాలా తక్కువ. ఈ కారణం వలనే కన్యాశుల్కంలోని పాత్రలను కొన్ని పరిమితులకు లోబడి గురజాడ వాటిని అంతగా విస్తృత పరచలేకపోయాడు. వాస్తవిక జీవితం నుంచి గ్రహించిన పాత్రల స్వభావాన్ని, మనస్తత్వాన్ని విశ్లేషించి, చిత్రికపట్టి ప్రజారంజకమైన నాటకంగా ఆవిష్కరించగలిగాడు గురజాడ. ఇది ఇతిహాసిక స్థాయిని సాధించడంలో నాటకకర్తగా గురజాడలో దాగివున్న అసాధారణమైన ప్రజ్ఞను ప్రతిభరూపంలో వెలికి తీసినట్టయింది.

గురజాడ రాసిన మరో రెండు అసంపూర్ణ రచనలు కొండు భట్టీయం (1906), బిల్హణీయం (1910-11) నాటకాలు. కొండు భట్టీయం నాటకంలో కన్యాశుల్కంలాగే వితంతు వివాహం, వేశ్యా సమస్య. ప్రధాన ఇతివృత్తాలుగా రూపుకడతాయి. పాత్రలను పోలిన పాత్రలు ఇంచుమించు ఒకే తరహాలో ఈ రెండు నాటకాల్లోనూ కనిపిస్తాయి. సంభాషణల తీరూ ఒక్కలాగే ఉంటుంది. కథాపరమైన వస్తువులో ఏవో స్వల్పమార్పులు తప్ప పరిసరాల వాతావరణంలో కూడా ఎలాంటి కొత్తదనమూ ప్రతిబింబించదు. ఆధునిక ఉదారవాదాన్ని అంగీకరించని క్షీణదశ బ్రాహ్మణ కుటుంబాల మనస్తత్వాలు, అయోగ్యతలు, అజ్ఞానం, మూర్ఖత్వం వంటి అంశాలు ఈ కొండు భట్టీయం నాటకానికి ఊపిరిపోసి ఆయువుపట్టుగా నిలుస్తాయి.

బిల్హణీయం నాటకం విషయానికొస్తే ఇది పూర్తి కామోద్రేకపూరితమైన రచనగా చెప్పవచ్చు. రెండు అంకాలుగా సాగిన ఈ నాటకాన్ని ప్రాచీన సాహిత్యానికి సంబంధించిన 12వ శతాబ్దం నాటి బిల్హణకవి ప్రేమగాథతో ముడిపెట్టి శృంగార రస ప్రధానంగా చిత్రించడం వెనుక ఉద్దేశమేమిటో ఒకపట్టాన మనకు అర్థం కాదు. ఇందులోని స్థలకాలాదులు, పాత్రలు కాశ్మీర దేశ చరిత్రకు పరిమితమైనవే తప్ప, తెలుగువారికి సంబంధంలేని కథాంశాన్ని ఇతివృత్తంగా ఎంచుకోవడం మరీ విడ్డూరంగా అనిపిస్తుంది. వాడుకభాషలో కొన్ని ప్రత్యేక పదాలతో కూడిన మాండలికాన్ని ఈ నాటకంలో ఉపయోగించి ప్రయోజనాన్ని పొందాలనుకోవడం కొంచెం ఆశ్చర్యం కలిగించే అంశంగా చెప్పుకోవచ్చు. కథావస్తువుకి సంబంధించిన ప్రదేశానికి. వ్యవహారికంలో లేని వేరొక ప్రాంతపు మాండలికానికి ముడిపెట్టి నాటకాన్ని రక్తికట్టించాలనుకోవడం నిజంగా గురజాడ చేయకూడని ప్రయోగాలలో ఒకటని అధ్యయన పూర్వకంగా మనకి బోధపడుతుంది.

ఈ రకంగా గురజాడ సృష్టించిన ఈ నాటకాలు ఆధునిక తెలుగు సాహితీలోకానికి సరికొత్త దిశానిర్దేశం చేశాయని చెప్పడంలో ఎటువంటి అతిశయోక్తి మనకి కనిపించదు. అంతగా తెలుగు సమాజ, సాహిత్యాలపై తమ ప్రభావాన్ని చూపి ఆధునిక నిర్మాణాత్మక భావాలను వ్యాపింపజేసాయి.

# వికసిత - ఓ ప్రత్యామ్నాయ ఆలోచనా స్రవంతి

వై. సిద్ధయ్య
9490098027




క్షీరసాగరమధనం - దేవతలు, రాక్షసుల ఐక్య కార్యాచరణ. ఈ మధనంలో ముందు విషం, ఆ తర్వాత అమృతం ఉద్భవించాయి. అమృతంలో సింహభాగం దేవతలు కొట్టేశారు. రాక్షసులకు దొరికింది ఖాళీ కుండే. నూతన శాస్త్ర, సాంకేతిక విప్లవం ఐటి. ఇది ఈ తరం యువతీ యువకుల ఆశల సౌధం. ఈ వికసిత ట్యాగ్ పేర్కొన్నట్లు "అది రెక్కలు విప్పిన విజ్ఞానం" ఈ విజ్ఞాన విస్ఫోటనంలో అమృత ఫలాలను మైక్రోసాఫ్ట్, గూగుల్, ఇన్ఫోసిస్ వంటి కంపెనీలు అత్యధికభాగం పోగేసుకుంటున్నారు. స్వల్ప భాగం సైబర్ కూలీ (ఐ.టి. ఇంజనీర్లు పెట్టుకున్న ముద్దుపేరు) లకు విదిలిస్తున్నారు. ఈ జ్ఞాన మధనంలో జనించిన 'పాశ్చాత్య విష సంస్కృతి'ని మాత్రం సైబర్ వుద్యోగులతో పాటు మొత్తం సమాజంపై చిమ్మేస్తున్నారు. ఫలితం నూతన సామాజిక సంఘర్షణలు, కుటుంబ జీవితాల విచ్ఛిత్తి, విచ్చలవిడితనం,... ఫలితం - నూతన భావాల పుట్టుక, సరైన మార్గం కోసం అన్వేషణ... ఈ పరిణామాల ప్రతిబింబమే "వికసిత".

"వికసిత" - ఈ నవల ప్రఖ్యాత సాహితీ సంస్థ 'సాహితీ స్రవంతి' తాజా ప్రచురణ. తలెత్తుకొని సైకిల్ తొక్కుతున్న అమ్మాయి ఫొటోతో, ఐ.టి. రంగాన్ని స్ఫురింపచేసే కేబుల్ నెట్‌వర్క్ గీతలతో అందమైన గెటప్‌తో ఈ పుస్తకం ఆకర్షణీయంగా వెలువడింది. ఈ వర్తమాన తెలుగు సాంఘిక నవలా సాహితీ సాంప్రదాయాలకు ఇది భిన్నంగా, విలక్షణంగా వుంది. ఇందులోని కొన్ని పాత్రలను రచయిత ఉన్నతంగా మలిచారు.

నిత్య - మధ్య తరగతి కుటుంబంలో పుట్టి పెరిగింది. చొరవ, ధైర్యం, కలుపుగోలుతనం ఆమె సొంతం. ఇంజనీరింగ్ కాలేజిలో ఆమెలో అభ్యుదయ భావాలు మొగ్గతొడిగాయి. అమెరికాలో చదివే కాలంలో 'వాల్ స్ట్రీట్ ఉద్యమంతో సంబంధం, అక్షయ్‌తో మెయిల్ సంభాషణలతో ఆ మొగ్గ పరిణతి చెందింది. ఇండియాలో అధ్యయన యాత్రల ద్వారా సాధారణ ప్రజానీకానికి చేరువై, ఉన్నత స్థాయి వ్యక్తిత్వ సౌరభాలు విరజిమ్మే 'పుష్పంలా' వికసించింది. 'జనవాది భారత్' స్థాపించి అంకిత భావం గల సామాజిక మార్పు యజ్ఞానికి నాంది పలికింది. అక్షయ్ - గ్రామీణ వాతావరణంలో పుట్టి పెరిగాడు ఇంజనీరింగ్ కాలేజీలో విద్యార్థి నాయకుడిగా ఎదిగాడు. ఐ.టి ఉద్యోగిగా వుంటూనే పలు ప్రజాహిత కార్యక్రమంలో పాల్గొన్నాడు. అనేకమంది సహ ఉద్యోగుల నుండి అంకిత భావం గల బృందాన్ని తయారుచేస్తాడు. నిత్యను పలు విధాల ప్రోత్సహించి ఆమె ఎదుగుదలకు ఊతం ఇస్తాడు. అక్షయ్, నిత్య మధ్య పరిచయం, స్నేహంగా ఎదిగి, ప్రేమగా పరిణామం చెంది దండల వివాహానికి దారితీస్తుంది. సామాజిక బంధనాలు అధిగమించి తన చెల్లి శ్రావణికి రాజమౌళితో కులాంతర వివాహం జరిపి ఆదర్శ వ్యక్తిగా ఆచరణలో నిరూపిస్తాడు. రాజమౌళి - నిరుపేద దళిత కుటుంబంలో పుట్టి, బాల్యంలోనే ఆదర్శ భావాలతో ప్రభావితుడై, ఇంజనీరింగ్ చదివి, కాలేజి అధ్యాపక వృత్తిని చేపడతాడు. భావోద్వేగాలకు లోనుకాకుండా పలు సామాజిక సమస్యలకు సరియైన పరిష్కారాలు చూపగల పరిపక్వత గల మేధావిగా ఎదిగారు. ఈ క్రమంలోనే ఆకాష్, ఆశ్రిత తయారయ్యారు.

ఈ కాలంలో మన సమాజంలో ప్రవేశించిన పలు ధోరణులకు వికసిత అద్దం పడుతున్నది. అస్థిత్వ ఉద్యమాలలో సానుకూల అంశాలను గమనిస్తూనే, ప్రజల మధ్య ఐక్యతకు ప్రాధాన్యత ఇవ్వాలని రచయిత నొక్కి చెప్పారు. రాజమౌళి పాత్రద్వారా దళిత సమస్యకు సరైన చారిత్రక, రాజకీయ, తాత్విక దృక్పధాలను ఆవిష్కరిస్తారు. శ్రీనివాస్, ఐజాక్, మధువంటి దళిత విద్యావంతుల మధ్య పలు అంశాలపై ఆసక్తికరమైన చర్చలు నడిపిస్తారు. ఒక దశలో రాజమౌళి "నేను దళితవాదం ఎత్తుకుంటే మనకు గుర్తింపు వస్తుంది. కాని ఈరోజు కాలేజిలో మనం నలుగురమే మిగులుతాం. ఉపకులం సమస్యలొస్తే ఇద్దరం అవుతాం. దానికి ప్రాంతం తోడైతే అంతిమంగా మిగిలేది ఒక్కరే" అని హెచ్చరిస్తాడు.

"దళిత ఉద్యమం ఏమీ సాధించలేదంటారా" అనేది ఐజాక్ ప్రశ్న. అందుకు రాజమౌళి "ఎందుకు లేదు. కొన్ని ప్రత్యేక పథకాలు వచ్చాయి. అన్ని పార్టీల్లోను దళితులకు గుర్తింపు పెరిగింది.... కాని అంబేద్కర్ ఆశించినట్లు దళితులకు కుల వివక్ష నుండి విముక్తి లభించలేదు. ఎందుకని?" అంటూ దళితులు ఒంటరి పోరుతో తమకు తాము ఒంటరి చేసుకోరాదు. ఐక్య ఉద్యమాలతో అందరితో కలిసి సమస్యలను సాధించాలన్న సూచన ఆచరణలో రుజువైన సత్యం.

ఐ.టి. రంగంలో ఎక్కువగానూ, మిగిలిన సమాజంలో ఇప్పుడిప్పుడే కుటుంబ వ్యవస్థలో ప్రవేశిస్తున్న ధోరణి - షేర్ ఇన్ ఫ్యామిలీ - సరళీకరణ సంస్కరణలు ఆడ, మగ సంబంధాలలో కొత్త సామాజిక క్రమానికి ద్వారాలు తెరిచాయి. భాను దంపతులు - పేరుకు భార్యాభర్తలు. ఒకే ఇంట్లో వేరు వేరుగా జీవిస్తారు. నచ్చినంతకాలం ఒకటిగా, లేకుంటే ఎవరిదారి వారిదే. ఎవరి డబ్బు వారిదే. కుటుంబంలో ఎవరి ఖర్చు వారిదే. ఒకరి వ్యవహారాల్లో మరొకరు జోక్యం చేసుకోరు. ఇలాంటిదే లివ్ - ఇన్ - రిలేషన్ షిప్. శ్రీకాంత్, రమ్య ఇంజనీరింగ్ కాలేజీలో ప్రేమికులు. శ్రీకాంత్ పెళ్ళి ప్రస్తావన తెస్తే "పెండ్లి అనేది ఒక బానిసచట్రం. నేను అందులో ఇరుక్కోను. ఇష్టమైనంత కాలం కలిసివుంటాం" అంటుంది రమ్య. "సమాజం ఒప్పు కోవాలిగా?" అన్న ప్రశ్నకు "సమాజం అనుమతి మనకు అవసరం లేదు అంటుంది రమ్య. ఆందోళనకరమైన పాశ్చాత్య ధోరణులు ప్రబలుతున్నాయనేందుకు ఇవి చక్కని తార్కాణాలు. పబ్, రేవ్ పార్టీలు - ఇవి ఈతరం ముందుకొచ్చిన తీవ్రమైన సమస్యలు. అక్కడి డ్రగ్ సంస్కృతి... వాటిని ఉపయోగించి ఆడపిల్లలను లొంగదీసుకోవడం. ఈ విష వలయంలో ఎంజాయ్ చేసేది సంపన్నుల పిల్లలు. సొమ్ము చేసుకునేది కార్పొరేట్ సంస్థలు. ప్రియ, ప్రశాంత్ ప్రదీప్ పాత్రల ద్వారా కమ్ముకొస్తున్న ఈ విచ్చలవిడి కల్చర్‌ను కళ్లకు కట్టినట్టు రచయిత అక్షర బద్ధం చేశారు.

సోషల్ ఇంజనీరింగ్ - మరొక ఆందోళనకర అంశం. కులం, మతం, ప్రాంతం పేర విభజించి, జనం మధ్య ఐక్యతను బలహీనపరుస్తున్న క్రమం. దీనికి ప్రతిగా సోషల్ కన్వర్జన్స్ (సామాజిక సంగమం) వివిధ తరగతుల ప్రజలను కలిపి, వారి మధ్య ఐక్యతను పెంచి ఉద్యమ మార్గం పట్టించే ప్రక్రియ. లాటిన్ అమెరికాలో కార్మిక సంఘాలు పునరుజ్జీవనమైన క్రమాన్ని, అక్కడ మారిన పని పద్ధతులను ఈ నవలలో ప్రస్తావించారు. ఫ్లాష్‌మాబ్ - హైటెక్ పేరుతో ప్రజాఉద్యమాలకు దూరంగా వుంటున్న తరాన్ని వీధుల్లోకి కదిలించే నూతన ప్రక్రియ. కేంద్రం పెట్రోల్ రేట్ పెంచింది. అక్షయ, ఆకాష్ బృందం కలిసింది. ఇ-మెయిల్స్ ద్వారా కీలకమైన ప్రజల స్పందన (ఫీడ్‌బ్యాక్)ను సేకరించారు. తగిన కార్యాచరణ పథకం రూపొందింది. ఇ-మెయిల్స్, ఎస్.ఎమ్.ఎస్‌ల ద్వారా పథకం జనంలోకి వెళ్ళింది. సరిగ్గా అనుకున్న సమయానికి హైదరాబాద్-నెక్లస్ రోడ్, పీపుల్స్ ప్లాజా వద్దకు పెద్ద సంఖ్యలో జనం కూడారు. అకస్మాత్తుగా రోడ్డుపైకి దూసుకొచ్చారు. మూడేనిముషాలు ట్రాఫిక్ జాం చేసారు. పోలీసులు వచ్చేలోగా రెప్పపాటులో ఎక్కడి వారక్కడ పక్కకు తప్పుకున్నారు. ఈవిధమైన సాంప్రదాయేతర పని పద్ధతులను రచయిత మనకు పరిచయం చేస్తాడు. సమాజ మార్పుకై జరిగే పోరులో మధ్యతరగతి ప్రాముఖ్యత పెరిగింది. ప్రపంచీకరణపై వారికున్న భ్రమలు పోగట్టి వారిని ప్రజావుద్యమాలలో మమేకం చేయాలి. వారి బలం, బలహీనతల గురించి నిత్య బృందం లోతైన చర్చ జరిపింది. ప్రజా ఉద్యమాలు బలపడే కొద్దీ మధ్య తరగతి తన బలహీనతల నుండి బయటపడి సామాజిక మార్పులో భాగస్వాములౌతాచ్చన్న చారిత్ర అనుభవాన్ని నవల నొక్కి చెప్పింది.

ఇంటా బయటా ఐటి రంగం అశాంతి ఎదుర్కొంటున్నది. ఈ అశాంతి పరిష్కారానికి యాజమాన్యమే బాబాలతో యోగా సెషన్స్ ఏర్పాటు చేస్తున్నది. "సమస్యలు పట్టించుకోవద్దు, రాజకీయాలకు దూరంగా వుండాలి. అన్నిటికీ యోగానే పరిష్కారం" ఇది బాబాల ప్రబోధం. ప్రజల ఆందోళనలను పక్కదోవ పట్టించే క్రమాన్ని పాఠకుల ముంగుంచారు. నిత్య ప్రయాణిస్తున్న రైలు ఆర్డినరీ బోగీలో ప్రయాణీకుల మధ్య రాజకీయ చర్చ "అన్ని పార్టీలు ఒకటిగానే చచ్చాయి." అని ఒకరంటే, మరొకరు. "అందర్నీ కలపొద్దురా! వామపక్షాలు వేరు "అంటూ ప్రత్యామ్నాయం చెబుతాడు." నిజమే వాళ్లు వీధుల్లోకి వచ్చి నాలుగు కేకలేసి పోలీసుల దెబ్బలు తినబట్టే ఈ మేరకైనా జనం బతుకుతున్నారు. "అనుభవం ద్వారా వామపక్షాలను ప్రత్యామ్నాయంగా ప్రజలు గుర్తిస్తున్నారన్న వాస్తవాన్ని పై సంభాషణ ద్వారా ఆవిష్కరించారు.

అవినీతి వ్యతిరేక ఉద్యమ నాయకుడు 'లోకమాన్య' సంస్థ అధినేత శంకరప్ప. "ప్రభుత్వ ఉద్యోగులే అవినీతికి మూలం. లోక్‌పాల్ బిల్లుతో వారికి కళ్ళెం వేస్తాం. దానితో అవినీతి అంతం అవుతుంది" అంటూ దగ్గర మార్గం చెబుతాడు శంకరప్ప. అవినీతికి మూల విరాట్‌లు' కార్పొరేట్ సంస్థలను బిల్లు నుండి మినహాయించాలంటాడు. "వారు లేకపోతే అభివృద్ధి ఆగిపోతోంది... వారికి స్వేచ్ఛ కావాలి." అంటూ వాదిస్తాడు. "సంస్కరణలకు కమ్యూనిస్టులే ఆటంకం" అని నిందిస్తాడు." సంస్కరణల పరిరక్షణకే లోక్‌పాల్" అంటూ సంస్కరణల గుట్టువిప్పింది ఈ నవల.

ఇలా ఎన్నో వర్తమాన సమస్యలకు ఈ నవలను రచయిత చర్చా వేదికగా మలిచారు. ఐ.టి రంగంతో రచయిత వివిఎస్ఆర్‌కు గల సాన్నిహిత్యం, మొత్తం సమాజంపై సునిశిత పరిశీలన అమూల్యమైన నవల రూపకల్పనకు దారి తీసింది. సామాజిక మార్పు లక్ష్యంగా నవలలో ఆవిష్కరించబడిన "జనవాది భారత్" మన ప్రజల ఆకాంక్షలకు ప్రతిబింబం. ఇందులో రూపుదిద్దుకున్న పాత్రలు నిత్య, అక్షయ, రాజమౌళి, ఆకాష్ తదితరులు కాలగమనంలో వికసించి, భావితరానికి శాస్త్రీయ ఆలోచనలు అందించే ముందు యుగం దూతలుగా తీర్చిదిద్దారు. ఈ నవల కేవలం ఐటి రంగానికే పరిమిత కాదు. మొత్తం సమాజగమనానికే మార్గదర్శనం చేస్తున్నది. విద్యావంతులు, ప్రగతిశీల ఉద్యమాలలో, మధ్యతరగతి రంగాలలోని చురుకైన కార్యకర్తలు ఈ నవలను తప్పక చదవాలి. తమ మిత్రులను చదవమని ప్రోత్సహించాలి. నూతన సమాజ సృష్టిలో చురుకైన భాగస్వాములు కావాలి.






## మార్క్సిస్టు సాహిత్య విమర్శ

డాక్టర్ శ్రీనివాస్

వెల : రూ.100/- పేజీలు : 200

ప్రతులకు : ప్రముఖ పుస్తకాల షాపులు

మార్క్సిస్టు సాహిత్య విమర్శకులు, నిన్నటివారూ, ఇప్పటికీ కొనసాగుతున్నవారూ మార్క్సిస్టు సిద్ధాంతాన్ని సరిగ్గా అవగాహన చేసుకోలేదనో, వైదొలిగారనో అనుకున్న సందర్భంలోనూ, ఫెమినిస్టులు మార్క్సిజం మీద చేసిన విమర్శ సందర్భంలోనూ లేదా ఫెమినిజాన్ని మార్క్సిజాన్ని కలిపే ప్రయత్నాలు చేసిన సందర్భంలోనూ శ్రీనివాస్ మార్క్సిజాన్నీ, మార్క్సిస్టు సాహిత్య సిద్ధాంతాన్నీ సరైన దృక్పథంతో స్థాపించడానికి ప్రయత్నం చేశాడు.

- వివి




## యుగ స్వరం

నిఖిలేశ్వర్

వెల : రూ.80/- పేజీలు : 150

ప్రతులకు : 9177881201

నా నిరంతర కవితా సంభాషణ గత ఐదు దశాబ్దాలుగా ఆయా మజిలీలు దాటుతూ సాగింది. వ్యక్తిగా - సమిష్టిగా ఉద్యమంగా కొనసాగిన ఈ యాత్ర, ప్రస్తుతం నా "యుగ స్వరాన్ని" వినిపిస్తూ విభిన్న అనుభవాల ప్రతిస్పందనలుగా ఈ యుగం నాడిని పరికిస్తూ, ఈ కవితలతో మరోసారి మీ సమక్షంలోకి ....

- నిఖిలేశ్వర్




## రాంగ్ వే

ఎస్.ఎమ్. ప్రాణ్‌రావ్

వెల : రూ.80/- పేజీలు : 150

ప్రతులకు : ప్రజాశక్తి బుక్‌హౌస్

'రాంగ్ వే' నిజ విలువలకై ఘోషించే సజీవ నవల. మన ముందూ, మన, వెనుకా, మన చుట్టూ ఆవరించి, ఆవహించి కబంధ హస్తాల్తో మనల్ని ఊపిరాడకుండా చుట్టచుట్టి భయకరంగా లోపలికి లాక్కుంటున్న అవినీతి ఊబి గురించిన బీభత్స నవల 'రాంగ్ వే'.

- నగ్నముని




## నీలి నక్షత్రం

ఎస్. శ్రీదేవి

వెల : రూ.70/- పేజీలు : 148

ప్రతులకు :

somanchisridevi@gmail.com

నీలినక్షత్రం... చంద్రుడి మీంచి చూసినప్పుడు భూమి కూడా అలాగే కనిపిస్తుంది. భూమి మీద గల అపారమైన జలరాశి మీద సూర్యకాంతి పడి పరావర్తనం చెందటం వలన అలా జరుగుతుంది. వీనస్ పక్కన వున్నది గ్రహమా? సౌరకుటుంబంలోకి కొత్తగా వచ్చి చేరిందా? దానిమీద నీళ్ళున్నాయా? ఖగోళ శాస్త్ర ప్రపంచం వూపిరి బిగబట్టింది? అందర్లో దిగ్భ్రాంతి. ఐతే ఎవరూ పైకనలేదు. గమనించనట్టే వూరుకున్నారు. దానికి చాలా కారణాలున్నాయి.

యస్. శ్రీదేవి

## అక్షర కేతనం

కవిత్వం

కేతవరపు రాజ్యశ్రీ

వెల : రూ.75/- పేజీలు : 42

ప్రతులకు : 8500121990




అక్షరం మీద ఏర్పాటు చేసిన ఒక కవి సమ్మేళనంలో "అక్షరమే నా ఆయుధం" అంటూ సమాజంలో జరిగే అన్యాయాలను ఎండగడుతూ కవిత చదివాను. అప్పటి నుంచీ నాకు తెలియకుండానే అక్షరం నా మస్తిష్కంలో నిక్షిప్తమై, ఈ పుస్తకంలో ముక్తకాలుగా రూపొందాయి.

అక్షరాలు పరిమితం
అవి వెదజల్లే
జ్ఞాన పరిమళాలు
విశ్వవ్యాప్తం

- రాజ్యశ్రీ

## నిశ్శబ్ద జలపాతాలు

కథల సంపుటి

పొత్తూరి జయలక్ష్మి

వెల : రూ.80/- పేజీలు : 118

ప్రతులకు : 9490751681



నేటి ఎలక్ట్రానిక్ యుగంలో పాఠకులు కరువై ప్రేక్షకులు ఎక్కువై దృశ్యాన్ని చూసి (టివిలు, సినిమాల ద్వారా) ఇది చాలని సరిపెట్టుకుంటూ ఉంటే, మనో నేత్రం ద్వారా పఠించి అనుభూతి చెందడంలోని రమ్యతని తన కథల ద్వారా అందించగలిగిన మంచి రచయిత్రి శ్రీమతి పొత్తూరి జయలక్ష్మి గారు. 'నిశ్శబ్ద జలపాతాలు' కథా సంపుటి చదువుతుంటే ఎంత ఆహ్లాదంగా అనిపించిందో మాటల్లో చెప్పలేను.

కొమ్మనాపల్లి గణపతిరావు

## రగిలిన క్షణాలు

డా. సి. భవానీదేవి

వెల : రూ.150/- పేజీలు : 123

ప్రతులకు : విశాలాంధ్ర




మూడున్నర దశాబ్దాల కాలం ఎవరి జీవితంలోనైనా చాలా విలువైంది. సాహిత్యం రచయిత స్పందన ప్రతిబింబం. ఇన్నేళ్ళ సాహితీ ప్రస్థానంలో ఎన్ని ప్రక్రియల్లో రచనలు చేస్తున్నా నా అంతశ్చేతన కవిత్వమని నేనెప్పుడో అన్నాను కూడా.

నా బతుకు దీపం
మౌనంగా వెలుగుతుంది
కవిత్వం
ప్రాణవాయువుతో...

కవిత్వాన్ని సామాజిక సందర్భాలనుంచి వేరుచేసి చూడలేం. సమాజానికి సాహిత్యం ఒక అనుబంధ సూత్రం. ఈ నిరంతర కవితా ప్రయాణంలో పదవ కవితా సంపుటిని తెలుగు కవిత్వాభిమానులకు అందిస్తున్నందుకు ఆనందిస్తున్నాను.

**భవాని**

## పాపతల్లి

డా. వాడపల్లి శ్రీరామమూర్తి కథలు

వెల : రూ.60/- పేజీలు : 76

ప్రతులకు : 9346447227




మంచి మంచి కథలనెన్నో ఆయన చదివి కథ చెప్పే టెక్నిక్‌ని, పాత్ర చిత్రణలోని ఔచిత్యాన్ని, వెలకువలని తగినంతగా గ్రహించారని భావిస్తున్నాను. జీవితంలో స్వానుభవం వల్ల, పరిశీలన వల్ల, గాఢమైన ఆలోచన వల్ల, వ్యక్తిగతమైన తపన, ఆర్ద్రత, సంస్కారాలవల్ల, తన కథలకి సమకాలీనతని, చదివించే గుణాన్ని తెచ్చి పెట్టారనిపిస్తోంది.

**- దామెర వెంకట రావు**

## అమృత హస్తాలు

కథానుశీలన

నాగరాజు అసిలేటి

వెల : రూ.85/- పేజీలు : 136

ప్రతులకు : 9290060560




శ్రీగంథం వేంకాస్వామిశర్మ గారు రెండోతరానికి చెందిన కథా రచయిత. మంచికథలు రాసినప్పటికీ కారణాంతరాలవల్ల పెద్దగా ప్రచారంలోకి రాలేకపోయిన రచయిత. ఇటువంటి మంచికథలపై అసిలేటి నాగరాజు పరిశోధన చేసి ఎం.ఫిల్. పట్టా పొందిన సిద్ధాంత వ్యాసమే ఈ గ్రంథం ఈ కథల ఇతివృత్తాలను పరిచయం చేయడంతోపాటు ఈ కథల్లోని సామాజిక చైతన్యం, కథాశిల్పం, దృక్పథం, ప్రయోజనం వంటి అంశాలను పరిశోధకుడు విశ్లేషించడానికి ప్రయత్నించారు.

**- ప్రొ॥ శిఖామణి**

## ఒక్కమాట

(సామాజిక, జీవన దృక్పథం)

సి.సి.రెడ్డి

వెల : రూ.150/- పేజీలు : 216

ప్రతులకు : 9848787284




నా సుదీర్ఘ జీవన ప్రస్థానంలో నేనెంతో జీవితాన్ని చవి చూశాను. ఎన్నో దేశాలు తిరిగాను. ఎంతో మందిని కలిశాను. కష్టాలు, సుఖాలు, కన్నీళ్ళు, ఆనందాలు నన్ను అనుక్షణం తడిపేశాయి. ఆశల అలలపై లేచాను. ఫెల్లుమని పడ్డాను. అందుకే పడిలేచిన కెరటం లాంటిది నా జీవితం. జీవితమనే గురువు ఎంతో నేర్పింది. తొడపాశం పెట్టింది. తొడలపై కూర్చోబెట్టుకుంది. వెనక్కి తిరిగి చూస్తే ఇదంతా అద్భుతం అన్పిస్తుంది.

**- సి.సి. రెడ్డి**

## చెట్టుకి విత్తనం చేపకి సముద్రం పిట్టకి ఆకాశం భాషకి మాండలికం

యక్కలూరి వై శ్రీరాములు

వెల : రూ.100/- పేజీలు : 78

ప్రతులకు : కౌండిన్య ప్రచురణలు




సంవత్సర కాలంగా మాతృభాష, మాండలికాలపై దానిపై ఆధారపడ్డ మన ఆర్థిక వ్యవస్థపై 'నెలవంక నెమలీక' సాహిత్య మాస పత్రికలో సాగిన ఒక సంపూర్ణ పరిశోధనా వ్యాసావళి "చెట్టుకి విత్తనం... చేపకి సముద్రం..." మాండలిక భాషను చదువుల్లోనూ, వృత్తుల్లోనూ, జీవితంలోనూ దూరం చేసుకోబట్టి, అరువు భాషల్లో మెదడునంతా అరగదీసుకుని, అమెరికా జీతం రాళ్ళ ఎరకు చిక్కిన చేపలమయ్యాం.

**లక్కరాజు & దేవి**

## తదేక గీతం - చైతన్య దీపం

సిద్ధాంత వ్యాసం

నెల్లిమర్ల లక్ష్మి

వెల : రూ.60/- పేజీలు : 73

ప్రతులకు : క్రిసెంట్ పబ్లికేషన్స్




కవిలో ఉన్న మట్టివాసననే కాదు - వ్యక్తిత్వ పరిమళాన్నీ ఆమె పసిగడుతూ ఈ సిద్ధాంత వ్యాసాన్ని మనముందుంచగలిగారు. ప్రధానంగా పల్లెభాషను, సంస్కృతినీ ఈ సమాజానికి పరిచయం చేయటానికే ఈ ప్రయత్నం అంటూ వ్యాఖ్యాత్రి తమ తొలి పలుకుల్లో చెప్పటం ఇక్కడ మనం ముందుగా గమనించవలసి ఉంది. "తదేకగీతం"లోని వస్తు, రచనా శిల్పాలను నేటి సామాజిక పరిణామంతో అన్వయించి చెప్పాలన్న ఉద్దేశమే - తనను ఇలా ముందుకు నడిపించిందని కూడా పరిశోధకురాలు నాందీ ప్రస్తావనలో పేర్కొన్నారు.

**- రసరాజు**

# సంక్రాంతి 'రైతు కవనం'




సాహితీ స్రవంతి ఆధ్వర్యంలో 14వ తేదీ ఉదయం కార్మిక కర్షక భవన్, కర్నూలు నందు 'రైతు కవనం' నిర్వహించారు. జిల్లా అధ్యక్షులు జంధ్యాల రఘుబాబు అధ్యక్షతన జరిగిన ఈ రైతుకవనంలో పలువురు కవులు తమ కవితలు వినిపించారు. మకర సంక్రాంతి, రైతుకవిత, రైతేరాజు, రైతు శ్రమ, రైతన్నా నీకు జోహార్లు, రైతునికరం, మొదలైన కవితలను సురేష్, సుధీర్ రాజు, షఫి, విశ్వమోహన్, రఘుబాబు, గుండంపాటి విజయసారధి కవితలు వినిపించారు. కవితల్లో రైతులు ప్రస్తుతం ఎదుర్కొంటున్న సమస్యలు, ఆత్మహత్యలు ప్రతిబింబించాయి. తరువాత మాతృభాష పరిరక్షణ కోసం సాహిత్యాభిమానులు ఏమి చేయాలన్న చర్చ జరిగింది. ప్రభుత్వం తెలుగు భాష పరిరక్షణకు తీసుకోవలసిన చర్యల గురించి, పరభాషా వ్యామోహంపై వక్తలు ప్రసంగించారు. సి.ఐ.టి.యూ నాయకులు రమేష్, నాగేశ్వరరావు నరసింహ 'ప్రజాశక్తి ప్రకటనా విభాగం నుండి గౌడు' సాహితీ ప్రియులు కార్యక్రమంలో పాల్గొన్నారు.

## కవితల పోటీ

జి.వి.ఆర్ ఆరాధన - సాహితీకిరణం, శ్రీ విజయనామ సంవత్సర ఉగాది సందర్భంగా జాతీయ స్థాయి కవితల పోటీ నిర్వహిస్తున్నట్లు నిర్వాహకులు ఒక ప్రకటనలో తెలిపారు. ఈ కవితల పోటీలో రూ. 1000/- చొప్పున 5 సమాన బహుమతులు. కవితలు చేరవలసిన ఆఖరు తేదీ : 28-2-2013. **కవితలు పంపవలసిన చిరునామా : సాహితీకిరణం, ఇ.నం. 11-13-154, అలకాపురి, రోడ్ నం. 3, హైదరాబాద్ - 500 035**




విజయవాడ పుస్తక ప్రదర్శనలో నేషనల్ బుక్‌ట్రస్ట్, ఇండియా న్యూఢిల్లీ నెహ్రూ బాలసాహిత్యం శీర్షికన ప్రచురించిన బాలసాహిత్య అనువాదాలు 'పెట్టెలో పెళ్ళికూతురు', రచన: మనోజ్‌దాస్, అనువాదం: గొల్లపూడి కృష్ణకుమారి, "శ్రీబూకు గంట దొరికింది', రచన: నీతూ శర్మ, అనువాదం: డా. పత్తిపాక మోహన్ రెండు పుస్తకాల ఆవిష్కరణ జనవరి 8న జరిగింది.

# మూడు పుస్తకాలు మూడు పరిచయాలు

అనంతపురంలోని వెన్నెల సహృదయ సాహిత్య వేదిక ఆధ్వర్యంలో స్థానిక ఎన్.జి.వో హోంలో జనవరి 20న 'మూడు పుస్తకాలు – మూడు పరిచయాలు' పుస్తక పరిచయ సభ జరిగింది. డాక్టర్ నాగసూరి వేణుగోపాల్, కోడీహళ్లి మురళీమోహన్ సంపాదకత్వంలో వెలువడిన 'సాహితీ విరూపాక్షుడు విద్వాన్ విశ్వం' అనే పుస్తకాన్ని సింగమనేని నారాయణ పరిచయం చేశారు. కస్తూరి మురళీకృష్ణ రచించిన భయానక కథల సంపుటి ఆ అరగంట చాలు'ను సాత్విక్ పరిచయం చేయగా ఎం. వెంకటేశ్వర రావు కథల సంపుటి 'అదివో... అల్లదివో!'ని టి. రాజారామ్ సభకు పరిచయం చేశారు. ఈ కార్యక్రమానికి డాక్టర్ రాధేయ అధ్యక్షత వహించారు.

సింగమనేని నారాయణ 'సాహితీ విరూపాక్షుడు విద్వాన్ విశ్వం' పుస్తకాన్ని అధ్యయనంచేయడం ద్వారా విద్వాన్ విశ్వం సాహితీ విశ్వరూపాన్ని దర్శించవచ్చని పెన్నేటి పాట కావ్యం రాయలసీమ కరువు కాటకాలను కన్నీటి గాథలని బయటి ప్రపంచానికి తెలియజేసిందని పేర్కొన్నారు. తెలుగులో తొలి హారర్ కథల సంపుటి 'ఆ అరగంట చాలు' 13 విభిన్నమైన భయానక కథలతో పాఠకులను అలరిస్తున్నదని సాత్విక్ అన్నారు. ఎం. వెంకటేశ్వర రావు కథల సంపుటి 'అదివో... అల్లదివో!'ను టి. రాజారాం సమగ్రంగా విశ్లేషిస్తూ పర్యావరణ ప్రమాద ఘంటికలకు ఎవరు బాధ్యులు అని ప్రశ్నిస్తూనే మానవ సంబంధాలను కాపాడుకోవాలని ఈ కథలలో రచయిత సందేశమిచ్చారని అభిప్రాయపడ్డారు.



అధ్యక్షోపన్యాసం చేస్తున్న కవి డా. రాధేయ. చిత్రంలో కస్తూరి మురళీ కృష్ణ, సింగమనేని నారాయణ తదితరులు ఉన్నారు.

ఈ కార్యక్రమంలో వెన్నెల సంస్థ అధ్యక్షులు ఉద్దండం చంద్రశేఖర్, సభ్యులు ముకుందాపురం పెద్దన్న, ఆకుల రఘురామయ్య, ప్రముఖ సాహితీవేత్తలు శాంతినారాయణ, సూర్యసాగర్, జూపల్లి, ప్రేమ్‌చంద్, చిలుకూరి దేవపుత్ర, చంద్రశేఖర శాస్త్రీ(చం), అంకె శ్రీనివాస్, అమళ్ళదిన్నె వెంకటరమణ ప్రసాద్, కైప నాగరాజ, జయసుమన్, తరిమెల అమర్‌నాథ రెడ్డి, కె.వి.ఎస్. చలపతి రెడ్డి ప్రభృతులు పాల్గొన్నారు.

# సాహితీస్రవంతి ఆధ్వర్యంలో తెలుగు 'ఉత్తీర్ణత'పై చర్చ

సాహితీస్రవంతి ఆదోని డివిజన్ కమిటీ ఆధ్వర్యంలో జనవరి 14న పదవ తరగతి 'తెలుగు ఉత్తీర్ణత'పై చర్చా కార్యక్రమం జరిగింది. ఆదోని పట్టణంలోని నెహ్రూ స్మారక ఉన్నత పాఠశాలలో జరిగిన ఈ చర్చలో ఉపాధ్యాయ సంఘాలు, తెలుగు భాషా పండితులు, ప్రధానోపాధ్యాయులు పాల్గొన్నారు. ఆసక్తికరంగానూ, ఆలోచనాత్మకంగానూ జరిగిన ఈ కార్యక్రమంలో కొన్ని సూచనలూ, అభిప్రాయాలూ వ్యక్తమయ్యాయి. చర్చ అనంతరం మెరుగైన ఫలితాలను సాధించడానికి ఉపయోగపడే అంశాలతో తీర్మానాలను ఆమోదించడం జరిగింది. తీర్మాన పత్రాన్ని సాహితీస్రవంతి జిల్లా కమిటీ ఆధ్వర్యంలో కర్నూలు జిల్లా కలెక్టర్ సుదర్శన్ రెడ్డి, డి.ఇ.ఓ. బుచ్చన్నలకు అందజేయడం జరిగింది. రాష్ట్రంలో మాతృభాష తెలుగులో ఫెయిల్ అవుతున్నవారి సంఖ్య ఏడాదికేడాది పెరుగుతూనే ఉన్నదని, ఈ ఏడాది పరీక్షలకు సమయం రెండు నెలలే మిగిలి ఉన్నందున ఏయే పాఠ్యాంశాలు, ఏ సాహిత్యాంశాలు, వ్యాకరణాంశాలపై దృష్టి కేంద్రీకరించాలో ఆ అంశాలతో నివేదిక రూపొందించి అందజేశామని సాహితీస్రవంతి అధ్యక్ష కార్యదర్శులు జంధ్యాల రఘుబాబు, కెంగారమోహన్‌లు ఒక ప్రకటనలో తెలియజేశారు. పదవతరగతి పరీక్షల్లో ఏ ఒక్క విద్యార్థి మాతృభాష తెలుగులో ఫెయిల్ కాకుండా ఉండేందుకు ఈ ప్రయత్నం చేశామని తెలిపారు. కర్నూలు జిల్లా కలెక్టర్‌ను కలిసిన వారిలో కర్నూలు జిల్లా యుటిఎఫ్ ప్రధాన కార్యదర్శి కె. సురేష్ కుమార్, కార్యదర్శి ప్రతాప్, వీరారెడ్డి, సాహితీస్రవంతి జిల్లా కమిటీ సభ్యులు ఉన్నారు.



కర్నూలు జిల్లా సాహితీస్రవంతి, యుటిఎఫ్ ఆధ్వర్యంలో జరిగిన 'తెలుగు ఉత్తీర్ణత'పై చర్చా నివేదికను కలెక్టర్‌కు అందజేస్తున్న దృశ్యం

## శాస్త్రీయ దృక్పథంతోనే తెలుగు భాషాభివృద్ధి




శాస్త్రీయ దృక్పథంతో పనిచేస్తేనే తెలుగుభాషాభివృద్ధి సాధ్యమవుతోందని సాహితీ స్రవంతి రాష్ట్ర అధ్యక్షులు తెలకపల్లి రవి అన్నారు. అయితే దురదృష్టవశాత్తూ భాషాభివృద్ధికి శాస్త్రీయ దృక్పథం, చిత్తశుద్ధి, కార్యాచరణా లేవనీ, నిర్ణయాలు చేయడం తప్ప అమలు చేసే యంత్రాంగం లేదనీ ఆవేదన వ్యక్తం చేశారు. విజయవాడ స్వరాజ్య మైదానంలో ఏర్పాటు చేసిన 24వ పుస్తక మహోత్సవంలో నండూరి రామమోహనరావు సాహిత్యవేదికపై 'గోర్కీ కథలు' పుస్తకాన్ని డిసెంబర్ 7న ఆయన ఆవిష్కరించారు. అనంతరం 'భాష - సంస్కృతి - సమాజం' అనే అంశంపై ప్రసంగించారు. తెలుగు భాషాభివృద్ధికి ప్రజాస్వామిక స్ఫూర్తితోపాటు ఆధునిక దృక్పథం ఉండాలన్నారు. భాషను, సంస్కృతిని రక్షించుకోవడానికి ప్రతి ఒక్కరూ కృషి చేయాలన్నారు. ప్రముఖ కవి, విమర్శకులు అద్దేపల్లి రామమోహనరావు మాట్లాడుతూ సాహిత్యానికి గోర్కీ మంచి దృక్పథం ఇచ్చారన్నారు. రచయిత దృష్టిని, ఎవరిని గురించి ఎలా రాయాలో తెలియచేసిన వ్యక్తి గోర్కీ అన్నారు. ఇప్పటి రచయితలు గోర్కీ కథలను చదవాల్సిన అవసరం ఉందన్నారు. 'గోర్కీ కథలు' పుస్తక అనువాదకులు కె. కేశవరెడ్డి మాట్లాడుతూ గోర్కీ సాహిత్యాన్ని ప్రతి ఒక్కరూ తెలుసుకోవాలనే ఉద్దేశంతోనే వీటిని అనువదించినట్లు తెలిపారు. గోర్కీ సాహిత్యం పట్ల ఎంతో మంది మక్కువ చూపుతున్నారని పేర్కొన్నారు. సాహితీ స్రవంతి నగర అధ్యక్షులు డాక్టర్ రావెళ్ల శ్రీనివాసరావు అధ్యక్షతన జరిగిన సభలో ఆంధ్రా ఆర్ట్స్ అకాడమీ కార్యదర్శి గోళ్ల నారాయణరావు 'గోర్కీ కథలు' తొలి ప్రతిని స్వీకరించారు. శ్రీశ్రీ ప్రింటర్స్ అధినేత విశ్వేశ్వరరావు తదితరులు పాల్గొన్నారు. ముందుగా అతిథులను సాహితీ స్రవంతి ఉపాధ్యక్షులు గుండు నారాయణరావు వేదికపైకి ఆహ్వానించగా, జిల్లా అధ్యక్షులు కె. సత్యరంజన్ వందన సమర్పణ చేశారు.

## ఆరెట్టి నారాయణ సంస్మరణ



నిజామాబాద్ జిల్లా సాహితీస్రవంతి బాధ్యులుగా పనిచేసిన ఆరెట్టి నారాయణ ప్రథమ వర్ధంతి జనవరి 12న నిజామాబాద్ పట్టణంలో అంబేద్కర్ భవన్‌లో జరిగింది. ఈ కార్యక్రమంలో సాహితీస్రవంతి రాష్ట్ర ప్రధాన కార్యదర్శి కె. ఆనందాచారి ముఖ్య అతిథిగా పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆయన మాట్లాడుతూ ప్రజా ఉద్యమాలతోనూ, సాహిత్య సాంస్కృతిక రంగంలోనూ సుదీర్ఘ అనుభవం గల ఆరెట్టి నారాయణ జీవితం ఆద్యంతం స్ఫూర్తిదాయకం అన్నారు. ఆరెట్టి భావాలకు అనుగుణంగా ఈ రోజున మరింత సంకల్పంతో పనిచేయాల్సిన పరిస్థితులు నెలకొన్నాయని అన్నారు. సాహిత్య సాంస్కృతిక ఉద్యమాలలో పనిచేసే వారికి ఆరెట్టి భావాలు ప్రేరణనిస్తాయన్నారు. ఈ కార్యక్రమంలో ఆరెట్టిపై శిల్పాజగదీష్, పేక్‌మల్ విజయలక్ష్మి ఆలపించిన గేయాలు సభికులను అలరించాయి. ఆరెట్టి నారాయణ జీవిత విశేషాలను తెలిపే అంశాలతో కూడిన 'అవిశ్రాంత పోరు తరంగ' పుస్తకాన్ని ఈ సందర్భంగా ఆవిష్కరించారు. ఈ కార్యక్రమంలో వి.పి. చందన్‌రావు, బైసరాందాస్, అంగిరేకుల సాయిలు, సిర్ప నాగయ్య ప్రసంగించారు. షహీద్, వై. సాయన్న, కె. రాజారాం, యం. చిన్నయ్య, బియన్‌బి, మల్లవరపు విజయలక్ష్మి తదితరులు సభలో పాల్గొన్నారు. ఈ సందర్భంగా ఆరెట్టి రచించిన 'గుట్కా' నాటకంలోని భాగాలను ప్రదర్శించారు. ఆరెట్టి చిత్రించిన చిత్రాల ప్రదర్శన ఏర్పాటుచేశారు.



ఇటీవల త్యాగరాయగాన సభలో వంశీ విజ్ఞానపీఠం (హైదరాబాద్) వంగూరి ఫౌండేషన్ ఆఫ్ అమెరికా వారి నూతన సంవత్సర కవి సమ్మేళనంలో స్వీయకవితాగానంచేస్తున్న తంగిరాల చక్రవర్తి, చిత్రంలో వంగూరి చిట్టెం రాజు, జి. వల్లీశ్వర్ ఎడిటర్ (ఆంధ్రప్రదేశ్ మాసపత్రిక) మంగళగిరి ఆదిత్యప్రసాద్ (డైరెక్టర్, దూరదర్శిని) ఈశ్వరరెడ్డి (విశాలాంధ్ర మేనేజర్) తెన్నేటి సుధాదేవి (వంశీ కళాపీఠం)



సుద్దాల అశోక్‌తేజ "నేలమ్మా నేలమ్మా గేయరూప కవిత్వం పరిశీలన" పుస్తకావిష్కరణ దృశ్యం. డిసెంబరు 16న హన్మకొండలో జరిగిన సభలో పాల్గొన్నవారు – శంకర్‌రావు, వాడ్రేవు చినవీరభద్రుడు, సుద్దాల అశోక్‌తేజ, గోపగాని రవీందర్, వి.ఆర్. విద్యార్థి, బన్న అయిలయ్య, రామాచంద్రమౌళి, ఉదారి నారాయణ, వీరాచారి.

## పరకాల పట్టాభిరామారావు కన్నుమూత



స్వాతంత్ర్య సమరయోధులు, రచయిత పరకాల పట్టాభి రామారావు డిసెంబర్ 23న విజయవాడలో తుదిశ్వాస విడిచారు. పట్టాభి రామారావు 1920లో పశ్చిమ గోదావరి జిల్లా కవిటంలో జన్మించారు. చిన్ననాటి నుండి సోషలిస్టు భావాలతో ఎదిగారు. అనేక సామాజిక, సంస్కరణ ఉద్యమాల్లో పాల్గొన్నారు. తొలుత జాతీయోద్యమంలోనూ, అనంతరం కమ్యూనిస్టు ఉద్యమంలోనూ పాల్గొన్నారు. తొలితరం జర్నలిస్టుల్లో ఆయన ముఖ్యులు. ఆయన భూస్వామ్య, జమీందారీ వ్యతిరేక ఉద్యమాల్లోనూ పాల్గొన్నారు. కులాంతర వివాహాలు, స్త్రీవిద్య, రాజకీయ ఉద్యమాల్లో పాల్గొని జైలు జీవితం గడిపారు. సామాజిక సమస్యలు, తెలుగు భాష, సాహిత్యం, సోషలిజంపై పట్టాభి రామారావు అనేక రచనలుచేయడంతోపాటు, వివిధ గ్రంథాలనూ అనువదించారు. ఆసియా గుండెల్లో బాకు, డిగాగోర్షియా, సాంస్కృతిక పునరుజ్జీవనమా? మతమౌఢ్య పునరుజ్జీవనమా? మహిళా ఉద్యమ సమస్యలు, పెషావర్ నుండి మీరట్ వరకూ కమ్యూనిస్టులపై కుట్రలు, తెలుగు పత్రికా రంగం వంటి రచనలు చేశారు. ఆంధ్ర జాతీయ పునరుజ్జీవనంలో కమ్యూనిస్టు పార్టీల మహోజ్వల పాత్ర, విశాలాంధ్ర సంపాదక వర్గంలో 50 ఏళ్ల అనుభవాలు - జ్ఞాపకాలు, అతివాద పెడధోరణిని అధిగమించి కమ్యూనిస్టు లందరూ ఏకం కావాలి వంటి గ్రంథాలు రాశారు. ఆయన రచనలు విశేష ప్రాచుర్యం పొందాయి. పలు అవార్డులు లభించాయి. 1981లో సోవియట్ భూమి నెహ్రూ అవార్డు, 1999లో ఢిల్లీ తెలుగు అకాడమీ పురస్కారం, 2001లో పొట్టి శ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం జర్నలిజంలో ప్రతిభా పురస్కారం, 2008లో స్వాతంత్ర్య సమర యోధునిగా ప్రపంచ తెలుగు సమాఖ్య పురస్కారం పొందారు.

## సీనియర్ పాత్రికేయుడు కొల్లి సత్యనారాయణ మృతి



ప్రముఖ వామపక్ష రచయిత, సీనియర్ పాత్రికేయుడు, ఉద్యమకారుడు కొల్లి సత్యనారాయణ (90) డిసెంబర్ 25 రాత్రి హైదరాబాద్‌లో కన్నుమూశారు. గుంటూరు జిల్లా తెనాలి సమీపంలోని వెల్లటూర్ గ్రామంలో జన్మించిన ఆయన చిన్నతనంలోనే కమ్యూనిస్టు భావాలకు ఆకర్షితులయ్యారు. 1968లో నక్సల్బరీ పంథాను బలపరిచారు. 1950, 60 దశాబ్దాల్లో విశాలాంధ్ర, జనశక్తి పత్రికల్లో పాత్రికేయునిగా పనిచేశారు. అనంతర కాలంలో ఆంధ్రజ్యోతి, ఆంధ్రప్రభ, ఉదయం దినపత్రికల్లో పనిచేశారు. పెద్దలమాయం-పిల్లల రాజ్యం, వియత్నాం గెరిల్లా, కొడుకులూ కూతుళ్ళు, లెనిన్ తాతయ్య వంటి పలు పుస్తకాలు రాశారు.

## మహిళా రక్షణలో ప్రభుత్వం విఫలం

మహిళలపై అత్యాచారాలు, హత్యలు, దాడులు నివారించడంలో కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు ఘోరంగా విఫలమయ్యాయని ఐద్వా రాష్ట్ర కార్యదర్శి కె. స్వరూపరాణి ఆగ్రహం వ్యక్తం చేశారు. సాహితీ స్రవంతి నగరకమిటీ ఆధ్వర్యంలో డిసెంబర్ 25న సుందరయ్య విజ్ఞాన కేంద్రంలో నిర్వహించిన 'నిర్భయకు నీరాజనం' సదస్సుకు సాహితీ స్రవంతి నగర నాయకులు శాంతిశ్రీ అధ్యక్షత వహించారు. సదస్సుకు ముఖ్యఅతిథిగా హాజరైన స్వరూప రాణి మాట్లాడుతూ ప్రపంచ వ్యాప్తంగా కదిలించిన నిర్భయ ఘటన తర్వాత కూడా ఒక్క ఢిల్లీలోనే మహిళలపై హింసకు సంబంధించి 45 కేసులు నమోదుకావడం విస్మయాన్ని కలిగిస్తోందని ఆమె ఆందోళన వ్యక్తం చేశారు. సరళీకరణ విధానాల అమలు తర్వాత ఫ్యూడల్ లక్షణాలు, వ్యాపారీకరణ మితిమీరిన పద్ధతిలో విస్తరించిందని అన్నారు. మోటూరి ఉదయం ట్రస్ట్ ప్రధాన కార్యదర్శి పుతుంబాక భారతి మాట్లాడుతూ మానవ మృగాల నుంచి రక్షించుకునేందుకు తగిన విధంగా మహిళలు తయారు కావాలని సూచించారు. అనంతరం సింహాద్రి నాగశిరీష జనకవనం నిర్వహించారు. పలువురు కవులు, ఔత్సాహికులు స్త్రీలపై చదివిన కవితలు సభికులను ఆలోచింపచేశాయి. ఈ కార్యక్రమంలో




డిసెంబర్ 25న సాహితీ స్రవంతి హైదరాబాద్ నగర కమిటీ ఆధ్వర్యంలో జరిగిన 'నిర్భయకు నీరాజనం' సదస్సు & జనకవనంలో ప్రసంగిస్తున్న ఐద్వా రాష్ట్ర కార్యదర్శి స్వరూపరాణి

సాహిత్యవేత్త మోతుకూరి నరహరి, సాహితీ స్రవంతి రాష్ట్ర కార్యదర్శి వొరప్రసాద్, నగర కార్యదర్శి జి. యాదగిరిరావు, నాయకులు తంగిరాల చక్రవర్తి, ఐద్వా నాయకులు ఇందిర, చల్లా లీలావతి, ఎండి మీన, పొత్తూరి సుబ్బారావు, పూసల రజనీ గంగాధర్, విజయశాంతి, బుచ్చిరెడ్డి, రామకృష్ణ, రత్నా మహీధర్, సలీమా, ఆనంతోజు కృష్ణ, కేతవరపు రాజ్యశ్రీ, గిన్ని ఆనందరావు తదితరులు పాల్గొన్నారు.

Printed, Published and owned by **V. Krishnaiah** 1-1-298/4, Street No-1, Ashoknagar, Hyderabad-20,
Printed at Prajashakti Daily Printing Press, 1-1-60/2, M.B. Bhavan, Musheerabad, Hyderabad,

# ముఖ్దూం మొహిద్దీన్

04.02.1908-24.08.1969



హైదరాబాద్‌లో సీనియర్ కమ్యూనిస్టు నాయకుడు
తెలంగాణా పోరాటానికి తోడు నిలిచిన యోధుడు.
ప్రసిద్ధ ఉర్దూ కవి, వక్త.

SHAITYA PRASTHANAM RNI N0.APTEL/ 2004/18396 Postal Regd. No.H/SD/415/13-15



# ాశక్తి బుక్‌హౌస్ తాజా ప్రచురణలు



వెల: రూ. 150/-



వెల: రూ. 200/-



వెల: రూ. 50/-



వెల: రూ. 50/-



వెల: రూ. 30/-



వెల: రూ. 70/-



వెల: రూ. 20/-



వెల: రూ. 70/-



వెల: రూ. 15/-



వెల: రూ. 50/-



వెల: రూ. 50/-



వెల: రూ. 20/-



వెల: రూ. 20/-



వెల: రూ. 50/-



వెల: రూ.100/-



వెల: రూ. 10/-



వెల: రూ. 40/-



వెల: రూ. 25/-



వెల: రూ. 20/-



వెల: రూ. 150/-

ప్రతులకు: ప్రజాశక్తి బుక్‌హౌస్, ఫోన్: 040-27660013 27608107, ఫ్యాక్స్: 04027635136

**If Un delivered please return to :** Prasthanam, C/o M.H.Bhavan, Plot No. 21/1, Azamabad
Near RTC Kalyanamandapam, Hyderabad - 500 020 (A.P), Ph: 040-27660013, Cell: 9490099059



**మనసు ఫౌండేషన్**

**పుస్తకాల పరిశీలనాపట్టిక**

| | |
|---|---|
| పుస్తకం సంఖ్య | PRSVM02A146 |
| పుస్తకం పేరు | ప్రస్థానం |
| తారీఖు | 25-5-24 |
| ముందు అట్ట | yas |
| వెనుక అట్ట | yas |
| మొత్తం పేజీలు | 053 |
| పెద్ద సైజు పేజీలు | NO |
| ఖాళీ పేజీలు | NO |
| లేని పేజీలు | NO |
| తయారు చేసినది | KDaveed |
| పేజీలు విడదీసినది | KDaveed |
| స్కాన్ చేసినది | Gayatri |
| పరీక్ష చేసినది | HEMA |
| పేజీలు సరిచూసినది | |
| బైండింగు చేసినది | |
| ప్యాకింగు చేసినది | |
| స్కాన్ చెయ్యనివి | |
| తప్పులు | NO |
| పరిస్థితి | Good |